# శ్రీ శ్రీ కి నివాళి



ట్యాంక్‌బండ్‌పై శ్రీశ్రీ విగ్రహం వద్ద సాహితీ స్రవంతి నివాళి;
జ్వాలాముఖి,తెలకపల్లి రవి, ద్వా.నా. శాస్త్రి ప్రభృతులు

---

విజయవాడలో శ్రీశ్రీ సభా మందిరాన్ని ప్రారంభిస్తున్న వి.ఆర్. బొమ్మారెడి,








సభలో ప్రసంగిస్తున్న తిరుపతి శ్రీ వెంకటేశ్వర

PRSUH02A120

సాహిత్య
# ప్రస్థానం
ఏప్రిల్ - జూన్ 2006
సంపుటి : 4 సంచిక : 15

## శ్రద్ధాంజలి

ఇటీవలి కాలంలో ప్రముఖ సాహిత్యకారులు మనకు దూరమైనారు.

తెలుగు కవిత్వంలో ప్రయోగాలకు ప్రతీకగా నిలిచిన ప్రతిభాశాలి పఠాభి. సంప్రదాయంపై తిరుగుబాటుకు సూచికగా పద్యాల నడ్డి విరగ్గొడతానంటూ బయిలుదేరిన వాడు. ఇప్పుడు చాలా మంది కవులు గుర్తిస్తున్న అర్బేనిటీ ప్రభావాలను అలనాడే అనుభవించి అక్షరీకరించిన వ్యక్తి. సాహిత్య సంచారి, చిత్ర సంస్కారి. భార్య స్నేహలతతో కలసి కళాఖండాలు సృష్టించిన వాడు, సోషలిస్టు ఉద్యమాలలో సంచరించిన వాడు. అభిప్రాయాలలో తేడాలేమైనా అంత సంపూర్ణమైన, బహుముఖీనమైన సార్థక జీవితం గడిపిన రచయితలు అరుదుగానే వుంటారు.

తెలుగు పత్రికల భాష్యకారుడుగా చెరగని ముద్ర వేసిన వారు బూదరాజు రాధాకృష్ణ. ఎన్నో రకాలుగా విస్తరించిన తెలుగు మీడియాలో కొత్త తరాలకు భాషా సమస్యల లోతుపాతులు చెప్పడానికి, కనీస సూత్రాలు నేర్పడానికి శాయశక్తులూ ధారపోసిన వారు.

కె.ఆర్.కె.మోహన్ సీనియర్ రచయిత, సమీక్షకుడు, డెబ్బై ఏళ్ల పై వయసులోనూ ఎంతో చురుగ్గా సాహిత్య సభల్లో కనిపించేవ్యక్తి. స్నేహశీలి. సైన్స్ కథల రచనలో విశేషంగా కృషి చేసిన వారు. ఇటీవలి వరకూ పిల్లల శీర్షికలలో ప్రత్యేక శ్రద్ధతో కథలు రాస్తూ వచ్చారు.

చలం ప్రాణాధికంగా ప్రేమించిన కుమార్తె. సౌరిస్ ఆయన ఆశలకూ ఆశయాలకూ ప్రతినిధిగా సాహితీ మిత్రుల మన్నన పొందిన వ్యక్తి. స్వయానా రచయిత్రి. ఆయన మరణానంతరం ఆమె వారందరికి అభిమానాన్ని పంచిపెడుతూ వచ్చారు. చాలా కాలం అస్వస్తతతో వుండి కన్నుమూశారు.

వీరందరికీ సాహిత్య ప్రస్థానం శ్రద్ధాంజలి ఘటిస్తోంది.

ముఖచిత్రం : కళా సాహిత్య ద్వయం - పట్టాభి, స్నేహలత

లోపలి చిత్రాలు : అక్బర్, పాండు, రవినాగ్

## ఈ సంచికలో...



సంపాదకుడు
తెలకపల్లిరవి
ముద్రాపకులు, ప్రచురణకర్త
వి. కృష్ణయ్య
మేనేజర్
కె. లక్ష్మయ్య

ఎడిటోరియల్ బోర్డ్ అడ్రస్ :
సాహిత్య ప్రస్థానం
1-1-187/1/2,
వివేక్‌నగర్, చిక్కడపల్లి,
హైదరాబాద్-500 020
ఫోను : 27660013, 27635136

# గమనం




ఎస్. త్రివేణి

[redacted]

"అమ్మకి బీపీ ఏమిట్రా? అసలేమైంది?' రైలు దిగుతూనే ఆతృతగా అడిగింది సౌజన్య. రిసీవ్ చేసుకోవడానికి వచ్చిన తమ్ముడిని. తల్లి హైబీపీ కారణంగా హాస్పిటల్లో చేర్చబడిందన్న విషయం ఆమెకి అపనమ్మకాన్ని కలిగిస్తోంది... చాలా.

దినకర్ వెంటనే జవాబివ్వలేదు. ఆమె చేతిలోంచి బేగ్ అందుకుని జనాన్ని తప్పించుకుంటూ నడుస్తున్నాడు. అతడి వెనకే వస్తూ అదే విషయాన్ని గురించి ఆలోచిస్తోంది సౌజన్య.

తండ్రికి రైల్వేలో ఉద్యోగం. ఎప్పుడూ కేంపుల మీద తిరిగేవాడు. తామిద్దరినీ చాలా జాగ్రత్తగా పెంచుకొచ్చింది తల్లి. స్కూలుకి తీసుకెళ్ళి తీసుకురావడం, అనారోగ్యాలూ కొంత వయసొచ్చేదాకా. వయసుతో పాటు మౌలిక రూపాన్ని మార్చుకున్నా తాము పెద్దవుతున్న కొద్దీ యింకెన్నో ప్రాబ్లమ్స్. అన్నిటినీ సమర్ధవంతంగా నిర్వహించుకొచ్చిన వ్యక్తి... దేనికీ చలించకుండా తండ్రి సహకారం తమకి లేకపోవడం ఒక లోటని కాకుండా సహజ పరిణామంగా నిర్వచించిన వ్యక్తి. అంతర్గత వత్తిడి కారణంగా అనారోగ్యం పాలై హాస్పిటల్లో చేరటమనేదాన్ని ఆమె జీర్ణించుకోలేకపోయింది. అందుకే ఆమె ధ్యాస తమ్ముడి జవాబు మీద కన్నా సమస్య విశ్లేషణ మీద ఎక్కువగా ఉంది.

ఏం జరిగింది అమ్మకి? పైకి అలా నవ్వుతూ నిండుగా కనిపించినా లోలోపల బాధపడేదా? ఏ సమస్యనేనా తెలివిగా పరిష్కరించడం ఆమె బహిర్భాగమా? అంతరంగంలో వేరే విధంగా వుండేదా? సౌజన్య ఆలోచనలు ఆగటం లేదు.

ఇద్దరూ స్టేషన్ బైటకొచ్చారు.

"నువ్విక్కడే వుండు. నేను బైక్ తెస్తాను" అన్నాడు దినకర్.

ఆమె ఆగిపోయింది. అతనెళ్ళి బైక్‌తో తిరిగి రావడానికి ఐదు నిమిషాలు పట్టింది. ఈ కాస్త వ్యవధిలో మరికొన్ని ఆలోచనలు... మరింత విశ్లేషణ...

"ముందు హాస్పిటల్‌కెళ్ళి అమ్మని చూసి యింటికెళ్దాం..." అంది.

అతను అంగీకారసూచకంగా తలూపాడు.

"అసలేం జరిగింది? నాన్న కూడా రిటైరైపోయాడు. ఇద్దరూ హ్యాపీగా వుండక ఎందుకిలా టెన్షన్ పెంచుకుంటోంది అమ్మ? అయినా పడాల్సిన టెన్షనంతా మన చిన్నతనాల్లోనే పడి వుండాలి..." మళ్ళీ ఎన్నో ఆలోచనలు... జ్ఞాపకాలు. తమ్ముడు స్కూల్లో ఆటలాడి దెబ్బలు తగుల్చుకున్న రోజులు... తనకి జ్వరం, దగ్గు, జలుబు తరచుగా వచ్చినప్పటి రోజులు... అవన్నీ గుర్తొచ్చాయి.

"చెప్పాలంటే చాలా వుంది సుజీ! నిన్న మొన్నటి దాకా మనింట్లో ఏ సమస్యలూ లేవు. అమ్మ కూడా బాధ్యతలన్నీ తీరి సంతోషంగానే వుండేది. మా పిల్లల్ని తీసుకుని పార్కుకి వెళ్ళడం, తనంతట తను లైబ్రరీకి వెళ్ళటం, జయతో గుడికెళ్ళటం... అంతా సరదాగానే గడిచింది."

"మరి?"

"నా ఆలోచన తప్పేమో తెలీదు."

"ఏమిటి?"

"రిటైరైన వాళ్ళని కొంతకాలంపాటు హ్యూమన్ రిసోర్సెస్ డిపార్టుమెంటుకి సరెండర్ చేస్తే బావుంటుందేమో! నిన్న సాయంత్రం ఆరింటిదాకా పనిచేసిన వ్యక్తి ఈ రోజు ఉదయం నుంచి ఒక్కసారి శక్తి హీనుడవటమో, ఏమీ చేయలేని నిరాసక్తుడవటమో జరగదు. నిర్దుష్టమైన వ్యాపకమనేది లేకుండా ఎలా వుండగలుగుతాడు?"

"నాన్న గురించా, నువ్వనేది?"

"హెచ్చార్డీకి వాళ్ళని సరెండర్ చేస్తే వాళ్ళ సర్వీసెస్‌ని ఏ సోషల్ వర్కుకో వినియోగించుకుంటే ఈ రోజుని మనం ఎదుర్కొంటున్న ఎన్నో సమస్యలు పరిష్కారమవుతాయి. వాళ్ళలో కొందర్లో కొన్ని టేలంట్స్ వుండొచ్చు. ఉద్యోగం ఒక ఆటంకం కాగా సంగీతం, పెయింటింగ్‌లాంటి హాబీలని వదిలిపెట్టి వుండవచ్చు. వాళ్ళని అలాంటి చోట వుపయోగించు కుంటే? వాళ్ళకీ అంత త్వరగా వృద్ధాప్యం రాదు వాళ్ళకిచ్చే పెన్షన్ గవర్నమెంట్‌కి భారమనిపించదు."



"రిటైరయ్యాక కూడా ఉద్యోగం చేయమంటే ఎవరు చేస్తార్రా?"

అతనిదంతా ఎందుకు చెప్తున్నాడో అర్థమవక అయోమయంగా అడిగింది. దానితో తల్లి అనారోగ్యానికి గల సంబంధం అస్పష్టంగా కనీ కన్పించనట్టుంటే ఆశ్చర్యం కూడా కలిగింది.

"ఉద్యోగం అనుకుంటే బాధ్యతగానూ, భారంగానూ అనిపిస్తుంది. అందుకే ప్రవృత్తిని సంతృప్తి పరిచే చోట అన్నాను." చివరి మాటలు వత్తి పలికాడు.

"కానీ రిటైరయ్యాక ఎవరేనా లీజర్‌గా గడపాలనుకుంటారు, నువ్వేంట్రా యిలా అంటావు?" మళ్ళీ అదే అడిగింది.

ఇంతలో హాస్పిటల్ చేరుకున్నారు. సౌజన్యకి సరైన జవాబు రాకముందే వాళ్ళ సంభాషణ ఆగిపోయింది. దినకర్ బైక్ పార్క్ చేసి వచ్చేలోపు సౌజన్య తల్లిని వుంచిన స్పెషల్ రూమ్‌కి వెళ్ళిపోయింది. తలుపులు దగ్గరగా వేసి వున్నాయి. నెమ్మదిగా తోసింది. తల్లి మంచం మీద తెల్లటి హాస్పిటల్ దుప్పటి మీద పడుకుని ఉంది. నిద్రపోవటం లేదు. బెడ్‌కి కొంచెం దూరంగా స్టూలు మీద కూర్చుని ఏదో మేగజైన్ చదువుతోంది జయ – దినకర్ భార్య.

కొద్దిగా తోసిన తలుపుల మధ్య నిలువెత్తు విగ్రహంలా వున్న సౌజన్యని చూసి లేచి నిలబడి, "రండి. ఒక్కరే వచ్చారా? దినా స్టేషన్‌కొచ్చారు. కలవలేదా?" అనడిగింది. ఆమె ప్రశ్న యింకా పూర్తవనే లేదు. వెనక నుంచీ దినకర్ అడుగుల చప్పుడు వినిపించింది.

సౌజన్య తల్లి అన్నపూర్ణ. కూతుర్ని చూసి ఆవిడ లేచి కూర్చుంది.

"ఎలా వుందమ్మా, నీకు?" ఒక్కంగలో తల్లి పక్కన వెళ్ళి కూర్చుంది సౌజన్య. ఆవిడనలా నీరసంగా వుండగా చూడటం ఆమెకి బాధని కలిగించింది. కళ్ళమ్మట నీళ్ళు తిరిగాయి.

"ఎందుకంత బాధ? పెద్దదాన్నవటం లేదూ? ఏవో వస్తూనే వుంటాయి. ఈ మాత్రం దానికి నువ్వింత కంగారుపడి రావడం దేనికి? మీ ఆయనకి లీవు దొరికాక యిద్దరూ కలిసే రావల్సింది... అంతగా రావాలనుకుంటే" అంది అన్నపూర్ణ. కూతురు, కొడుకు, కోడలు అందరూ తన కోసం పడుతున్న తపన చూస్తుంటే ఆవిడకి ఒకవైపు సంతృప్తిగా వుంది. మరోవైపు వాళ్ళని యిబ్బంది పెడుతున్నానన్న బాధ కూడా వుంది. ఈ రెండు విరుద్ధ భావాల మధ్య నలిగింది కాసేపు. అలాంటి ఎన్నో భావ వైరుధ్యాలు కొద్ది రోజులుగా ఆమెని వుక్కిరి బిక్కిరి చేస్తున్నాయి. భర్త రిటైరై యింట్లోనే వుంటున్నాడన్న సంతోషంతో అతడి ప్రవర్తన కలిగిస్తున్న బాధ సంఘర్షిస్తోంది. అతడి ప్రవర్తనలో లోపం వున్నట్టుగానీ, దానివలన తను హర్టవుతోందని గానీ, కొడుక్కీ కోడలికీ తెలీకుండా దాచే ప్రయత్నంలో యింకొంత సంఘర్షణ...

ఇదంతా దినకర్ గుర్తించేడు. ఇంకా సౌజన్యతో అనలేదు. వాళ్ళ సంభాషణ మధ్యలోనే ఆగిపోయింది. పూర్తి కావలసి వుంది.

తల్లి దగ్గర అరగంట సేపు కూర్చుని, తమ్ముడితో యింటికెళ్ళింది. తండ్రి యింట్లోనే వున్నాడు. టీవీలో డిస్కవరీ ఛానెల్ చూస్తున్నాడు.

"ఎలా వున్నారు నాన్నా?" ప్రేమగా అడిగింది.

"చాలా లీజర్‌గా" నవ్వేడాయన. "అమ్మని చూసొచ్చావా? లేచిందా? ఏమైనా తిందా? అనారోగ్యం అసలు రాకుండా వుండదు గానీ వచ్చాక తీసుకునే జాగ్రత్తలే మనని అందులోంచీ బైటపడేస్తాయి. అంటూ ఏదేదో చెప్పుకొచ్చాడు. ఆయన మాట్లాడుతున్నంతసేపూ దినకర్ ముఖం అసహనంగా పెట్టుకుంటూ, మళ్ళీ దాన్ని కవర్ చేసుకుంటూ వున్నాడు. ఇంటి వాతావరణంలో యిదొక కొత్త మార్పు.

* * *

ఆ సాయంత్రమే అన్నపూర్ణని డిశ్చార్జి చేశారు. హైబీపీ కాబట్టి ఉప్పు కారం బాగా తగ్గించమనీ, మందులు రెగ్యులర్‌గా వాడమనీ, ప్రశాంతంగా వుండమనీ చెప్పారు డాక్టర్లు.

"చివరిది మాత్రం నా చేతుల్లో లేదు" గొణిగింది అన్నపూర్ణ. అవిడన్నది స్పష్టంగా వినిపించకపోయినా, ముఖంలో భావాన్ని ఖచ్చితంగా చదవగలిగాడు దినకర్. సందిగ్ధంలో పడ్డది సౌజన్య.

ఆవిడని తీసుకుని యింటికొచ్చారు. ఏ గదిలో మంచం వెయ్యాలో, ఎలా వుంటే ప్రశాంతంగా వుంటుందీ, ఏమేం చెయ్యాలీ, ఏమేం చెయ్యకూడదూ అనే ఎన్నో విషయాల మీద చాలాసేపు చర్చించాడు. ఆమె తండ్రి గోపాలరావు.

ఇలాంటిది యింట్లో ఇంతకు ముందెప్పుడూ జరగలేదు. ఆయన ఇంటి విషయాలు పట్టించుకునేవాడు కాదు. అన్నీ అన్నపూర్ణే చూసుకునేది. తనే చేసేది. లేదా యిలా చెయ్యమని చెప్పేది. తాము చేసేవారు. తండ్రిలో యీ మార్పు... ప్రతీదీ ఆదేశాల ప్రకారం జరగాలన్న ఆకాంక్ష... సౌజన్యకి ఆశ్చర్యాన్ని కలిగించింది. పడక ఏర్పాట్లు పూర్తయ్యేసరికి అన్నపూర్ణలో స్వల్పంగా వుద్రేకం కనిపించింది.

ఆ రాత్రి మూడు వేర్వేరు సమావేశాలు జరిగాయి... మూడు

వేర్వేరు చోట్ల.. మొదటిది సౌజన్యకీ ఆమె తల్లికీ మధ్య జరిగింది ఆవిడ గదిలో.

"రిటైరయ్యాక నాన్నలో చాలా మార్పు వచ్చిందే సుజీ! అంతకుముందు ఏదీ పట్టించుకునేవారు కాదా, యిప్పుడేమో అన్నిట్లోనూ తలదూరుస్తున్నారు. ఏదో చాదస్తంగా చెప్పబోతారు. ఎవరికంత తీరిక చెప్పు? జయ తొమ్మిదింటికల్లా ఆఫీసులో వుండాలి. దినా ఎప్పుడెళ్తాడో, ఎప్పుడొస్తాడో వాడికే తెలీదు. ఈయన వదలరు. వాళ్ళకి విసుగు. దినా అంటే మన పిల్లవాడు. నేను పెంచిన పిల్లవాడు. జయ వేరే యింటి నుంచి వచ్చింది. మేం ఏమన్నా సర్దుకుపోయేంత ప్రేమ, గౌరవం ఎక్కడి నుంచి వస్తాయి? తెచ్చిపెట్టుకున్నది ఎంతకాలం నిలుస్తాయి? మనం ప్రేమ చూపిస్తే దగ్గరవుతుంది. విసిగిస్తే దూరం జరుగుతుంది. అయితే దానితో పాటు వీడు కూడా దూరమవుతాడు. సుజీ! మీ యిద్దర్నీ ఎంత ప్రేమగా పెంచానే. నీ పెళ్ళితో వచ్చిన వెల్తిని వాడి పెళ్ళితో పూడ్చాలనుకున్నాను గానీ అందర్నీ దూరం చేసుకుని మాకు మేమే బతకాలనుకోలేదు" అంది అన్నపూర్ణ. అలా అంటుంటేనే ఆమె గొంతు రుద్ధమైంది. కళ్ళు చెమర్చాయి. తల్లి తపన అర్థమై సౌజన్య మనసు ఆర్ద్రమైంది.



"నువ్వేన్నీ మనసులో పెట్టుకోకు. కొద్దిరోజులు నువ్వూ నాన్నా మా యింటికొచ్చి వుండండి. నీకు మార్పుగానూ వుంటుంది, విశ్రాంతి దొరుకుతుంది. ఇక్కడ తమ్ముడికీ, జయకీ కూడా నీ విలువేంటో తెలుస్తుంది. ఎక్కడివక్కడ వదిలేసి వెళ్తే అన్నీ సర్దిపెట్టి, పిల్లల్ని జాగ్రత్తగా చూసుకుంటూ వుంటే వాళ్ళకి తెలీదం లేదు" అంది. తమ్ముడూ మరదలి విషయం ఆమె మనసులో ఏదో ఒక మూల ముల్లులా గుచ్చుకుని బాధిస్తోంది.

అన్నపూర్ణ చాలాసేపు మాట్లాడలేదు. తర్వాత నెమ్మదిగా అడిగింది. "స్పర్ధలనేవి ఎందుకు రావాలి?"

చాలా లోతైన ప్రశ్న. ప్రేమించే మనస్తత్వం వున్నవారిని తీవ్రంగా బాధపెట్టే ప్రశ్న. ఇద్దరి అభిప్రాయాలు కలవనప్పుడు – ఆ విషయం మీద యిద్దరూ ఏకాభిప్రాయానికి రావల్సినప్పుడు పుట్టే సంఘర్షణ స్పర్ధ – ఇంటరాక్షన్స్ వున్నప్పుడు అభిప్రాయభేదాలు రావడానికి అవకాశాలు ఎక్కువ. ఇంట్లో మనుషుల మధ్య ఇంటరాక్షన్స్ లేకుండా ఎలా వుంటాయి? అంటే స్పర్ధలు తప్పనిసరా? ఎడమొహం, పెడమొహంగానో, తిట్టుకుంటూ, దెబ్బలాడుకుంటూ వుండాల్సిందేనా? కాదనిపించింది. అంతకన్నా జవాబు దొరకలేదు. అన్నపూర్ణ తనకి తనే వెతుక్కుంది గానీ సౌజన్య నుంచీ ఆశించలేదు.

భోజనాల వేళ అంది సౌజన్య. "అమ్మనీ నాన్ననీ కొద్దిరోజులు మా యింటికి రమ్మంటున్నాను దినా!"

అతనేం మాట్లాడలేదుగానీ జయ మాత్రం ఒక్కసారి కళ్ళెత్తి చూసి మళ్ళీ దించుకుంది.

భోజనాలయ్యాక తండ్రి దగ్గరకెళ్ళి కూర్చుంది సౌజన్య. అది రెండో సమావేశం.

"నేను చెప్పిన విషయాన్ని గురించి ఏమాలోచించారు నాన్నా? కొన్నాళ్ళు మీరిద్దరూ నా దగ్గరకొచ్చి వుంటే సమస్యలన్నీ వాటంతట అవే పరిష్కృతమవుతాయి" అంది.

"అసలిప్పుడు మీ అమ్మకి గల ప్రాబ్లమేమిటి?" అడిగాడు గోపాలరావు. "ఒక పద్ధతి ప్రకారం పనులు చేసుకోకపోవడం, ఇంట్లో డిసిప్లిన్ లేకపోవడం, వంటింట్లోంచీ సగం పనిలో వచ్చి టీవీ ముందు కూర్చుంటుంది. గంటో రెండు గంటలో టీవీ చూసి మళ్ళీ పని మొదలెడ్తుంది. మళ్ళీ నిద్ర. ఆ పనులనేవి ఎప్పటికీ తెమలవు. ఎనిమిదిన్నరకి జయ వెళ్ళిపోతుంది. ఇంకో అరగంటకో గంటకో అమ్మ కూడా వంటింట్లోంచి ఎందుకు బయటపడదు? ఎందుకా దేవులాట? దినా డ్రింక్ చేస్తాడు. ఆ విషయం నేను గ్రహించి చెప్తేనే కాని ఆమెకి తెలియలేదు. ఏం పెంపకమే సుజీ, అది? మగపిల్లలు ఎంతలో చెయ్యి జారిపోతారు? అన్నీ నాకొదిలిపెట్టి నిశ్చింతగా వుండమంటున్నాను" అన్నాడు.

మరో ముల్లు దిగబడింది సౌజన్య గుండెలో. తండ్రిలా మాట్లాడుతుంటే అసహనంగా అనిపించింది. ఎక్కడో లోపం జరుగుతోంది. అసలా లోపమేంటో, ఎక్కడ ఎందుకు జరుగుతుందో మాత్రం అర్థమవలేదు. నిశ్శబ్దంగా లేచి యివతలికి వచ్చేసింది. తల్లి నిద్రపోతోంది. అదే గదిలో చప్పుడవకుండా మరో మంచం వాల్చుకుని తనూ పడుకుంది. గంటసేపు నిద్రపోయిందో లేదో సెల్ మోగింది. తల్లికి మెలకువ వస్తుందేమోనని కంగారుపడ్తూ సెల్ తీసుకుని గదిలోంచీ యివతలికి వచ్చేసింది. ఫోన్ చేసింది ఎవరో కాదు, దినకర్ –

"నీ కోసం టెర్రస్ మీద వెయిట్ చేస్తున్నాను" అని

సౌజన్య నిద్రమత్తంతా ఎగిరిపోయింది. ఆమె కాళ్ళు డాబా మెట్ల కేసి దారితీశాయి.

* * *

కార్పొరేట్ రంగంలో చాలావరకూ నిర్ణయాలు వైన్ కప్ వెనుక నుంచే వెలువడతాయి. నిర్ణయాలు తీసుకునే స్థాయిలో వున్న నేను తాగటం తప్పనో, తాగననే నియమం పెట్టుకున్నాననో నా తోటి వారి నుంచీ వేరుపడలేను. ఒక్కమాటలో చెప్పాలంటే డ్రింక్ చెయ్యటం నా దృష్టిలో తప్పు కాదు. మన మీద మనకి నియంత్రణ పోయేదాకా తాగి గొడవ చెయ్యటం తప్పు..."

రాత్రి పన్నెండు గంటల వేళవటంతో ఆరు బయట కావటం చేత చిరుగాలి సన్నగా వణికిస్తోంది. చున్నీని తలమీంచి భుజాల చుట్టూ కప్పుకుని కుర్చీలో ముడుచుకుని కూర్చుని వుంది సౌజన్య. దినకర్ చెప్పింది వింది. తన భర్త, మరెవరేనా కానీ తాగటాన్ని సమర్థించుకుంటూ చెప్పే మాటలవే. అందులో విశేషమేమీ లేదు.

"అలాంటి తప్పు నేనెప్పుడేనా చేస్తే. ఆ క్షణం నుంచీ తనెలా చెప్తే నేనలా నడుచుకుంటాననేది జయకీ నాకూ మధ్య గల ఒప్పందం."

సౌజన్య పెదవులు చిన్నగా విచ్చుకున్నాయి. అలాంటి ఒప్పందం చాలామంది భార్యాభర్తల మధ్య వుంటుంది. దాన్ని అతిక్రమించడం కూడా ఎంతో మంది మధ్య ఎన్నోసార్లు జరిగి వుంటుంది!

"అలా నవ్వక్కర్లేదు. ఇప్పటిదాకా నేను బ్రీచ్ చేయలేదు" అని నవ్వేడు దినకర్ కూడా. ఇద్దరి మధ్య వాతావరణం కాస్త తేలికపడింది.

"మీ మంచికోసమేగా మేం చెప్పేది?" అడిగింది సౌజన్య మెత్తగా.

"ఆ విషయమూ తెలుసు, మా మంచీ మాకు తెలుసు."

మనిషికి తోటివారి అవసరం ఎప్పుడూ వుంటూనే వుంటుంది. తన తల్లిదండ్రుల టైమ్‌లో నలుగురైదుగురు అన్నదమ్ములూ, అక్కచెల్లెళ్ళూ వుండేవారు. పెళ్ళిళ్ళలోనూ, చావుల్లోనూ కలుసుకునేవారు. ఒకరి కష్టసుఖాలు యింకొకరు పంచుకునేవారు. ఇప్పుడలా కాదు. అలాంటి ఆత్మీయులూ లేరు. అంత చిక్కటి అనుబంధాలూ లేవు. మన చుట్టూ వున్నవారికంటే వెనుకబడకుండా వుంటే చాలు, గుంపులో తోసుకుపోతున్నారు. ఇది యిప్పటి జీవన సరళి.

"అమ్మకి నేను డ్రింక్ చేస్తాననే విషయం తెలుసు. కానీ ఆవిడో పెద్ద డిప్లమాట్. తెలీనట్టుగా వూరుకుంది. అంటే బైటపడ్డే నేనే బైటపడాలి. లేకపోతే ఆవిడలాగే నేనూ డిప్లమాటిగ్గా వుంటూ కవర్ చేసుకోవాలి. నాన్న మాత్రం తనో గొప్ప విషయాన్ని తెలుసుకున్నానను కుంటున్నారు. అమ్మని కోప్పడ్డారు. నాతో కూడా మాట్లాడతారట. సుజీ! నేను చిన్నపిల్లాడినో, నూనూగు మీసాల యువకుడినో కాను, ఒకరిచేత సరిదిద్దించుకోవడానికి. కొన్ని జతల కళ్ళు యీర్ష్యగానూ, యింకొన్ని జతల కళ్ళు ఆరాధనగానూ చూసేంత స్టేచర్ నాకుంది."



సౌజన్యకి అర్ధమైంది. కొన్ని విషయాలు తెలిసీ తెలియనట్టు వుండిపోతేనే బావుంటాయి. వాటిని చర్చకి పెట్టుకోవడం వలన అందులోని సున్నితమైన పార్శ్వం దెబ్బతింటుంది. అది తండ్రికర్థంకాదు. ఆయన నమ్మే విలువలు వేరు.

"…. అమ్మ పెంపకం సరిగా లేదనేది నాన్న చేసే అభియోగం. అదామెకి ఎంత బాధ కలిగిస్తుందో ఆలోచించు. మనిద్దర్లో ఏ లోపం వుంది? ఏం తక్కువ? ఇంకా ఎలా వుండాలి మనం?… మన చుట్టూ వున్నవాళ్ళలో మంచివాళ్ళు ఎక్కువ కష్టాలు పడటాన్ని, చెడ్డవాళ్ళు చాలా సుఖంగా వుండటాన్నీ చూస్తుంటాం. దానికి గల కారణం చెప్పనా? సంఘర్షణ. తను చేసేది తప్పని అనుకోనివాడు చేసేది తప్పే అయినా హాయిగా బతికేస్తాడు. అది కాకుండా తప్పా ఒప్పా అనే సంఘర్షణలో కొట్టుకునేవాడు ప్రత్యక్ష నరకాన్ని అనుభవిస్తాడు… అలాంటి సంఘర్షణ యిప్పుడు మనింట్లో మొదలైంది…" అంటూ బయస్కోపులో బొమ్మని తిప్పినట్టు సౌజన్య దృక్కోణంలోంచి తనని తప్పించి తల్లిని వుంచాడు దినకర్.

"… అమ్మతో ఆయనకి రోజూ గొడవే. అన్నింట్లో గొడవే. పెళ్ళికి ముందు యిరవయ్యేళ్ళు, పెళ్ళయాక మరో ముప్పయ్యేళ్ళూ కొన్ని పద్ధతులకి అలవాటు పడిపోయిందావిడ. ఈ పని ఇలా ఎందుకు చేశావనే దానికి వాస్తవానికి ఎలాంటి జవాబు లేదు. ఆ పని అలాగే చేయడం వలన ప్రత్యేకించి వచ్చిన లాభంగానీ, నష్టంగానీ లేదు. అయినా అక్కడో ప్రశ్న. ఇదిలా కాకుండా యింకోలా చెయ్యొచ్చుగా?

సౌజన్య చకితురాలైంది. తమ్ముడిలో ఇంత పరిశీలనాసక్తి వుండటం ఆశ్చర్యాన్ని కలిగిస్తోంది. నిజమే… ఎన్నో పనులు… కొన్ని యిలాగ, కొన్ని మరొకలాగా చేస్తుంటారు. ఏది ఎందుకు యిలాగ అనేది ఎవరికి వారు ఆలోచించరు. మరొకరి దృష్టి కోణంలోంచే ఆ ఏమాసం జనిస్తుంది.

"…. ఎనిమిదిన్నరకి జయ వెళ్ళిపోతుంది. ఆ తర్వాత కూడా అమ్మకి వంటింట్లో యింకా చాలా పనుంటుంది. తొమ్మిదిన్నరదాకా అయినంతవరకూ చేసుకుని టిఫెన్ తింటూ టీవీ చూస్తుంది. మళ్ళీ లేచి వెళ్ళి మిగిలిన పని చూసుకుంటుంది. ఆవిడ టీవీ చూడాలని వచ్చే టైముకి నాన్న బీబీసీనో, ఎన్‌జీసీనో చూస్తున్నారు. అమ్మని పనంతా పూర్తి చేసుకుని వంటింటికి గొళ్ళెం పెట్టేసి రమ్మంటారు… లైబ్రరీకి వెళ్ళి తెలుగు నవలలు తెచ్చుకునేది అమ్మ. ఇప్పుడు నాన్న అదే కార్డు మీద ఫిలాసఫీ బుక్స్ తెచ్చుకుంటున్నారు. అమ్మ చదివేవి చెత్త బుక్సని విమర్శ… పిల్లలకి ఫిజికల్ ఎక్సర్‌సైజ్ లేదంటారు. ఈ అపార్టుమెంట్లలో ఎక్కడ ఆడుకుంటారు? గ్రౌండుకి వెళ్తే పెద్ద పిల్లలు కొడుతున్నారు. రోజూ వాళ్ళని పార్కుకి తీసుకెళ్ళి ఆడించి తీసుకొచ్చేదెవరు? అలా ఆడి అలసిపోయి యింటికొస్తే హోంవర్కు ఎవరు చేస్తారు. చదువు ఎవరు చదువుతారు?… ఇంకా ఎన్నో!"

"దినా!"

"వాళ్ళని టీవీ చూడనివ్వరక్కా! కాసేపు వాళ్ళు టీవీ ముందు కూర్చుంటే జయ రిలాక్సై పనులు చేసుకుంటుంది. ఇప్పుడలా కాదు. ఇంటికొచ్చాక ఒక్క నిమిషం కూడా తనని వూపిరి పీల్చుకోనివ్వకుండా అల్లరి.

… సుజీ! ఒకరకంగా చెప్పాలంటే యింట్లో అందరం ప్రైవసీని కోల్పోయాం. ఆ ఒత్తిడంతా అమ్మమీద పడుతోంది. నాన్నకి సర్ది చెప్పలేక, మా టెన్షన్స్‌కి ఔట్‌లెట్ అవుతూ సతమతమైపోతోంది.

* * *

"నా ఆలోచనలు తప్పో రైటో తెలీదు. కొన్ని సంవత్సరాలుగా అలవాటుపడిన జీవన సరళిని మార్చుకోవడం ఎవరికేనా కష్టమే. అది పూర్తిగా వ్యక్తిగతానికి వదిలేసి మనుషులు కలిసి వుండలేరా? ఒకళ్ళకి అనుగుణంగా మిగతా వారంతా మారిపోవలసిందేనా? అది సాధ్యమేనా?" ఎంత నెమ్మదిగా మాట్లాడినా దినకర్ గొంతులో తీక్షణత చీకట్లో కత్తి అంచు మెరుస్తున్నట్టు స్పష్టంగా కనిపించింది.

మనుషుల మధ్య స్పర్ధలెందుకొస్తాయో అర్థమైంది సౌజన్యకి. తమ్ముడిని తప్పుగా అర్థం చేసుకొన్నందుకు బాధనిపించింది కూడా.

"తప్పు చేస్తున్నట్టు నాన్న ముందు తలొంచుకునో లేకపోతే పార్టీలవీ మానేసి, అలా చేయడం వలన నేనేదో కోల్పోయానని బాధపడుతూనో బతకడం నా వల్ల కాదు… అదొక్కటే కాదు. అమ్మ యిక్కడేదో కష్టపడిపోతోందని తనని కొంతకాలం తీసుకెళ్తే బావుంటుందని అనుకుంటున్నావు కదూ? కానీ సుజీ… నాది స్వార్థమే అనుకో, అమ్మని కష్టపెడుతున్నాననే అనుకో… నా పిల్లలు అమ్మ పెంపకంలో ఒద్దిగ్గా పెరగాలని కోరిక. వాళ్ళు ప్రేమించడం నేర్చుకోవాలి… యింటినీ, యింట్లో వాళ్ళనీ, ఈ విషయాలన్నీ నాన్నతో నేనే మాట్లాడాలనుకుంటున్నాను వోపెన్‌గా" అన్నాడు.

సౌజన్య ఏమీ మాట్లాడలేదు. తండ్రికి కొన్ని ఆకాంక్షలున్నాయి. వాటికి అనుగుణంగా పరిస్థితులుండాలని ఆయన కోరిక. కానీ అందుకు సమయం మించిపోయింది. దినకర్‌గానీ, తనుగానీ, మా మంచి మాకు తెలీదా అనే వయసుని చేరుకున్నారు. తమ చుట్టూ అంత ఫ్లెక్సిబుల్‌గా లేని, తమని బైటకి వదిలిపెట్టని ప్రపంచం ఏర్పడిపోయింది. ఆ విషయం ఆయనే గుర్తించాలి.

ఇద్దరూ ఇంకాసేపు అలాగే కూర్చుని ఏవేవో జనరల్ టాపిక్స్ మాట్లాడుకున్నారు. తర్వాత ఎవరి గదుల్లోకి వాళ్ళు వెళ్ళిపోయారు.

* * *

ఎవరికీ ఎవర్తోటీ ఓపెన్‌గా మాట్లాడాల్సిన అవసరం రాలేదు. ఆ రోజు రాత్రి...

సౌజన్య సెల్ మోగడంతో అప్పుడే నిద్రలోకి జారుకుంటున్న గోపాలరావుకి మెలకువ వచ్చింది. ఆమె డాబా ఎక్కుతుంటే చూశాడు. అల్లుడి దగ్గర్నుంచేమో ఫోను, ఏకాంతం కోసం వెళ్తోందనుకుంటుంటే డాబా మీంచి కొడుకు గొంతు వినిపించింది. ఇద్దరూ అక్కడే వున్నారు గాబట్టి అన్ని విషయాలూ కొడుకుతో చెప్పడానికి అదే అనువైన సందర్భం అనిపించి తనూ లేచి మెట్లెక్కాడు. ఆఖరి మెట్టు మీద వుండగా కొడుకు చెప్తున్నది తన గురించేనని అర్ధమై ఆగిపోయి విన్నాడు.

ఒక్క క్షణం... తలదిమ్మెక్కినట్టయింది. ఉద్రేకం ముంచెత్తగా వంట్లోని రక్తం వడివడిగా ప్రవహించింది. క్రమంగా భావోద్వేగాలన్నీ చల్లబడ్డాయి. నెమ్మదిగా వెనక్కొచ్చి తన మంచం మీద కూలబడ్డాడు.

ఒక అవగాహన... స్పష్టంగా ఏర్పడింది. రిటైర్మెంటు వలన మార్పొచ్చింది తన జీవితంలో. వాళ్ళు ఇంతకు ముందెలా వున్నారో యిప్పుడూ అలాగే వున్నారు. ఇకముందు కూడా అలాగే వుండాలనుకుంటున్నారు. ఆ ఒరవడిలోనే తనని యిముడ్చుకోగలరు. ఇరవై నాలుగ్గంటల విరామ సమయాన్ని చేతిలో వుంచుకొని ప్రతీదీ గమనిస్తూ వుంటే అన్నీ లోపాలే కనిపిస్తున్నాయి. ఆ విరామం లేని రోజుల్లో కూడా ఇవన్నీ వున్నవే. వాటివలన ఎవరికీ ఎలాంటి ఇబ్బందీ లేదు. తను పట్టించుకోవడం యిబ్బందిగా వుంది. భార్యని ఎలివేట్ చేసే ప్రయత్నం తనెప్పుడూ చేయలేదు. ఆమె స్థాయికి తగిన వినోదాన్ని, విజ్ఞానాన్ని ఆమె ఎంచుకుంది. కొడుకు చదువుకున్నాడు. ఉద్యోగం చేస్తున్నాడు. ప్రపంచాన్ని బట్టి వెళ్తున్నాడు. తను వెళ్ళలేదూ, వయసులో వున్న భార్యనీ పిల్లల్నీ వదిలేసి వుద్యోగానికి? తనకది అనివార్యం. సోషల్ మూవింగ్ అనేది కొడుక్కి అనివార్యం.

సుదీర్ఘంగా నిశ్వసించాడు. భ్రమలన్నీ తొలిగాయి. తన పరిధి అర్థమైంది.

మర్నాడు ఉదయం పోస్టులో కొన్ని అప్లికేషన్లు పంపించాడు. వాటిలో యిలా వుంది –

"ఉద్యోగం కావలెను. అరవయ్యేళ్ళ రిటైర్డ్ గవర్నమెంట్ ఉద్యోగికి"

దాదాపు వారం తర్వాత మొదటి రిగ్రెట్ లెటరొచ్చింది. ఎదుటివారి అభిప్రాయాలు మనమీద రుద్దబడటంలోని చేదు, వారికి గల తిరస్కరించగలిగే అధికారం మనకి ఛాయిస్ లేకుండా చేయడంలోని బాధ రుచికి వచ్చాయి. ముప్పయ్యేళ్ళ పైబడి సర్వీసు చేసి, రిటైరైన తనకి – తన అనుభవాన్ని, నాలెడ్జినీ ఎవరేనా వినియోగించుకుంటే అదొక గుర్తింపులా అనిపించి సంతృప్తి కలిగేది. ఇప్పుడది దొరకలేదు. అదే సమయాన అతనికి మరో విషయం స్ఫురించింది – ఇలాంటి ఎన్నో రిగ్రెట్స్‌ని భార్యకి రుచి చూపిస్తున్నానని, పిల్లల పెంపకం సరిగా లేదనటం దగ్గర్నుంచీ, తన అభిప్రాయాలే సరైనవనీ, ఆమెవి విలువ లేనివనటందాకా.

* * *

గోపాలరావు యిప్పుడు రోజులో చాలా భాగం లైబ్రరీలోనో, పబ్లిక్ గార్డెన్‌లోని సీనియర్ సిటిజన్స్ కార్నర్‌లోనో గడుపుతున్నాడు. లైబ్రరీ నుంచి వస్తూ భార్యకి అర్థమయ్యే తేలికపాటి నవలలు తీసుకొస్తున్నాడు. మధ్య మధ్యలో ఆమెని కాంప్లిమెంట్ చేస్తున్నాడు. తను దూరంగా వుండి, ఎలాంటి సహకారాన్నీ అందించకపోయినా, పిల్లలనీ, ఇంటినీ పైకి తీసుకొచ్చినందుకు బాహాటంగానే ప్రశంసిస్తున్నాడు. అందులో ఆయనకి కొద్దిగా అసంతృప్తి లేకపోలేదు. దాన్ని తనే గరళంలా మింగాడు. తనామెని విమర్శిస్తూ ఏదో పొరపాటు జరిగిపోయిందని బాధపడుతూ వున్నప్పుడు ఆమె అనారోగ్యాన్ని తెచ్చుకుంది. ఆమెలో లోపాలని సరిదిద్దాలనుకున్నప్పుడు ఆమె సంఘర్షించి అనారోగ్యాన్ని తెచ్చుకుంది. ఇప్పుడామెలో స్పష్టమైన మార్పు.

ఆమె టీవీ చూసే టైముకి తన పేపరు చూడటం, మనవల్ని కొద్దిసేపు ఆడించి తీసుకొచ్చి దగ్గరుండి హోంవర్క్ చేయించడం అలవాటు చేసుకున్నాడు. వాళ్ళకి మంచి మంచి ప్రోగ్రామ్స్‌ని తనే దగ్గరుండి పరిచయం చేస్తున్నాడు... అంటే తన అభిరుచుల్ని.

* * *

జయతో చేసుకున్న ఒప్పందాన్ని ఒకే ఒక్కసారి అతిక్రమించాడు దినకర్. లిమిట్ దాటి తాగాడు. తిన్న పదార్థాలు కడుపులో యిమడలేదు. ఇంటికి రాగానే వాంతి చేసుకున్నాడు. భయంకరమైన వాసన గదంతా నిండింది. పిల్లలు నిద్రలేచి తండ్రిని భయంగా చూడసాగారు. వాళ్ళ చూపులు ఎంతోకాలం వెంటాడాయతన్ని. మళ్ళీ ఎప్పుడూ తాగలేదు. తాగటాన్ని సమర్థించే సిద్ధాంతాలు కూడా ప్రతిపాదించలేదు.

* * *

"నాన్న పోస్ట్ రిటైరల్ లైఫ్‌కి అలవాటు పడ్డారు. ఇప్పుడాయన యింట్లో యిమిడిపోగలుగుతున్నారు ఎలాంటి అలజడీ లేకుండా" అన్నాడు దినకర్ సౌజన్యతో. ఆమెకి విషయాలన్నీ తల్లి ద్వారా తెలిశాయి.

"మార్పు ఒకరు చెప్పి తీసుకొచ్చేది కాదు. జీవన గమన రీత్యా రావాలి. మనిషి వ్యక్తిగత సంస్కారపరంగా రావాలి. ఎదుటి వాళ్ళలో మార్పు రావాలని మనం ఎంతగా కోరుకున్నప్పటికీ, వాళ్ళ ప్రవర్తన ఎంత బాధనిపించినప్పటికీ వేచి చూడాల్సిందే. ఎవరికి వారు మారితే చుట్టూ వున్నవారితో సంబంధాలు బాగుపడతాయి. ఒకరు మరొకరిని మార్చాలని ప్రయత్నిస్తే అవే సంబంధాలు చెడిపోతాయి. నాకిప్పుడు చాలా సంతోషంగా ఉంది. నా పుట్టినిల్లు చాలా సురక్షితంగా వుంది. అమ్మా, నాన్నా, తమ్ముడూ అనే ఆప్తులున్నారు. నాన్న, తమ్ముడు ఒకరినొకరు తమకనుగుణంగా మార్చుకోవాలని ప్రయత్నిస్తే నాకు ఎవరో ఒకరే వుండేవారు. రెండోవారు విరోధులయ్యేవారు. లేదా నేనే యిద్దరికీ దూరమయ్యేదాన్ని" అంది.

*

# బతుకమ్మ



ఈగ హనుమాన్

ఇది ఒక ఓనమ్
ఇది ఒక బైశాఖి
ఒకటి ఇది బతుకమ్మ
ప్రకృతి ప్రకటించుకున్న పండుగ

తీగల చిట్టీ అల్లికల మీద
అనిగాకుల్లో అణిగిమణిగి
తుళ్ళిపడుతూ
పూలు రీవీగా గుసగుసలాడుతాయి
పట్టాభిషేకం గనుక -

ఓణీల్లో ఆడుకున్న పీటల మీది బొద్దెమ్మలు
తొమ్మిది రోజులకు
ముత్తైదువల బతుకమ్మలౌతాయి
పెత్రమాసకు ఎంగిలిపూవులైన
ఈ ఝరీపర్వం సద్దులకు సాగర సంగమం
అర్రెం మినహా ఆడేది ఎనిమిది దినాలు -

ఏ సింగిడో దానం చేస్తూ
సూర్యుడు పశ్చిమ సముద్రంలోకి సోలుతున్నపుడు
బతుకమ్మలు బజార్లెంట ప్రవహిస్తాయి -
పెద్ద చీర పీతాంబ్రం
సింగారించుకుని సీతాకోక చిలుకవుతుంది -

కొంటెతనపు చిత్తుడు గొట్టాలు
పాశికాయల పదనిసలు
కొత్త కొత్త పువ్వుల్లో చిలిపి బాల్యాలు -

పచ్చపచ్చగా నవ్వు విచ్చుకునే తంగేడి పువ్వు
అడవిలో అనామకంగా జీవించే తాను
దేవతనైపోతున్నాని దారంతా కేరింతలు

గుమ్మడి పువ్వులో గౌరమ్మ
గ్రామ దేవతై మురిసిపోతుంది
పూలశిఖరం పైన నూనెదీపం
గాలితో కోలాటమాడుతుంది -

గుండం చుట్టూ అల్వా తొక్కినట్లు
బతుకమ్మల చుట్టూ
ఒయ్యారంగా పాట ఉయ్యాలూగుతుంది
గాలి
దుమ్ము దులుపుకుంటూ
సుడిలా పైకి లేస్తుంది -

ఇక్కడ వేసిన వాసనకు
కాసేపు చెమట ఉత్పతనమవుతుంది -

దస్తి గుడ్డలో కట్టుకున్న పెసరులడ్డు, సద్దముద్ద, సత్తుపిండి
పలారమై నోరు తీపి చేస్తుంది

ఇళ్ళకొస్తూ
వాళ్ళు పాడే పాటలు
అల్లుకుపోయిన అనురాగాల్ని
గళ్ళీల వాకిళ్ళను అలుకుతాయి -

ఇక రాత్రి భోజనాలకు
సొప్ప పుల్లల్తో కుట్టిన మోత్కాకు విస్తళ్ళు
బంతుల్లో కూర్చుంటాయి -

ఇక్కడ పూసిన ప్రతి పువ్వూ తాంబులంపై
తంగేడవ్వాలని కలగంటుంది
ఇక్కడ ఒలికిన ప్రతి నవ్వూ గునుగుపువ్వులా
స్వచ్ఛంగా మెరుస్తుంది
ఇక్కడ పాడిన ప్రతీ పాట ఏడాదంతా
నాల్కలపై నాట్యం చేస్తుంది

కళ్ళల్లో బతుకమ్మని నిమజ్జనం చేసుకుందాం
కళ్ళు దానం చేసుకుందాం
మనం ఖననమైనా
మరొకడికి చూపై
దారి చూపుదాం -

# అన్నం



డాక్టర్ నలిమెల భాస్కర్

అన్నదాత ఆత్మహత్యా?
ఆ వార్తే
ఉలితో
మొవ్వను తొలిచినట్లు

సెల్‌ఫోను
రెండు కాళ్ళ పిల్లుల
తోకలేని కోతుల
కొబ్బరి 'చిప్'పా?

పుడమి గిన్నెలో
చెమట పోసి
నాగలితో కలిపితే
అన్నం తయారు!

గోరటి గొంతులో జీవ
గద్దర్ కళ్ళలో ఎర్రచార
కవులంటే
వాళ్ళేరా!

అప్పుల ఊబిలో
దిగబడ్డ నాగలి లేపని
రైతు
అభినవ కర్ణుడు

పల్లెటూరి ప్రయాణం
మర్రి చెట్టుకు
చెర్రీ పండ్లు అంటున్నాడు
పట్నం కుర్రాడు?

# సంచలన సాహిత్యకారుడు



**పట్టాభి ఫిడేలు రాగాల డజన్ ప్రచురితమైన కొత్తలో చాలా పెద్ద సంచలనం రేపింది. విమర్శకులు దానిని పట్టించుకొనకా తప్పలేదు. కొందరు తిట్టిపోయక తప్పలేదు. అయితే పట్టాభిది పూర్తిగా ప్రైవేట్ రోడ్డు. దానిపైన ఎవరూ నడవలేదు. నేనొక్కణ్ణి మాత్రం ఆ దారిని అడ్డదారి చేసుకొని కొంత పయనించి మరో మార్గం చూసుకున్నాను. 1938 నాటికి తెలుగువారికి తమదీ అంటూ ఒక నగరం లేకపోవడం వల్ల నాగరిక కవిత్వం రావడానికి అవకాశం లేకపోయింది. పట్టాభి టెక్నిక్ చమత్కారాలకూ, తిరుగుబాటు ధోరణికి, తెంపరితనానికి విస్తుబోయిన లోకం అతనిలోని సీరియస్‌నెస్‌ను అర్థం చేసుకోలేదు.**

**ఆరుద్ర**

తనకు తానే సాటి, తన చోటుకు లేనేలేదు పోటీ అని సగర్వంగా చాటుకొనగలిగిన కవి మన ఆధునికులలో ఒక్క పట్టాభి మాత్రమే. (ఈయన పూర్తి పేరు తిక్కవరపు పట్టాభిరామయ్య). పట్టాభి డజను వచన పద్యాలతో తెలుగు సాహిత్య రంగంలో ప్రవేశించి ఒక ప్రత్యేకమైన స్థానాన్ని తనకు తాను సృష్టించుకున్నాడు. అయితే అతడు ఆ పద్యాలు రాయడానికి ముందు చాలా మధన పడ్డాడు. సమకాలీన సాహిత్య ప్రయోజనం గురించి చాలా ఆలోచించాడు. నూతన ప్రయోగాల అవసరాన్ని గుర్తించాడు. పట్టాభి నెల్లూరులో 1919లో జన్మించారు. 1933 దాకా హైస్కూలు విద్య అక్కడ కొనసాగింది. తర్వాత మద్రాసు ప్రెసిడెన్సీ కాలేజీలో 1933-35 మధ్య ఇంటర్మీడియట్ చదివాడు. ఈ కాలంలోనే అతడు చలాన్ని, శ్రీశ్రీని చదువుకొన్నాడు. 1935-37ల మధ్య శాంతి నికేతన్‌లో రవీంద్రనాథ్ టాగోర్ సన్నిధిలో బి.ఎ. వరకూ చదువుకున్నాడు. టాగోర్ సాహిత్యమంతా కరతలామలకం చేసు కున్నాడు. 1937-38లో ఒక ఏడాది కలకత్తా విశ్వ విద్యాలయంలో ఎం.ఎ. పరీక్షకు చదివాడు.

కలకత్తాలో ఉన్నప్పుడు పట్టాభి దిగువ చిత్పూరు రోడ్డులోని ఇరుకు గదులలో ఉండేవాడు. నగర జీవితంలోని మురికి, కరకుదనం, పిచ్చిగోల, మనుష్యుల దుర్భర వేదనలు, రోదనలు పట్టాభి హృదయాన్ని కదిలించివేశాయి. హద్దూ పద్దూ లేకుండా సద్దణగని బజారు రద్దీ, వర్తకాల ఉన్మాద తీవ్రత, చిత్పూరు పడుపు కొంపలలో అభాగినుల అమాయకత్వాన్ని మదుపు చేసుకొని లాభాలు గడించే వాళ్ళ దారుణాలను చూసి పట్టాభి చలించిపోయాడు. యూరప్‌లో యుద్ధ మేఘాలు కమ్ముకొని ఆ చీకటి కలకత్తా దాకా వ్యాపించింది. 1938లో ఈ వాతావరణంలో వెన్నెల ఉల్లిపొరల మేలి ముసుగుల టాగోర్ సాహిత్య జ్యోత్స్నా సుందరి చల్లదనం పూర్తిగా మాయమైపోయింది.

చిత్పూరులో తన గదిలో మంచం మీద పడుకొన్న పట్టాభి కళ్ళకు కిటికీలోంచి, పొగలు కమ్మిన ఆకాశవీధులలోంచీ నిండు చంద్రుడు దొంగచాటుగా తొంగిచూడటం కనిపించింది. ఆ క్షణంలో పట్టాభికి తాను చదివిన ప్రబంధాలలోను, భావకవిత్వంలోను, టాగోరు సాహిత్యంలోను ఉన్న వందలాది అందాల అలంకారాలు తమ అర్థాలను కోల్పోయి దిగంబరంగా కనపడ్డాయి. ఆ క్షణంలోనే పట్టాభికి తాను అలవర్చు కొనవలసిన నూతన కవితా దృక్పథం, తాను చేపట్టవలసిన ఆయుధాలు, చేయ వలసిన దాడి అవగతమయ్యాయి. శాంతి నికేతనంలో చదువుకొన్న తన హృదయం అశాంతి నికేతనమైంది. కలకత్తాలో ఇంక చదువు కొన సాగించ లేక అతడు ఇంటికి తిరుగుముఖం పట్టాడు.

నెల్లూరులో పట్టాభి తమ కుటుంబ సభ్యులు కొనసాగిస్తున్న మైకా వ్యాపారాన్ని చేపట్టవలసి వచ్చింది. గూడూరు నుండి ఎగుమతి చేస్తున్న సరుకు విషయమై తరచు మద్రాసుకు పట్టాభి వెళ్ళ వలసి వచ్చేది. కలకత్తా నగరంలో తాను పొందిన అనుభవాల దృష్ట్యా మదరాసు నగరాన్ని చూస్తున్నప్పుడు ఆకలితో కొత్త నాగరిక కవిత్వం మొగ్గ తొడిగింది.

తన మనసులోని భావాలను వ్యక్తం చేయడానికి పాత గణబద్ధ ఛందస్సులు పనికిరావని తెలుసు. అలాగే మాత్రా ఛందస్సులోని గేయఘణతులు కూడా నాగరిక జీవితంలోని లయను, గుండె చప్పుళ్ళను ధ్వనించలేవు. తాను చెప్పదలచుకొన్నది పాఠకుల మనస్సులలో నాటుకొనడానికి కొత్త మార్గాలు వెతకాలి. పద్యం చదవగానే పాఠకుడు దిగ్గున కూర్చుని గట్టిగా ఆలోచించాలి. చదివిన వాళ్ళు తిట్టిపోసినా ఫర్వాలేదు. తనను పట్టించుకొనకపోతేనే బాధపడాలి. తాను చేయదలచుకొన్న దాడిలో ఉపయోగించడానికి ఆయుధాలుగా బఫూనరీ, అహంభావం, సెక్సులను వాడుకోదలచుకొన్నాడు. చెప్పేది అంతా ఉత్తమ పురుషలోనే చెప్పదలచుకొన్నాడు.

నగరంలోని సవ్వడులకు సరిపోయే ఛందస్సుగాని ఛందస్సు ఏది? భాష ఎటువంటిది ఎంచుకోవాలి? పద్యానికి, గద్యానికి అంటుగట్టి, గ్రాంధికానికీ, వ్యావహారికానికీ పెళ్ళిచేసి, తెలుగుకూ, ఇంగ్లీషుకూ పొత్తు కలిపి కవితలు రాద్దామని నిశ్చయించాడు. వాటికి వచన పద్యాలని పేరు పెట్టాడు. అవి దుడ్డు కర్రలుగా వాడుకొని పద్యాల నడుములు విరగగొట్టదలిచాడు. పాతవి పోతేనేగాని కొత్తవాటికి చోటు ఉండదు.

మద్రాసు దృశ్యాలలో కొన్ని తీసుకొని, అక్కడి తన ఆడ స్నేహితుల వైనాలు కొన్ని తలచుకొని పట్టాభి పన్నెండు వచన పద్యాలు రాశాడు. వాటిని 'ఫిడేలు రాగాల డజన్' అన్నాడు. మద్రాసులో తాను తరచూ కలుసుకొనే మల్లవరపు విశ్వేశ్వరరావు ద్వారా శ్రీశ్రీ పరిచయాన్ని ఏర్పరచుకొన్నాడు. తన డజన్ పద్యాల పుస్తకాన్ని చూపెట్టాడు. ఆ పద్యాలను చదివి శ్రీశ్రీ వెంటనే అచ్చు వేయమని సలహా ఇచ్చాడు. తాను ఇంట్రో రాస్తానని చెప్పాడు. 1939 జూలై మాసంలో అచ్చుపని ప్రారంభమై ఆగస్టులో పుస్తకం బయటకు వచ్చింది. వస్తూనే సాహిత్యలోకంలో గొప్ప సంచలనం రేపింది. ఇటువంటి కవిత్వాన్ని అప్పటి దాకా దేశం చూడలేదు.

తొలి పద్యం 'ఆత్మకథ'లో పట్టాభి తన గురించి చెప్పుకొని తాను చేయదలచు కొన్నదేమిటో స్పష్టపరిచాడు.

**నాకు విచిత్రంబగు భావాలు కలవు**
**నా కన్నులందున టెలిస్కోపులు**
**మయిక్రాస్కోపులున్నవి**
**నా యీ వచన పద్యాలనే దుడ్డుకర్రలతో**
**పద్యాల నడుముల్ విరుగదంతాను!**
**చిన్నయసూరి బాలవ్యాకరణాన్ని**
**చాలా దండిస్తాను,**
**ఇంగ్లీషు భాషా భాండారంలో నుండి**
**బందిపోటుం జేసి కావల్సిన**
**మాటల్ను దోస్తాను**
**నా యిష్టం వచ్చినట్లు జేస్తాను**

అనుసరిస్తాను నవీనపంథా, కానీ
భావకవిన్మాత్రము కాన్నే, నే
నహంభావ కవిని.

ఈ తొలి పద్యంలో చెప్పినదంతా మిగతా పదకొండు పద్యాలలో పట్టాభి చేసి చూపెట్టాడు. నగర దృశ్యాలను కొన్ని టెలిస్కోపులలో చూశాడు. నాగరికుల మెదళ్ళను మైక్రోస్కోపులతో వీక్షించాడు. లూటీ చేసి తెచ్చిన భాషని చెప్పుకొన్నా, సందర్భోచితమైన పదాలనే వాడవలసిన రీతిలో వాడాడు. ఉపమేయాలన్నీ సమకాలీనాలు కాబట్టి ఉపమానాలన్నీ కూడా వర్తమాన జీవితంలోంచే తీసుకొన్నాడు. స్పెల్లింగులలో వింత ధోరణిని అనుసరించాడు. సమాన కల్పనలో విశృంఖలత్వం చూపాడు. వ్యాకరణాన్ని మైనపు ముద్దను చేసి తనకు కావలసిన రూపులో వాడుకొన్నాడు.

లోగడ కలకత్తా విశ్వ విద్యాలయంలో చదువుకొంటున్నప్పుడు చిత్పూరును ఇరుకు గదుల కిటికీలోంచి చంద్రుణ్ణి చూసినపుడు కలిగిన అనుభూతి మద్రాసు చైనా బజారులో జాబిల్లిని చూసినపుడు పట్టాభికి కలిగింది. నగరంలోని ఆకాశంలో జాబిల్లిని కూడా ఎవరో అమర్చినట్లు కనబడటం సహజం. ఆ సంగతే యిలా ఎత్తుగడలో చెప్పాడు.

తగిలించబడియున్నది జాబిల్లి
చయినా బజారు గగనములోన, పయిన,
అనవసరంగా ఆ ఘోరంగా!

బజారులోని జన ప్రవాహంలో ఎవరూ మోమెత్తి జాబిల్లిని చూడరు. ఎలక్ట్రిక్ దీపాల దావళ్యాలకీ, క్షణ క్షణం రంగులు మారే ఎలక్ట్రిక్ అడ్వర్టయిజ్‌మెంట్లకూ అలవాటు పడ్డ నాగరికులు మెచ్చుకోరు. అందుకే కవి యిలా అంటాడు.

నిమిష నిమిషానికి వింత రూపాన్ని ధరించు
యలక్ట్రికు బల్బుటేరులంటే
మాకు బలే సరదా బలే గమ్మత్తు!
కానీ దురదృష్ట శశీ!
నీవు మాత్రం పదిహేను రోజుల్లోగాని
నీ రూపాన్నంతా మార్చుకోలేవు
చాలాకాలం, చాలా ఆలస్యం
ప్రజా దృష్టిని ఆకర్షించడంలో
మార్కెట్లోని దుస్సాధ్య కాంపిటేషన్‌కు నీవు
తట్టుకోలేవు జాగ్రత్త సుమా,
దివాలా తీస్తావు, నీవీ చోట
ఖచ్చితంగా అనవసరం నిరుపయోగం కూడాను.

నగరంలోని చంద్రుడు ఖరీదైన షాపుల్లోకి దారి తప్పి ప్రవేశించిన దరిచేసి గ్రామస్తుడు.

మదరాసులోని అన్ని రకాల ప్రజలను ఒక చోట చూడాలంటే సాయంత్రం పూట 'మెరీనా' బీచ్‌ని చూస్తే చాలు. పట్టాభి అన్ని తరగతుల వారిని అక్కడ వర్ణించాడు. చీకటి పడటానికి ముందు ఒక రకం మనుష్యులుంటే తర్వాత ఇంకో రకం వాళ్ళు మిగులుతారు. ఆ సంగతే కవి యిలా చెప్పాడు.

— — — — — * * * — — — — —

మహా నగరం నిశీధంలో చంద్రుడు ఎంత అవసరమో వసంతం కూడా అంత నిరుపయోగంగా వుంటుంది. వీధీ విరామం లేని ట్రాముల గోల తప్ప కోకిలారావం వినపడదు. షాపులలో వసంతకాలపు అమ్మకాలన్న ప్రకటన తప్ప మరేం పచ్చగా కనపడదు. పువ్వులు ఆడవాళ్ళ చీర డిజైన్లలోనూ, వాళ్ళ జడలలోనూ తప్ప మరెక్కడా కనపడవు.

— — — — — * * * — — — — —

రాత్రి పడింది
రగులు నలుసులు గల నల్ల తారులాగా
ఒకింత సేపగు సరికి
సమూహమంతా కరిగిపోయింది, మిగిలింది
సమాజంలోని 'మడ్డి' మటుకు,
అన్నం ముద్దకయి కక్కుర్తిపడి
శరీరాన్ని సవారికిచ్చే జవరాళ్ళు
తొమ్మిదణాల సినిమా టిక్కెటునకు
తమ బహిర్దేహము మీద
యాత్ర చేయుటకు హక్కునిచ్చే
కొందరాంగ్లో ఇండియన్ అభాగినులు
ఈ కార్యాల 'ఛాన్సు' కోసం
ఇటూ అటూ తటపటాయించుచున్న
'మర్యాదస్తు'ల మంద
ప్రకటించుచున్నవి తరంగాలు
బిగ్గరగా తమ యసమ్మతిని

కవి కూడా కెరటాలతో పాటు తమ అసమ్మతిని ప్రకటిస్తున్నాడు. అయితే ఏం లాభం? గాలి ఏడుస్తుంది. భువి కార్చిన కన్నీటి చుక్కల్లాగ తారకలున్నాయి. మనుష్యుల మనస్సులు రకరకాల కోరికలు రేపుతున్నాయి.

సాయంత్రం మరీనాలో మనుష్యులను వర్ణించినట్టు పట్టాభి వర్షంలో మద్రాసును కూడా కావ్య వస్తువు చేసుకొన్నాడు. పది గంటల పగటి వేళ దేవుడి ఏరోప్లేను భువికి దిగుతున్నట్లు చప్పుడు చేస్తూ వానపడితే నగర జీవితం ఎలా స్తంభించిపోయిందో పట్టాభి కథనం చేశాడు. 1939లో మద్రాసులోని వర్షాన్ని పట్టాభి వచన పద్యంలో వర్ణిచితే 1967లో కుందుర్తి ఆంజనేయులు 'నగరంలో వాన' అనే వచన పద్యం రాశాడు. నాగరిక కవితలలో సమానమైన అనుభవాలే వుంటాయి. పట్టాభి పద్యాన్నీ, కుందుర్తి పద్యాన్ని తులనాత్మకంగా విశ్లేషించిన వాళ్లెవరూ లేరు.

నగరం వీధులలో ట్రాఫిక్ వుండే చోట్ల పోలీసు భటుడు వుండి తీరతాడు. ఈ పోలీసుపై పట్టాభి చక్కని పద్యం రాశాడు. అతని కళ్ళకు పోలీసు 'భరతనాట్యం లాడుచున్న నటర్షి చూడామణి'లా కనబడ్డాడు.

నటరాట్టులాగా నతండు కూడా
మృత్యుంజయ నృత్యంబును
సల్పుచుంటాడు సతతము -
బల్బు హారన్ల తాళం తోడి
యలక్ట్రికు హారన్ల రాగానికిన్ని
మోటారు సయికిళ్ళ మృదంగానికినీ
అనుగుణ్యంగా నర్తిస్తుంటాడు
తటాల్మని ఇటూ అటు తిరుగుచు
హస్తాల నందమ్ముగ ద్రిప్పుచు,
ఏమా యపూర్వ దృశ్యం!
మండుచున్నట్టి మాడుచున్నట్టి
మే మాస మధ్యాహ్న కాలమందేని
బాసల్తోడ పోసినట్లుం గురిసేటి
భాద్రపదమాస వాసయందేని,
తన నిర్ణీత ప్రదేశంబు నుండి
ఓ యంగుళమ్ము కూడా జరుగడు!
ఏ ప్రచండాతి ప్రచండ ఘోరాతి ఘోర
తీవ్రాతి తీవ్ర తపస్సుం
జేయుచున్నాడో నిష్ఠతోడన్?
చరాచరములన్ తారుమారు చేయగల
మహాశక్తి సంపన్నుండగు యోగి
కాదా ఈ పోలీసు భటుడు? ఈ మహానటుడు?

మహా నగరం నిశీధంలో చంద్రుడు ఎంత అవసరమో వసంతం కూడా అంత నిరుపయోగంగా వుంటుంది. వీధీ విరామంలేని ట్రాముల గోల తప్ప కోకిలారావం వినపడదు. షాపులలో వసంతకాలపు అమ్మకాలన్న ప్రకటన తప్ప మరేం పచ్చగా కనపడదు. పువ్వులు ఆడవాళ్ళ చీర డిజైన్ల లోనూ, వాళ్ళ జడలలోనూ తప్ప మరెక్కడా కనపడవు. పత్రికల్లో ఉగాది పద్యాలు అచ్చవుతాయి కనుక నగరంలోనికి తప్పకుండా వసంతం వచ్చి తీరాలి.

మహానగరంలో మరేదైనా అబద్ధం కావచ్చును గాని ఒక్క వృత్తి, ఒక్క వ్యక్తి మాత్రమే నిజాలు. మద్రాసు నగరం మీద బ్లూబ్లాక్ సిరాలాగ రాత్రి పడితే సగం కాంతి, సగం చీకటి ఇండ్లలో బోగందానలు కూర్చుంటారు. అక్కడకు అన్ని విధాల మనుష్యులు వస్తారు.

ఓ బోగందానా! నీవు
సంఘానికి వేస్తు పేపరు బాస్కెటువా?
మస్తు మషానము పడవేయబడునట్టి దిబ్బవా?

అని ప్రశ్నిస్తాడు. తర్వాత ఇలా అంటాడు.

నిన్నుగవురవిస్తున్నా నేను
నీలోనే నాకు జీవితం నిజంగా
సరిగ్గా ప్రతిఫలిస్తున్నది
ఇతర స్థలాలలోన
అంతా బూటకం అంతా నాటకం గొప్ప అబద్ధం
పూజారి యబద్ధం
పరపురుషుని జూచి తలవ్రాల్చే
పతివ్రత సతీత్వమబద్ధం
యోగుల బద్ధం, అందరూ అబద్ధం
సర్వమబద్ధం
కానీ నీవు మటుకు ఓ బోగందానా!
ముసుగులేని నిష్ఠురమగు నిజానివి
నీడపడనటువంటి నిర్మలమగు నిజానివి

ఫిడేలు రాగాల దజన్‌లో కొన్ని జనరల్ పద్యాలుంటే కొన్ని పర్సనల్ కవితలు ఉన్నాయి. 'సీత', 'ఆ రోజు', 'నవ్య స్త్రీ', 'కామాక్షి కోక' అనే పద్యాలు సెక్సుని ఆయుధంగా వాడుకున్న కవితలు. ఈ ఖండికల్లో సీత, లీల, కామాక్షి, అనే యువతులు నాయికలు. నాయకుడు పట్టాభియే. అయితే అక్కడక్కడ ఈ పద్యాలలో వచ్చునట్టి పట్టాభి అను పేరు గల పాత్రకు గ్రంథకర్తకు ఏమాత్రం సంబంధంలేదని గమనింపు. కృష్ణపక్షంలో కృష్ణకు గ్రంథకర్త నామంలోని 'కృష్ణ'కు ఎలా సంబంధం లేదో అలాగే అంటూ మొదటే హెచ్చరిక ఒకటి చేశాడు. ఉత్తమ పురుషలు కవిత్వం రాస్తున్నప్పుడు సొంత పేరునే వాడుకొనడం దానికి పొడిగింపు ఇంపు అని చెప్పాలి.

పట్టాభి కవితలోని సీత రామయ్య సతిగా నుంట కన్న రావణుని ప్రియురాలిగా వుండి హృదయం గల అసురుణ్ణి, అమరుణ్ణి' చేయాలను కొంటుంది. ముద్దు కృష్ణ 'అశోకం' ప్రభావం ఆనాటి యువకులపై ప్రగాఢంగా పనిచేసిందనడానికి ఇది గట్టి నిదర్శనం.

'కామాక్షి కోక' ఒక వింత కవిత. మవుంటు రోడ్డులో ఒక ప్రాణంలేని ప్రతిమకు కట్టుబడి యున్న ఈ కోకను పట్టాభి కొని కామాక్షికి ప్రజెంట్ చేశాడు. ఆనాటి నుంచి జరిగిన కథను ఆ కోక కథనం చేస్తుంది. ప్రాణంలేని ఒక తన యజమానురాలి ప్రణయగాథని, విరహాన్ని, ప్రియుని సమాగమాన్ని వర్ణిస్తుంది. ఇది కవి ఉపజ్ఞకు చక్కని నిదర్శనం అని విమర్శకులంటారు.

చిట్టచివరి పద్యంలో పట్టాభి తెలుగు వర్ణ క్రమాన్ని మార్చేశాడు. రాగంతో ఫిడేలు ఇలా అన్నదట.

"మీ వారన్దరు సనాతనాచర్ యుల్
ముఖమ్విరిచి, ఇన్‌గ్‌లీష్టానిని
నన్‌నుజ్జేపట్ టవద్‌దని
గద్ దిన్చినా కూడ నీవు
మహా సాహసన్తో, రుమాన్‌టిక్‌గా
మేయారేజ్జేసుకోన్ నావు గదా! స్ వీట్ హార్‌ట్!"
రాగమ్ అని వాడు
"ఢ్యాన్‌క్స్‌టు పట్టాభి
నాకతడు ధ్రయిన్గా
సహాయ్‌యమ్ జేయపట్‌టి మనకు
వివాహయిన్‌ది డార్‌లిన్‌గ్!"

ఫిడేలుకూ, రాగానికి 'అపూర్‌పమ్‌బగు' సంతానం జనించి వాళ్ళంతా పట్టాభిని తాతా! తాతా! అనే వారట.

ఆధునిక జీవితంలో నగరం ఒక భాగమైనప్పుడు కవిత్వంలో దానికి ఇవ్వవలసిన వాటా ఇవ్వవద్దా అని అతని ప్రశ్న. అయితే ఆనాడు తెలుగువాళ్ళు దానికి జవాబు చెప్పలేదు. హైదరాబాద్ రాజధానిగా ఆంధ్ర రాష్ట్రం ఏర్పడ్డాక మన సాహిత్య జీవనంలో క్రమేణా మార్పు వచ్చి కుందుర్తి, తిలక్ వంటి కవులు నగరాన్ని కావ్య వస్తువుగా తీసుకొన్నారు. (కుందుర్తి 'నగరంలో వాన' గురించి ఇంతకు ముందే చెప్పుకున్నాం).

— — — — * * * — — — —

**రచనల వల్ల సీరియస్‌నెస్ లేనివాడిగా కనిపించినా పట్టాభి చాలా ఉదాత్తమైన ప్రవర్తన కలవాడు. ఉత్తమ రాజకీయ విశ్వాసాలు కలవాడు. తొలినాటి నుంచీ సోషలిస్టు, రామ్ మనోహర్ లోహియాకు సన్నిహితుడు. పట్టాభి భార్య శ్రీమతి స్నేహలత అన్ని విధాలా అతని సహధర్మచారిణి. ఆమె తన రాజకీయ విశ్వాసాలకు ఎమర్జెన్సీ రోజులలో జైలు పాలై, వైద్య సహాయం లేక అకాల మృత్యువు వాతపడింది. ఆమె సజీవురాలుగా ఉన్నప్పుడు పట్టాభి సాహిత్యం నుండి చలనచిత్ర సీమకు వలస వెళ్ళిపోయాడు.**

— — — — * * * — — — —

పట్టాభికి 'ఫిడేలు రాగాల దజన్' వల్లనే పేరూ, సాహిత్యంలో ఒక స్థానం లభించినా, అతడు ఇతర రచనలు కూడా చేయకపోలేదు. వాస్తవానికి 'రాగాల దజన్' రాయడానికి ముందే అతడు 1935-1937 సంవత్సరాలలో శాంతినికేతనంలో విద్యార్థిగా ఉన్నప్పుడు తన పదహారో యేటనే నూతన సంవిధానంతో కొన్ని రచనలు చేశాడు. పట్టాభి ఉద్దేశంలో కవితా రచన అనంత పరిశోధన. అందుకే అతడు అంత్యప్రాసలతో అనేక ప్రయోగాలు చేశాడు. శాంతినికేతనంలో ఆ రోజుల్లో రవీంద్రుడు ఛందస్సులు విసర్జించి, అంత్యప్రాసలను పాటిస్తూ వివిధ దేశీయ ఛందస్సులలో రచన చేస్తూ వుండేవాడు. అది చూస్తే పట్టాభి మార్గ కవితా వృత్తాలలో కాక మాత్రా ఛందస్సులలో, అంత్య ప్రాసలతో రచనలు చేయడానికి ఉపక్రమించారు.

వంగభాషా కవిత్వంతోనూ, రవీంద్రుని తోనూ పరిచయమైన ప్రతిభావంతులను మాత్రా ఛందస్సులో అంత్యప్రాసలు ఆకర్షించడంలో ఆశ్చర్యం లేదు. అబ్బూరి రామకృష్ణారావుగారు 1918లోనే శాంతి నికేతనం ప్రభావం వల్ల తెలుగు ఛందస్సులలో చాలా కొత్త ప్రయోగాలు చేశారు.

అబ్బూరి వారు ప్రవేశపెట్టేదాకా తెలుగు సాహిత్యంలో అంత్యప్రాసలు ప్రవేశించలేదను కోకూడదు. ప్రబంధాలలో రగడలు వాడే చోట్ల విధిగా అంత్యప్రాసలు పాటించాలి. అబ్బూరి వారు ఆదిప్రాసలు పాటిస్తూ అంత్యప్రాసలు వాడితే, పట్టాభి ఆదిప్రాసలు పాటించాలన్న నియమం ఏమీ పెట్టుకోలేదు. అయితే అంత్యప్రాసలు ఎలాగ పాటించాలన్న విషయంలో చాలా ఖచ్చితమైన నియమాలను పెట్టుకొన్నాడు. సాధారణంగా రెండేసి పాదాలకు అంత్యప్రాసలు వాడడం ప్రబంధాలలోని రగడలలో కనబడతాయి. పట్టాభి ఆ త్రోవ కొన్ని చోట్ల తొక్కినా చాలా విలక్షణమైన ప్రయోగాలు చేస్తూ కఠినమైన నియమాలు పాటించాడు.

పట్టాభి పెట్టుకొన్న ఈ వివిధ నియమాలు విశ్లేషించి చూస్తే ముందుగా ఎంత పథకం వేసుకొని పరిశోధనలు ప్రారంభించాడో తెలుస్తుంది. నిజానికి 'కయిత నాదయిత'లోని రచనల్లో కొన్ని కవితలు శాంతి నికేతనంలోనే కాక ఉత్తరోత్తరా స్కాట్లండ్‌లో, సిలోనులో, స్పెయిన్‌లో రాయడం జరిగింది. తెలుగులో రాసిన కవితలే అయినా తెలుగు దేశానికి దూరంగా ఉండి రాయడం వల్ల కొన్ని కవితల్లో వినూత్న వాతావరణం కన్పిస్తుంది.

సాధారణంగా తెలుగు కవితలలో పారిజాత కుసుమాలు, మలయ పవనాలు, మానస సరోవరాలు, లలిత లవంగీతలు కనపడతాయి. పట్టాభి కవితలలో హెదరుపూలు, న్యూరేలియ పవనాలు, పాలనూరవ సరసు, బార్లీరయి కుప్పలు మొదలైన కొత్త కవితా సామగ్రి కనపడుతుంది. నూనూగు మీసాల నూత్న యౌవనం నుంచీ ఇందులోని ఖండికలన్నీ పట్టాభి రచించాడు. "యవ్వనమ్ము భయవిహీన నిరుపమాన సాహసమ్ము" కనుకనే ఈ ఖండికలలోని భావాలు కొన్ని (సనాతనులకు) సాహసాలు లాగా కనబడతాయి. కనపడ్డ ప్రతి ఆడదాని మీద శ్రీనాథుడు పద్యాలు ఎందుకు రాశాడో అందుకే పట్టాభి కూడా రాశాడనుకుంటే ఈ సంకలనంలోని సిలోను పిల్ల, స్కాచిపిల్ల, చయినా యువతి, హవాయి కదు తీయవాయ పడతి, రజస్వల అర్థమవుతారు. వాళ్ళందరూ కవితలో దయితలు.

పట్టాభి 'నీలగిరి నీలిమలు', పట్టాభి 'పన్‌చాంగం' అనే ఇంకో రెండు గ్రంథ రచనలు చేశాడు. ఇవి ముద్రితాలు. మొదటిది 1959 లోనూ రెండవది 1980లోనూ అచ్చుపడ్డాయి. వాస్తవానికి 'పట్టాభి పన్‌చాంగం' 1946 నాటికే రాశాడు. అవి కొన్నాళ్ళు నా దగ్గరా ఉండేవి. శ్రీశ్రీ ఆనందవాణిలో కొన్ని పట్టాభి పన్నులు ప్రచురించాడు. నేను జ్యోతి మాసపత్రికలో దీని ప్రచురణకు సాయపడ్డాను. శ్లేష రాణించిన హృదయం రాజిల్లుతుంది. పట్టాభి శ్లేష హాయి తెలిసినవాడు. పన్నులలో సంపన్నుడు.

రచనల వల్ల సీరియస్‌నెస్ లేనివాడిగా కనిపించినా పట్టాభి చాలా ఉదాత్తమైన ప్రవర్తన కలవాడు. ఉత్తమ రాజకీయ విశ్వాసాలు కలవాడు. తొలినాటి నుంచీ సోషలిస్టు, రామ్ మనోహర్ లోహియాకు సన్నిహితుడు. పట్టాభి భార్య శ్రీమతి స్నేహలత అన్ని విధాలా అతని సహధర్మచారిణి. ఆమె తన రాజకీయ విశ్వాసాలకు ఎమర్జెన్సీ రోజులలో జైలు పాలై, వైద్య సహాయం లేక అకాల మృత్యువు వాతపడింది. ఆమె సజీవురాలుగా ఉన్నప్పుడు పట్టాభి సాహిత్యం నుండి చలనచిత్ర సీమకు వలస వెళ్ళిపోయాడు. ఆర్ట్ చిత్రాలకు అంకితమయ్యాడు. కన్నడంలో 'సంస్కార' అనే చిత్రం నిర్మించి దర్శకత్వం వహించారు. జాతీయ, అంతర్జాతీయ ప్రశంసలు అందుకొన్న ఉత్తమ చిత్రం అది. చలనచిత్రం నూతన దృశ్య కావ్యమని గుర్తించిన కొద్దిపాటి సాహితీపరులలో పట్టాభి ప్రథమ శ్రేణివాడు.

**(సమగ్రాంధ్ర సాహిత్యం 13వ సంపుటం నుంచి)**

# పత్రికా భాష్యకారుడు



**బూదరాజు పత్రికలలో ఉపయోగించే భాషకు సంబంధించిన సమస్యల్నీ - వాటిలో దోషాల్నీ సమగ్రంగా విశ్లేషించారు. దైనందిన జీవితంలో స్థిరపడిపోయిన అనేక భాషా ప్రయోగాల పుట్టుపూర్వోత్తరాలను ఆసక్తికరంగా అందించారు. అద్భుతమైన జ్ఞాపకశక్తితో ఈ అంశాలను అలవోకగా వివరించగల బూదరాజు అన్నిటినీ గ్రంథరూపంలోనూ అందించి యువ పాత్రికేయులకు గొప్ప మేలు చేశారు. అనేక విధాలా విస్తరించిన తెలుగు మీడియాలో భాషాపరమైన నిర్లక్ష్యాన్ని, నివారణీయ దోషాలను ఏ మాత్రం తగ్గించుకోగలిగినా అది బూదరాజుకు సరైన నివాళి అవుతుంది. ఆయన అపార అధ్యయనం యువ పాత్రికేయులకు, రచయితలకు మార్గదర్శకమైంది.**

**తెర**

బూదరాజు రాధాకృష్ణ మృతితో తెలుగు సాహిత్యం ఒక బహుముఖ ప్రజ్ఞాశాలిని కోల్పోయింది. తెలుగు మీడియా భాషా పటిమ, భావ స్పష్టత గల ఒక విమర్శకుడిని పోగొట్టుకుంది. గత పాతికేళ్లకాలంలోనూ భాషారంగానికి సంబంధించి ఆయన చేసిన సేవలు విస్తృతమైనవి, విలువైనవీ.

1924 మేనెల 3వ తేదీన ప్రకాశం జిల్లా వేటపాలెంలో పుట్టిన బూదరాజు ప్రాచీనాంధ్ర శాసనాలపై పరిశోధనకుగాను పిహెచ్‌డి పట్టా పొందారు. చీరాలలోని విఎస్‌ఆర్ కాలేజీలో తెలుగు అధ్యాపకుడిగా పనిచేసి ఆ పిమ్మట తెలుగు అకాడమీలో డిప్యూటీ డైరెక్టరుగా చేరారు. రెండు దశాబ్దాలు అక్కడే బాధ్యతలు నిర్వహించి, తానుగా బాధ్యతల నుంచి తప్పుకున్నారు. అప్పటికే 'ఈనాడు' జర్నలిజం కాలేజీ ప్రిన్సిపాల్‌గా చిరకాలం పని చేశారు. ఆ బాధ్యతలో భాగంగా 'ఈనాడు' శిక్షణా పాఠాలను రూపొందించారు. క్రమేణా అవి మొత్తం తెలుగు పత్రికారంగానికి ఉపకరణాలుగా తయారైనాయి. ఈ క్రమంలో అనేకానేక పుస్తకాలు రాశారు. అనువాదాలు చేశారు. గజ్జెల మల్లారెడ్డి చాలా కాలం నడిపిన 'పుణ్యభూమి' శీర్షికను ఆయన తర్వాత 'ధర్మారావు' పేరుతో పదిహేనేళ్లు నిర్వహించారు.

బూదరాజు తన జీవితానుభవాలను 'విన్నంత కన్నంత' పేరుతో గ్రంథస్తం చేశారు. దాన్ని చదివితే విద్యార్థిదశలో ఆయనపై వామపక్ష ఉద్యమాల ప్రభావం వున్నట్టు స్పష్టమవుతుంది. అత్యంత ప్రసిద్ధమైన వేటపాలెం సారస్వత నికేతనం గ్రంథాలయం ఆయనను నడిచే గ్రంథాలయంగా మార్చడంలో కీలకపాత్ర నిర్వహించింది. ధారణశక్తి, పరిశీలన, విమర్శనాదృష్టి పుష్కలంగా వున్న బూదరాజు గ్రంథాల నుంచే కాక తన గురువుల నుంచి, సహాధ్యాయుల నుంచి, అప్పటి రాజకీయ - సాంఘిక రంగాల ప్రముఖుల నుంచి ఎన్నో విషయాలు తెలుసుకోగలిగారు. ఆత్మకథలో వాటన్నిటినీ సూది గుచ్చినట్టు కొద్దిలోనే చెప్పగలగడం ఆయన జ్ఞాపకశక్తికి తార్కాణం. పుస్తకం చివరలో ఆయన తనను ఆశ్చర్యపరచిన - తనకు ప్రేరణ కలిగించిన ఎందరో ప్రముఖులను, ప్రసిద్ధులను వినయంగా ప్రస్తావించారు. ప్రజానాట్యమండలి నిర్మాత డాక్టర్ రాజారావు వంటివారు నిర్మాతలవుతారు గానీ ఆషామాషీ మనుషులు కాలేరని కూడా రాశారు. తన సుదీర్ఘ పత్రికారచనలో అనుభవాలను కూడా నిస్సంకోచంగా గ్రంథస్తం చేశారు. తన సమీక్షలు నచ్చక చాలా గొప్పవారైన కవులూ రచయితలూ కూడా ఒత్తిడి చేసిన తీరును పేర్లతో సహా ఇచ్చారు.

చిన్నతనంలో పాత పద్ధతి పద్యాలు రాసిన బూదరాజు ఆ విధమైన కవిగా కన్నా భాషావేత్తగానే సుపరిచితులు. బూదరాజు పత్రికలలో ఉపయోగించే భాషకు సంబంధించిన సమస్యల్నీ - వాటిలో దోషాల్నీ సమగ్రంగా విశ్లేషించారు. దైనందిన జీవితంలో స్థిరపడిపోయిన అనేక భాషా ప్రయోగాల పుట్టుపూర్వోత్తరాలను ఆసక్తికరంగా అందించారు. పురాణపాత్రల పదాలను లోతులు తవ్వితీశారు. అద్భుతమైన జ్ఞాపకశక్తితో ఈ అంశాలను అలవోకగా వివరించగల బూదరాజు అన్నిటినీ గ్రంథరూపంలోనూ అందించి యువ పాత్రికేయులకు గొప్ప మేలు చేశారు. మాటల వాడుక-వాడుక మాటలు, మాటలు- మార్పులు వంటి ఆయన పుస్తకాలతో పోల్చదగిన సాధనాలు ప్రస్తుతానికి లేవు. చారిత్రిక, వ్యాకరణ, సాహిత్యకోణాలు అన్నిటినుంచీ ఆయన ఇప్పటి పత్రికలలో ప్రయోగాలను క్షుణ్ణంగా శోధించారు. భాష నిరంతర పరిణామశీలి అని అంగీకరిస్తూనే సరిదిద్దుకోవలసిన తప్పుల్ని ఎత్తిచూపించారు. ఆయన గుర్తించిన కొన్ని తప్పులను తెలుగు పత్రికలు సరిచేసుకున్నాయి. మరికొన్ని సూచనలు ఆచరణయోగ్యం కాలేదు. కానీ అసలు అలాటి విమర్శను పెద్దఎత్తున అందరికీ అందుబాటులోకి తేవడంలో ఆయన పోషించిన పాత్ర చాలా గొప్పది. అంతకు ముందు కొందరు సంపాదకుల స్థాయికే పరిమితమైన ఈ భాషా పరిశీలనను ఆసక్తికరంగా మలచిన ఘనత ఆయనదే. తెలుగు జాతీయాలు, సంస్కృత న్యాయాలు వగైరాలను కూడా సుబోధకంగా క్రోడీకరించారు.

వ్యవహారిక పదకోశం, అనువాద పాఠాలు, జర్నలిస్టు కావాలంటే వంటి ఆయన గ్రంథాలు ఉత్తమ ప్రమాణాలను ఆవిష్కరిస్తాయి.

వ్యవహారిక భాషా వికాసం అన్న ఆయన పుస్తకం తెలుగు భాషా పరిణామక్రమాన్ని చెబుతుంది. ప్రస్తుత భాషా చర్చలకు కూడా ఎంతగానో సహకరించే పుస్తకం ఇది. భాషాశాస్త్ర వ్యాసాలు, నేటి తెలుగు నివేదిక కూడా ఈ కోవకు చెందినవే. తెలుగు అకాడమీ కోసం ఆయన మాండలిక వృత్తిపదకోశం రూపొందించారు. 'ఈనాడు' తరఫున పత్రికా నిఘంటువు వెలువరించారు. ఇవన్నీ అందరూ ఉపయోగిస్తూ వున్నారు. అయితే బూదరాజు కేంద్ర సాహిత్య అకాడమీ కోసం రచించిన శ్రీశ్రీ జీవిత చరిత్ర పుస్తకం మాత్రం అనేక విమర్శలకు గురైంది. సాహిత్యం కన్నా వ్యక్తిగత జీవితంపై ఎక్కువగా నడవడం ఇందుకు కారణం. అనుకున్న దాన్ని నిర్మొహమాటంగా చెప్పే వ్యక్తిగా ఆయనను అందరూ గౌరవిస్తారు. ఆయన అసంఖ్యాకంగా చేసిన పుస్తకసమీక్షలలోనూ ఈ లక్షణాలుంటాయి. కానీ ఆయన చెప్పిన విషయాలపై భిన్నాభిప్రాయాలు లేకపోలేదు. భాషా ప్రయోగాల విషయంలోనూ అలాటి అంశాలున్నాయి. సభల్లో మాట్లాడినా ఆయన ముక్కుమీద కొట్టినట్టు మాట్లాడి వివాదాలకు కారణమైన సందర్భాలున్నాయి. కానీ ఆయనను సన్నిహితంగా తెలిసిన వారు వీటికన్నా ఆయన కఠోర పరిశ్రమకు, లోతైన అవగాహనకు ప్రాధాన్యత నిచ్చేవారు. క్రమశిక్షణకు ఎంతో విలువనిచ్చిన బూదరాజు తీవ్ర అస్వస్థతలో కూడా 'కాలమ్' రాయడం మానకపోవడంలో ఆశ్చర్యం లేదు.

అనేక విధాలా విస్తరించిన తెలుగు మీడియాలో భాషాపరమైన నిర్లక్ష్యాన్ని, నివారణీయ దోషాలను ఏ మాత్రం తగ్గించుకోగలిగినా అది బూదరాజుకు సరైన నివాళి అవుతుంది. ఆయన అపార అధ్యయనం యువ పాత్రికేయులకు, రచయితలకు మార్గదర్శకమైంది. ●

# రజక జీవితాల్లో చైతన్యోదయం 'రేవు'




జి.ఎస్. చలం "రేవు" నవలలో రజకుల జీవితాల్లోని చాకిరీని, వెట్టిని చాలా వాస్తవికంగా మన ముందు పరిచారు. మనుషులు విడిచిన మాసిన గుడ్డల్ని, మలం గుడ్డల్ని, ముట్టు గుడ్డల్ని సొగసుగా అందించే వాళ్ళ చెమటతో మన గుండెల్ని తడిచేస్తారు. వృత్తే కాదు ఇంకా ఎన్నో వెట్టి పనుల్ని జీవితాంతం చేసే పగుళ్ళు బారిన బతుకు దృశ్యాలతో చలింప చేస్తారు. ఎంత చాకిరీలో మగ్గినా కూడుకు నోచుకోని బంద బతుకుల గోడు చెప్పడమే కాదు కట్టుబాట్ల మాటున బిగుసుకునే సంకెళ్ళను తెంచే సాహసాన్నీ చూపించారు.

**పరిమళ్**

ఈ నవలలో రెండు పాత్రలు ఆధిపత్యాల్ని నిలదీసేవి, మార్పుకు దోహదం చేసేవి వున్నాయి. అవి అంకమ్మ, రామిశెట్టి పాత్రలు. నారిశెట్టి కూడా తిరుగుబాటుతత్వం వున్న మనిషే. కాని, చైతన్యం అంతగా లేని పాత్ర. చైతన్యం వున్న పాత్ర వెనుక నడిచే పాత్ర. చైతన్యం, తిరుగుబాటుతత్వం వున్న పాత్రల్లో కూడా తేడాలున్నాయి. రామిశెట్టిలో తిరుగుబాటుతత్వం ఎక్కువ. పరిస్థితుల అవగాహన తక్కువ. ఏదిఏమైనా గానీ ఒకరి ఆధిపత్యం సహించకూడదనుకుంటాడు. స్వేచ్ఛ కోసం తపిస్తుంటాడు. ఒకరి ఆంక్షలు, ఆధిపత్యాల పడగ నీడ కింద పడి బతకడం సహించని మనిషి. అందుకే విజయనగరం లోని కొత్తపల్లిని విడిచి విశాఖపట్టణం చేరతాడు. రామిశెట్టి బతుకుదెరువుకు వెసులుబాటు పరిస్థితులుండే భూస్వామ్యం పట్టులేని పట్టణాన్ని ఎన్నుకున్నాడు. కుటుంబా న్నంతటినీ తీసుకువెళ్ళాలను కుంటాడు. ఉన్నచోటే ఊరిలోని ఉత్పత్తి సంబంధాలు బతుకును బుగ్గి చేయడంలోంచే ఒక మంటను రగిలించే చైతన్యాన్ని పొందలేకపోతాడు. అతనికంత అవగాహన లేదు. ఈ అవగాహన అక్క అంకమ్మ ద్వారా కలిగి నవల చివర్లో ఊర్లోనే నిలబడి జీవించాలని నిర్ణయించుకుంటాడు.

ఈ నవలలో చైతన్యం తొణికిసలాడే మనిషి అంకమ్మ. రజకుల జీవితాల్లో మార్పును వెలిగించిన మనిషి. అంకమ్మ భౌతిక పరిస్థితుల పునాది లేకుండా గాలి తిరుగుబాటు చేసే మనిషి కాదు. ఒక కారణం అదీ దిగజారినతత్వంతో పీడన హద్దుల్ని చెరిపేసినపుడు సత్యంతో వెలిగిపోతున్న చైతన్యంతో నిలబడుతుంది. చుట్టూ వున్న పరిస్థితులకు లోబడిన అవగాహనతోనే నవలలోని సంఘటనలలో ఆమె అన్యాయాలకు ఎదురు నిలిచినపుడు మోసకారులంతా ఆమె తిరుగుబాటు ధాటికి తట్టుకోలేక పోతారు. తమని తాము సముదాయించుకొని వెనక్కి తగ్గుతుంటారు. ఈ నవలలో ఒక పాత్ర "అదక్కడ పుట్టింది గాని మన కులంలో పుడితే కనీసం ఒక జిల్లాని ఏలీసును" అని తన స్వభావంలోంచి పలికినా ఈ మాటలు ఆమె స్వభావాన్ని పట్టిస్తాయి. అలా అని అంకమ్మ ప్రతి పీడనను సూక్ష్మంగా అర్థం చేసుకుంటున్నదని తిరుగుబాటు చేస్తుందని కాదు. అంత తాత్విక అవగాహన ఆమె చుట్టున్న పరిస్థితుల్లో లేదు. అందరి రజకుల్లాగే చాకిరేవులో మగ్గిపోతుంది. ఇంత వెట్టిలోనూ నోటికాడికి ముద్దెయ్యకుండా చేసే దుర్మార్గాన్ని తన శక్తి మేరకు అడ్డుకుంటుంది. మోసాన్ని ఎండగట్టేటపుడు ఆమె చేసే వాదన చాలా ప్రత్యేకమైనది. న్యాయమైన దాన్ని అడుగుతూ అడుగుతూ ఎట్టకేలకు ఫలితం లేదనుకున్నపుడు కొసమెరుపుతో పిడుగులాంటి నిర్ణయం ప్రకటిస్తుంది. ఆ దెబ్బకు అవతలిపక్షం ఓటమిని అంగీకరించలేక ఏదో ఒక మార్గంలో బయటపడుతుంటారు.

ఎండాకాలం వస్తుంది. చెరువు ఎండిపోతుండటంతో చాకలి వాళ్ళంతా విలవిలలాడిపోతుంటారు. తాగే నీళ్ళకోసమైనా అంత భయపడరు. బట్టలు ఉతకడానికి నీళ్ళు లేకపోతే మాత్రం ప్రమాదం ముంచుకొచ్చినట్లు బెంబేలెత్తిపోతారు. వేసవిలో చాకలి చెరువులోని నీరు రైతులు పంట పొలాలకు వాడుకోవడం ప్రతి యేడాదీ చేస్తుంటారు. ఆకు బట్టలకి రైతు బిందెలతో నీళ్ళు మోసుకెళ్ళుతుంటారు. రజకులు నీళ్ళని తీసుకెళ్ళొద్దని వారించినా రైతులు మానేవారు కాదు. నీరు ఎక్కువగా వున్నందు వల్ల గట్టిగా అనలేకపోయేవారు. చెరువు ఎండుతున్న పరిస్థితుల్లో అసిరినాయుడి కంబారులు (జీతగాళ్ళు) ఇంజన్‌తో నీరు పొలానికి పెట్టడానికి సిద్ధమవుతుండగా నారిశెట్టి అడ్డుకుంటాడు. కంబారులకు నారిశెట్టికి గొడవవుతుంది. అది చేతులు చేసుకునే దాకా వెళ్తుంది. చాకలిపేటలో రజకులంతా సమావేశమవుతారు. "మీ చెరువు జోలికి మరి రాం అని నాయుళ్ళందరు ఒప్పుకున్నంత వరకు ఆలగుడ్డలు ముట్టుకో కూడదు" అని అంకమ్మ నిర్ణయం ప్రకటిస్తుంది. రజకుల నిర్ణయం నాయుళ్ళందరికీ సవాల్ విసిరి నట్టయి ఆధిపత్యానికి రంధ్రాలు పడుతుంది.

ఊరి సర్పంచ్ దగ్గర నాయుళ్ళు సమావేశమవుతారు. నాయుళ్ళు ఈ సమస్యను అధిగమించడానికి చేసే చర్చలు చాలా కీలక మైనవి. రజకులు చెరువు నీటితో నాయుళ్ళ బట్టలే ఉతికేది. వృత్తికి కట్టివేయబడ్డ కులం కాబట్టి వృత్తితోనే కడుపు నింపుకోవాలి కాబట్టి చెరువు నీటిని తమ హక్కుగా ప్రకటిస్తారు. వాళ్ళు అలా అన్నప్పటికీ తమ బట్టలే కదా ఉతికేది అని తెలిసినప్పటికీ ధిక్కార స్వరాన్ని భరించలేకపోతారు. తమ పట్టు పగుళ్ళు బారిన విషయం స్పష్టం గాకుండా రకరకాల ఎత్తులు ఏస్తుంటారు. అవన్నీ ఫ్యూడల్ ఎత్తుగడలే. ఒక రైతు "మనం వాళ్ళ మాటకి తలొగ్గినట్టు ఉండకూడదు. ఆ లంజ కొడుకుల్నే పిలిపించి ఒరేయ్ మీ పని మీరు చేసుకు పోతుండండి. మీకిబ్బంది లేకుండా మావసరమయినపుడు మేం రెండు చుక్కలు వాడుకుందాం అని చెప్పడం ప్రస్తుతానికి అన్ని విధాలా బాగుంటుం దంటూ" ఫ్యూడల్ ఎత్తుగడ పన్నుతాడు.

వేరొకరు "ఆలకివ్వాల్సిన మాట గురించి ఇంత నజ్జుగుజ్జులెందుకు? ఇచ్చిన మాట ప్రకారం నిలబడాలనుందేటి? తక్షణం పనిలోకి రావడానికి వారికి అనుకూలంగా మాట్లాడదాం. ఆ తరువాత మనకిష్టమొచ్చినట్టు మనం చేసుకుందాం. తలతీసి మొలెయ్యలేరు కదా" అంటూ బ్రాహ్మణీయం ఎత్తుగడ పన్నుతాడు. ఈ రెండోవాడు చెప్పిన ఎత్తుగడతో అందరు నాయుళ్ళు ఏకీభవిస్తారు. స్పర్శకు అందకుండా నాచులా కాళ్ళు జార్చి పడగొట్టే నైజం బ్రాహ్మిణిజాని కుంటుంది. ఈ విధంగా తిరుగుబాటును ఎత్తుగడలతో చల్లబరుస్తూ చాకిరీ బాటలోకి సునాయాసంగా మళ్ళిస్తుంటారు.

చెరువు నీటిని వాడుకోవడాన్ని రజకులు నిలువరించిన తర్వాత నాయుళ్ళు దెబ్బతీయడం కోసం ఎదురుచూస్తుంటారు. నారిశెట్టి ఆదిశెట్టితో "చెరువు గురించి తగువు పడిన్నుంచి నాయుళ్ళు అయిందానికి, కానిదానికి రజకుల్ని రొకాయించడం ఎక్కువై పోయింది. మెత్తగుంటే ఇంకా మొత్తేత్తారు. జాగ్రత్తగా ఉండాలి. అయినా ఈలేటిసేత్తారు. మొలతాడు లేనోడు తిరగబడితే పోయిందేటుంది ఎట్టీ తప్ప" అంటాడు. ఈ మాటలు మార్క్స్ చెప్పిన పోరాడితే పోయేదేమీ లేదు. బానిస సంకెళ్ళు తప్ప" మాటల్ని గుర్తు చేస్తాయి. జీవితంలోని సమస్యలు పరిష్కార మార్గం వైపుకు మనుషుల్ని ఎలా సిద్ధం చేస్తాయో అర్థమవుతుంది.

ఈ నవలలో కొన్ని సందర్భాలలో నాయుళ్ళకు - రజకులకు మధ్య పరిస్థితులు జటిలమవుతుంటాయి. అవి బిర్ర బిగుసుకోకుండా చిక్కుముడులు విప్పినట్టు బోడి తాత వాతావరణాన్ని తేలికపరుస్తుంటాడు. పరిస్థితులు తిరుగబడిన మనుషులకు అనుకూలంగా వున్నపుడు మౌనంగా వుంటూ వాళ్ళు పై చేయి కావడాన్ని ఆహ్వానిస్తుంటాడు. వెట్టి బతుకుల పరిణామానికి తోడ్పడే పాత్రలకు దెబ్బ తగిలే సందర్భాల్లో అనునయ ధోరణితో హత్తుకునేటట్లుగా విషయం వివరిస్తూ ఆ పరిస్థితుల నుండి తప్పిస్తుంటాడు.

ఒకసారి గంప సోమినాయుడు బండి మీద జనువులు (పుంది కట్టలు) తెచ్చి రజకులు ఉతికే చెరువులో వేయబోతాడు. జనువులు వేయడం వల్ల నీరు పాడవుతుందని బట్టలు ఉతకడానికి రాదని అంకమ్మ అడ్డు చెబుతుంది. "సెరువు నీకు పట్టా రాస్సిందా గవర్నమెంట్'' అంటాడు గంప

— — — — — * * * — — — — —

**చాకలి వాళ్ళంటే అందరికీ చులకనే. వృత్తిలో నిత్యం బండకేసి బాదినట్టే వుంటుంది. చలికాలంలో ఇంత ఉదయం వస్తే ఎలానే మేమెలా బతకాలి అంటూ కప్పుకున్న దుప్పటి తీసి చాకలి ముందు పడేసి వణికిపోతుంది ఒకామె. ఇంత తెల్లారినంక వస్తే మేము పొలానికి ఎప్పుడెళ్ళాలి అని ఒకామె కోపాన్ని వ్యక్తం చేస్తుంది.**

— — — — — * * * — — — — —

సోమినాయుడు. రాస్తేనే అవుద్దేటి తాతలు నుంచి దున్నుతున్న భూమి నీదైనపుడు మా ముత్తాతల్నుంచి గుంజుతున్న సెరువు మాదవ్వదా? అని నిలదీస్తుంది అంకమ్మ. నిజానికి భూమి దున్నేది ఏమీలేని నిరుపేదలే. భూమికి యజమానులు మాత్రం దున్నని వాళ్ళే. చెరువుకు వృత్తికి ఏనాటినుండో వున్న సంబంధంలోంచి వారసత్వపు హక్కును వ్యక్తం చేస్తుంది. ఇదేదో దున్నేవాడిదే భూమి వ్యవహారం లాగా వుందని గంప సోమినాయుడికి కోపం నషాళానికెక్కుతుంది. గంప సోమినాయుడు కోపంతో జనపకట్ట చెరువులో వేస్తే అంకమ్మ తీసి ఒడ్డు మీదకి పడేస్తుంది. అంకమ్మను విసురుగా ముందుకు తోస్తే కిందపడిపోకుండా నిలబడి తిడుతుంది. మళ్ళీ ఆమె మీదకి వెళ్ళబోతాడు. "రారా... ఆడదాన్ననుకుంతన్నావు గావాల, నీ సత్తువెంతో నా సత్తువెంతో సూసుకుందాం రా" అని కాలుదువ్వుతుంది. పరిస్థితి చేయిదాటకముందే బోడితాత రేవులోంచి వచ్చి సర్దుబాటు చేస్తాడు.

చాకలి వాళ్ళంటే అందరికీ చులకనే. వృత్తిలో నిత్యం బండకేసి బాదినట్టే వుంటుంది. చలికాలంలో ఇంత ఉదయం వస్తే ఎలానే మేమెలా బతకాలి అంటూ కప్పుకున్న దుప్పటి తీసి చాకలి ముందు పడేసి వణికిపోతుంది ఒకామె. ఇంత తెల్లారినంక వస్తే మేము పొలానికి ఎప్పుడెళ్ళాలి అని ఒకామె కోపాన్ని వ్యక్తం చేస్తుంది. ఒక నాయుడు జల్లెడ చుక్కల్లా రంధ్రాలుపడ్డ బనియన్ని ముఖం కేసి విసిరేస్తాడు. ఆరేసినపుడు చెదలు పట్టిందంటే చెదలు పట్టింది బనియన్‌కి కాదు మీ వీపులకి, దులిపితే గాని జాగ్రత్తగా తీసుకురారంటాడు.

ఒకాయన "ఏరా ఈ చొక్కా నాదేనా? అయితే ఈ రంగేటి? తెల్ల చొక్కా తీసికెళ్ళి రంగుల చొక్కాగా మార్చేసావ్. ఏ మంత్రమేసి ఇలా మండబెట్టేసావ్" అంటాడు. గూనలోని గుడ్డలన్నీ కలిపి ఉడకబెట్టినపుడు నాసిరకం గుడ్డ రంగు వదిలేసిందంటే "నాయుడిగారి బట్టలని, నాదారోల గుడ్డలని తేడా లేకుండా కలిపేసి ఉడకబెట్టేసినందుకు నిన్ను రేవెట్టాల్రా"! అంటాడు. బట్టలు ఉతకడంలో కూడా కుల ప్రమాణాలు పాటించాలని హుకుం జారీ చేస్తాడు.

"ఏరా చాకలి తొత్తు కొడుకా... ఈ లుంగీ అసలు రంగేది? రేవు కేసినపుడు ఏ రంగు ఉండేది? ఇపుడు ఏ రంగులో ఉంది?" "బట్ట కసింత నాసిరకం నాగ ఉంది బావ్". బట్ట నాణ్యత గురించి కాదురా నిన్నడిగింది లుంగీ అసలు రంగేమయిందో చెప్పు? ఉడకబెట్టినపుడు... అంతే సెట్టోడి చెంప ఛెళ్ళుమంది... ఈ విధంగా చాకలి చాకిరీలోనే గాక అవమానాలు, దండనలతో గూనలోని గుడ్డలా ఉడికిపోతుంటాడు. వర్ణ వ్యవస్థ పుట్టుకను బట్టి పనిని శాస్తుంది. కింది కులాల్లోని వాళ్ళ బతుకుల్ని జంతు బతుకులుగా మార్చివేసింది. చాకలి వాళ్ళ బతుకులు వృత్తితో బాటు అదనపు వెట్టి పనులైన కావుళ్ళ మోతలతో నుజ్జయిపోతుంటాయి. నాయుళ్ళ ఇళ్ళల్లో చావైనా, పెళ్ళయినా, వాళ్ళ ఆడపిల్ల మూలకూచున్నా, వాళ్ళకు కడుపొచ్చినా కావుళ్ళు మోసుకెళ్తారు. పెళ్ళికి పల్లకీలు మోస్తారు. శవాలు పాతడానికి గోతులు తవ్వుతారు. కాలే శవాల దగ్గర కాపలా ఉంటారు. సంవత్సరానికి నాయుళ్ళు యిచ్చేది మాత్రం ముప్పందుం - ధాన్యం. సబ్బులు, నీలిమందు, బొగ్గులు అన్నీ సమకూర్చుకుంటూ ముప్పందుం ధాన్యంతో బతుకును లాగాలి. ఇలా రజకులు వెట్టిలో మసైపోతున్న కఠిన వాస్తవాన్ని కల్పన లేకుండా చిత్రించారు.

సంక్రాంతికి సరిగ్గా ముప్పయ్యవ రోజున బల్ల పండుగ చేస్తారు. నెల రోజుల వరకు రేవులో మురికి గుడ్డలు ఉతక్కూడదు. బట్టలు కాలిపోకూడదని, గాలివాన రాకూడదని, నాయుళ్ళ చేత తిట్లు పడకూడదని, ప్రతి రోజూ సజావుగా సాగిపోవాలని తమ కుల దేవత మరియాడ చెల్లమ్మని వేడుకుంటారు. సంవత్సరం పొడుగునా చాకిరీలో మునిగే చాకళ్ళకు పండగ సందర్భంగా నెలరోజుల విరామం దొరుకుతుంది. ఈ నెలరోజులు కూడా విశ్రాంతి తీసుకోనివ్వరు. తాము ధరించిన బట్టల్ని తాము ఉతుక్కోలేక చాకళ్ళను మీ సంప్రదాయం ప్రకారం రేవు దగ్గర గాకుండా నూతి పళ్ళెం దగ్గర ఉతుక్కురమ్మని ఆదేశిస్తుంటారు. కులాధారిత గ్రామ వ్యవస్థలో

చాకిరీతో ముద్ద సంపాదించుకోవాలి కాబట్టి పండగ సంప్రదాయాలకు భిన్నంగా గుడ్డలు ఉతకడానికి ఆదిశెట్టి వెళ్ళడం కనిపిస్తుంది.

చాకలి వాళ్ళ పిల్లలు చిన్నప్పటి నుండే తల్లిదండ్రులకు రేవు పనుల్లో సహాయ పడుతుంటారు. క్రమంగా వృత్తి నేర్చుకొని చాకిరీలోకి వస్తుంటారు. బూసిగాడు నూకల మూట భుజం మీద వేలాడదీసుకొని మరో చేత్తో కేరేజీ పట్టుకొని తల్లి అంకమ్మ వెంట రేవుకు బయలుదేరుతాడు. బట్టలు ఉడకబెట్టే గూనపొయ్యి దగ్గర పుల్లల్ని ఎగదోస్తూ, మండిస్తూ ఉంటాడు. తడి బట్టలు ఆరబెట్టే టపుడు తనూ ఒకపక్క పట్టుకొని తల్లికి సహాయ పడుతుంటాడు. ఈ విధంగా రజకుల పిల్లలు చదువుకు దూరంగా చాకిరీని (వృత్తి) అలవాటు చేసే పనుల్లో తర్ఫీదు పొందుతుంటారు.

ఈ నవలలో రజకుల చైతన్యం స్థాయి క్రమంగా పెరుగుతూ వచ్చింది. మొదట అసిరినాయుడు చెరువు నీరు పొలానికి వాడుకోవడాన్ని అడ్డుకోవడంతో నాయుళ్ళ అహంకారం దెబ్బతింది. అక్కడి నుండి వాళ్ళు రజకులపై కసి, కోపం పెంచుకుంటారు. గంప సోమినాయుడు చెరువులో జనువులు వేయడాన్ని అడ్డుకోవడంతో వెట్టి చేసేవాళ్ళు నిలదీయడాన్ని జీర్ణించుకోలేకపోతారు. పెదనాయుడు మంచం మీద చనిపోయిన తర్వాత ఆ మంచం లంకమ్మకు ఇవ్వాల్సి వుంది. ఆనవాయితీని తప్పినపుడు ఆమె మంచం సాధించుకునేదాకా చేసిన రచ్చ నాయుడిగారికి మంటబెట్టినట్లయింది. ఆదిశెట్టి నాయుడిగారి దొడ్లో కట్టెలు తీస్తూ పట్టుబడినపుడు ఆధిపత్యం నిలుపుకునే తెలివైన ఎత్తుగడని అంకమ్మ తిప్పికొట్టినపుడు నాయుడిగారి పట్టు నీరుగారిపోయింది. ఈ విధంగా చైతన్యం విచ్చుకుంటూ చివరికి అంకమ్మ, ఆదిశెట్టిలకు రావాల్సిన జీతం గింజల్ని నాయుడుగారు ఎగ్గొట్టాలనే ఎత్తేసినపుడు జ్వాలలా ఎగిసిపడుతుంది.

పంట యింటికొచ్చి మూడు నెళ్ళయినా నాయుడుగారు అంకమ్మ కుటుంబానికి రావాల్సిన జీతం గింజలని ఇవ్వకుండా ఎగ్గొట్టాలనుకుంటాడు. అంకమ్మ అడిగితే మీకు జీతం గింజలు ఇవ్వాల్సిన అవసరం లేదు. బట్టలన్నీ ఈ యేడు పాడు చేశారు. గాలికెగిరిపోయాయని, ఎలుకలు కొరికేశాయని ఇలాంటి కారణాలెన్నో చెప్పారు. మల్లమ్మపేట కావిడి పట్టుకెళ్ళినపుడు బియ్యం మూట బస్సులో పోయిందని చెప్పారు. అది

— — — — — * * * — — — — —

**చదువు, సాంకేతికాభివృద్ధి వల్ల ఆయా కులాల వాళ్ళు కులవృత్తులకు దూరం కావడం జరుగుతున్నది. అన్ని కులాల్లోనూ వర్గ స్వభావ శ్రామికుల సెక్షన్ తయారవు తున్నది. వీళ్ళదంతా శ్రామిక కులం. వృత్తులు పెట్టుబడిదారీ రూపాన్ని తీసు కుంటున్నాయి. సమాజం పెట్టుబడిదారులు, శ్రామికుల విభజన వైపుకు మారుతూ అదే ప్రధాన వైరుధ్యంగా ఏర్పడుతున్నది.**

— — — — — * * * — — — — —

నిజంగానే పోయిందో, ఆదిశెట్టి ఎవరికైనా అమ్మేశాడో అంటాడు. ఈ పొరపాట్లు గతంలో ఈ ఊరిలో చాలామందికి జరిగాయి. మీక్కూడా జరిగాయి. అపుడు వాళ్ళు ఏమీ అనలేదు. మీరు కూడా ఏమీ అనలేదు. ఇపుడే అంటున్నారంటే మనసులో మామీద ఏదో పెట్టుకున్నా రంటుంది అంకమ్మ. మావల్ల జరిగిన పొరపాటుకి జీతం గింజలు ఇవ్వాల్సిన అవసరం లేదని ఈ ఊర్లో ఏ ఒక్కరితో అనిపించినా జీవితకాలం జీతం లేకుండా పనిచేస్తానంటుంది. బస్సులో జేబులోని డబ్బులే కొట్టేస్తుంటే మనిషొక దగ్గర మాటొక దగ్గర ఉన్నపుడు పోవడంలో వింతేముందని అడుగు తుంది. ఈలోపల ఇరుగుపొరుగు వాళ్ళంతా అక్కడికి చేరతారు. అంతమంది ముందు నాయుడిని తీసేసినట్లు మాట్లాడటం భరించ లేక నాయుడిగారి భార్య తలుపులు మూసేస్తుంది. అంకమ్మ ఆవేశంతో తిట్టడం ప్రారంభిస్తుంది. తిడుగూ తిడుతూ "ఒరే గండా నా సెమట తాగితే నాసాడు తాగినట్టే" అంటుంది. ఈ మాట పల్లెల్లో దొరలను ఎది రించే చైతన్యంలోంచి వచ్చిన "దొర ఏందిరో దొరపీకుడేందిరో"తో సమాన మైనట్టింది. కాని, దొరలను ఎదిరించే మాటల వెనక వున్న తాత్విక భూమిక మాత్రం అంకమ్మకు లేదు.

అంకమ్మ నాయుడిగారిని జీతం గింజల కోసం తిట్టినపుడు తలతెగినట్టయి అంకమ్మను కాలితో తంతాడు. ఈ విషయం తెలిసి రామిశెట్టి పట్నం నుండి పల్లెకొస్తాడు. తను వెళ్ళిన నాటి నుండి ఊళ్ళో జరిగిన పరిణామాలన్నీ తెలుసుకుంటాడు. ఈ చైతన్యం పోవడమేనని, అందుకే తనొక్కడినే పట్నం వైపుకు పలాయనం సాగించాలనుకుంటాడు. వీళ్ళందరినీ పూసల్లోని దారంలాగా నిలబెట్టింది సమిష్టితత్వమనే సత్యాన్ని కనుగొంటాడు. ఈ సమయంలోనే విశాఖపట్టణంలో భద్రతలేని ఉద్యోగంతో చాలీచాలని జీతంతో బతుకు లీడుస్తున్న కార్మికుల్ని సమైక్యంగా పోరాటమార్గంలోకి మళ్ళిస్తున్న కార్మిక నాయకుడు మనసులో మెదులుతుంటాడు.

భారతదేశంలో జరిగింది శ్రమ విభజన కాదు. శ్రామికుల విభజన అంటాడు అంబేద్కర్. మనుషుల స్వభావాల, అంతఃశక్తుల ప్రకారం గాకుండా పనుల్ని బలవంతంగా రుద్దే ఈ వ్యవస్థ వల్ల సమాజాభివృద్ధిలో వేగం మందగించింది. కొందరి జీవితాలే వెలిగి పోయాయి. ఎందరివో జీవితాలు నలిగి పోయాయి. వృత్తి - కులానికి వున్న సంబంధం సమాజ పరిణామంలో వృత్తి - వర్గానికి గల సంబంధంగా మారిపోతున్నది. నేటి సమాజంలో బట్టలు ఉతకడమనేది చాకలి వాళ్ళకే పరిమితం గాక పేదవాళ్ళు చేస్తున్న శ్రమగా మారిపోతున్నది. అంటే వృత్తికున్న కుల సంబంధం వర్గ సంబంధంగా మారిపోతున్నది. మనుషులు ఏ పనుల్ని చేసినా గౌరవంగా చూడగలగాలి. అసహ్యంగా కనిపించే పనులు చేసేవారిని మహోన్నతంగా చూసే సంస్కారం అలవడాలి.

చదువు, సాంకేతికాభివృద్ధి వల్ల ఆయా కులాల వాళ్ళు కులవృత్తులకు దూరం కావడం జరుగుతున్నది. అన్ని కులాల్లోనూ వర్గ స్వభావ శ్రామికుల సెక్షన్ తయారవుతున్నది. వీళ్ళదంతా శ్రామిక కులం. వృత్తులు పెట్టుబడిదారీ రూపాన్ని తీసుకుంటున్నాయి. సమాజం పెట్టుబడిదారులు, శ్రామికుల విభజన వైపుకు మారుతూ అదే ప్రధాన వైరుధ్యంగా ఏర్పడుతున్నది. పెట్టుబడిదారీ శ్రామిక సంబంధాల వైరుధ్యం తీవ్రమైనపుడు పీడనకు హద్దుల్లేకుండా పోతాయి. పీడక వ్యవస్థ కడుపులోంచే ఆ పీడనను రద్దు చేసే మార్పు ముందుకు వస్తుందంటాడు మార్క్స్. రామిశెట్టి మనసులో కార్మిక నాయకుడు మెదలడం భవిష్యత్‌లో ఈ స్వప్న సాకారాన్నే సూచిస్తుంది కదా!

ఈ మార్పు వచ్చేవరకు జరిగే పరిణామ కాలమంతా కులం వల్ల కలుగుతున్న ఆ గౌరవాన్ని, న్యూనతను దానికి ఆర్థికం తోడై నపుడు జరిగే అణచివేతను భరించాల్సిందేనా? అందుకే వర్గ - కుల పోరాటాల్ని జమిలీగా చేయాల్సిన కర్తవ్యం ప్రగతిశీల శక్తులపై వుంది. శ్రమ దోపిడేగాక కులం వల్ల కలిగే అదనపు పీడనల నుండి కింది కులాలన్నింటినీ తప్పించే కార్యాచరణ ఉన్నపుడు పోరాట జెండా రెపరెపల్తో ఎగిసిపడుతుంది.

# మాఫీ



పుప్పాల కృష్ణమూర్తి

సూర్యకిరణాలు సూదుల్లా కన్రెప్పల మీద వాలాయి. ఉలిక్కిపడి లేచింది మేరి. గడ్డకట్టిన రక్తంలా వున్నాడు సూర్యుడు. 'ఎక్కడున్నాను' మనసులో అనుకుని చుట్టూ చూసింది. ఎత్తుగా పెరిగిన పత్తి చెట్లు, రాత్రి సంఘటన జ్ఞాపకమొచ్చి, ఒక్కసారే ఒళ్ళు జలదరించింది. భయంతో, ఎవరన్నా తన కోసం వస్తున్నారేమోనని తలపైకెత్తి చూసింది.

దూరంగా పొగలు చిమ్ముతున్న సిమెంట్ ఫ్యాక్టరీ. మనుషులెవ్వరూ కనిపించడం లేదు. 'హమ్మయ్య' అనుకుంటూ గుండె నిండుగా గాలి తీసుకుని నిట్టూర్చింది. ఓసారి తన బట్టల వైపు చూసుకుంది. రక్తం మరకలతో అట్టలు కట్టి వుంది కుర్తా. తలను తడుముకుంది. నెత్తిమీది వెంట్రుకలు రక్తంతో కలిసి అంటుకుపోయి వున్నాయి. తలపై గాయాన్ని తడుముకుంది. రెండంగుళాల మేర పగిలిన తల, స్పర్శ తగలగానే రక్తం స్రవించసాగింది. చెట్లకున్న పత్తికాయల్ని తెంపి దూది తీసింది. అంగుళం పొడవు పెరిగిన కురచ వెంట్రుకల మధ్య గాయం నిండా దూది పెట్టింది రక్తం కారకుండా. పత్తి ఆకుల్ని తెంపి రక్తం తుడిచేసుకుంటూ, పడమర వైపు కనిపిస్తున్న ఇండ్ల వైపు మెల్లగా కదిలింది. రాత్రి జరిగిన విషయం నీడలా వెంటాడుతూ భయపెట్టసాగింది. ఎవరో తనను పట్టుకోవడానికి వస్తారేమోనని, పదే... పదే చుట్టూ చూస్తూ నడవసాగింది బెదురు బెదురుగా.

మేరీది నందిగామ దగ్గర వీర్లపాడు. తండ్రి ఏసోబు. భార్య చనిపోవడంతో నలభయ్యారో ఏట రెండో పెళ్ళి చేసుకున్నాడు. మొదటి భార్యకు ఇద్దరు పిల్లలు. జేమ్స్, మేరి. తల్లి బతికుండానే ఏడో తరగతి ఎగ్గొట్టి, రామదాసు వెంట లారీ క్లీనర్‌కు వెళ్ళేవాడు జేమ్స్. మేరీ బుద్ధిగా బడికెళ్ళేది. కొద్దికాలం తర్వాత తల్లికి టి.బి. సోకడంతో బడి మానేసి, యింట్లో పనిచేసుకుంటూ ఉండిపోయింది. యింట్లో వండిపెట్టే దిక్కులేదనే వంకతో, ఓ పిల్ల తల్లిని చేసుకున్నాడు. ఆమె కాపురానికొచ్చాక మరో ఇద్దరు పిల్లలు పుట్టారు.

మారుతల్లి వచ్చాక మేరీ కష్టాలు మొదలయ్యాయి. చిన్న పిల్లల ముడ్లు కడగడం, స్నానం చేయించడం, ఆడించడం, అంట్లు తోమడం, అన్నం వండటం, కట్టెలు ఏరుకురావడం, బట్టలు ఉతకడంతో సహా అన్ని పనులూ చేయించేది. కాని అన్నం కుండ దగ్గరికి మాత్రం రానిచ్చేది కాదు. తన పిల్లలూ, తనూ తిన్నాక మిగిలింది పెట్టేది. కూర ఉండేది గాదు. ఎక్కువగా కుండలో కారంతోనే తినాల్సి వచ్చేది. మజ్జిగన్న మాటే కనిపించేది గాదు. మాంసం కూర వండిన, పండగ రోజుల్లో ముక్కలన్నీ తన పిల్లలకూ, భర్తకూ వేసి, వట్టి పులుసు పోసేది. దాంతో కడుపులో మంట... నొప్పి. ఎపుడన్నా పక్కింటికెళ్ళి కూర అడుక్కొచ్చుకుంటే, "అంటేనేమో అన్నదాన్నయిన. ఒక్కనాడు కూర లేకుంటే తినలేరానమ్మా, ఇంటి పరువు తీయాల్నా?' అని పెద్దగా అరుస్తూ, బజార్లో యాగి చేసేది. సరైన తిండి లేక, మేరీ ఎండు కట్టెలా అయింది. జేమ్స్ సరిగా యింటికొచ్చేవాడేగాదు. ఎపుడన్నా వొస్తే 'యింట్లో డబ్బులు యివ్వవేంది? ఆ ఎత్తుగ సినిమాలకు, షికార్లకూ ఖర్చు చేస్తే, నేనొక్కదాన్ని ఎంతగనం సంసారం లాక్కురాను. మీ సెల్లిలేమో

సిన్నదాయె. మీ అయ్యేమో సేతగానోడాయె. ఎవడు సాదాలే పిల్లల్ని' అంటూ తగాదా వేసుకునేది పినతల్లి. అందుకే నెలలో ఇరవై ఐదు రోజులు డ్యూటీలోనే ఉండేవాడు. లారీ దిగితే, తన స్నేహితుల ఇండ్లల్లో ఉండేవాడు. ఎప్పుడోసారొచ్చి, ఉంటే అన్నం తిని, చెల్లెల్ని చూసి వెళుతుండేవాడు. డబ్బులు అవసరమైనప్పుడల్లా, భర్తను కొడుకు వద్దకు పంపుతుండేది కమలమ్మ.

ఏసోబుకు యాభై ఎనిమిదేళ్ళు మీద బడ్డాయి. గతంలో గూడెం వాళ్ళ వెంట కూలి పనులకు వెళ్ళేవాడు. కానీ యిపుడు ఆరోగ్యం క్షీణించింది. నడుస్తుంటేనే ఆయాసం వస్తోంది. ఏ పనీ చేయలేకపోతున్నాడు. ఊపిరి సలపని దగ్గుతో ఉక్కిరిబిక్కిరి అవుతున్నాడు. ప్రభుత్వ దవాఖాణాకు వెళ్ళి మందులు తెచ్చుకుని వాడుతున్నాడు. కాని పూర్తిగా జబ్బు తగ్గలేదు. బలమైన ఆహారం తీసుకోవాలనే, బైట షాపులో కొన్ని మందులు వాడాలని చెప్పాడు డాక్టర్. కానీ డబ్బుల్లేక అవే మందులు వాడసాగాడు. దాంతో ఒకపూట తగ్గుతున్నట్లు, మరోపూట పెరుగుతున్నట్లుగా వుంది.

ఏసోబు ఆరోగ్యం క్షీణించడంతో కుటుంబాన్ని పోషించాల్సిన బాధ్యత పూర్తిగా కమలమ్మ మీద పడింది. తను కూలికెళ్ళి కష్టపడి తెస్తుంటే, యింతనుంది ఊరికే తింటున్నారనే కసి పెరిగిపోయింది. మేరిని కూడా పత్తి, మిర్చి ఏరడానికి తీసుకుపోయేది. మేరీని తిట్టడం, తరచుగా కొట్టడం చేస్తోంది. ఏసోబు భార్యనేమీ అనలేదు. దయతో నాలుగు మెతుకులు వేస్తే తింటున్నాడాయె. బిడ్డ పరిస్థితి చూసి, తండ్రికి బాధ ఎక్కువైంది. చాలాసార్లు అనుకున్నాడు. రెండో పెళ్ళి చేసుకుని, తప్పు చేశానని, కానీ యిప్పుడు చేయగలిగిందేమీ లేదు. 'ఆమె పెడితే తినడం, లేకుంటే లేదు.' చావుకు దగ్గర్లో ఉన్నాడతను. ఎలాగోలా డొల్లిపోద్ది కాలం. కాని మేరీ పరిస్థితి తలచుకుంటేనే ఎటూ పాలుపోవడం లేదు. పద్నాలుగేళ్ళొచ్చాయి. పెళ్ళి చేసి ఓ అయ్య చేతిలో పెడితే బాధ్యత తీరిపోద్ది. సెంటు భూమి లేదు. చేతిలో చిల్లిగవ్వ లేదు. ఈ రాక్షసి చేతిలో అమ్మాయి నలిగిపోతోంది. ఏం చేయడమా? అని మధనపడసాగాడు.



ఇంతలో ఒకనాడు వెతుక్కుంటూ వచ్చి వార్త చెప్పాడు రంభయ్య. 'చిన్న చౌదరి కొడుకింట్లో పనిచేయడానికి పని పిల్ల కావాలంట. మేళ్ళ చెర్వు మండలంలోని సిమెంట్ ఫ్యాక్టరీలో ఆయనకు పెద్ద ఉద్యోగం అని చెప్పాడు.

ఏసోబుకు కాస్త ఆసరా దొరికినట్లయింది. తన బిడ్డకు మారుతల్లి చెరలోంచి విముక్తి లభిస్తుంది. ఆ వచ్చే డబ్బులు తన వైద్యానికో, పిల్ల పెళ్ళికో ఉపయోగించుకోవచ్చు. అమ్మాయి నీడపట్టున సున్నబారుద్ది, ఒళ్ళు జేస్తది. ఏ పోరగాడి కన్నా యిచ్చి, ఎండాకాలం పెళ్ళి చేయొచ్చు' అని ఆలోచించాడు. ఏడాదికి రెండువేల ఐదువందలకు పనిలో కుదిర్చాడు బిడ్డను. వెంటనే వెయ్యి అడ్వాన్సుగా యిచ్చాడు చౌదరిగారు. మరుసటిరోజు ఒక పళ్ళెం, గ్లాసు, జత బట్టలు, అతుకు వేసిన దుప్పటి సంచిలో పెట్టి, వెంటబెట్టుకుని వెళ్ళి, సురేష్‌గారింటికి పంపించాడు. వెయ్యి రాగానే, 'పెళ్ళికి ఒక నగన్నా పెట్టవాయె' అని ఐదువందలు పెట్టి, చెవులకు దిద్దులు చేయించుకుంది కమలమ్మ. మిగిలిన డబ్బుతో కాస్త మందులు, టానిక్కు తెచ్చుకుని వాడసాగాడు.

తండ్రితో పాటు మేరీ కూడా మారుతల్లి చెర తప్పుతుందనే సంతోషపడ్డది. కాని ఆ సంతోషం ఎక్కువ కాలం నిలవలేదు. సురేష్, భార్య సింధూర యిద్దరూ పోస్ట్ గ్రాడ్యుయేట్లే. కాని వాళ్ళలో మానవత్వం మచ్చుకైనా కనిపించేది గాదు. బీదవాళ్ళన్నా, దళితులన్నా ఎక్కడ లేని ఎలర్జీ, వాళ్ళని 'తమబోటి వారికి ఊడిగం చేయడానికే దేవుడు సృష్టించాడు' అనుకుంటారు. 'ఎ' టైప్ క్వార్టర్‌లో ఉండేవారు. తెల్లవ రుజామున నాలుగింటికే లేవాలి. ఒకవేళ అలసిపోయి లేవలేకుంటే కట్టెతో కొట్టో. కాలితో తన్నో నిద్రలేపేవారు. బూతులు తిట్టేవారు.

లేచినప్పట్నుంచే దొడ్లు కడగటం, బట్టలు ఉతకడం, బూట్లు పాలిష్ చేయడం, నీళ్ళు కాగబెట్టడం, అంట్లు రుద్దడం, బట్టలు ఉతకడం, కూరగాయలు తేవడం, బొచ్చు కుక్కని కడగడం, దాన్ని దొడ్డికి కూర్చోబెట్టుకు రావడం యిలా ఒకదానివెంట ఒకటి సిద్ధంగా ఉండేది. అన్ని పనులూ యంత్రంలా చేసుకుంటూ పోయేది. ఏ పని నచ్చకున్నా అట్లకాడతోనో, అప్పడాల కర్రతోనో తలమీద కొట్టేది సింధూర. తన కోపం తీరకుంటే భర్త రాగానే చెప్పేది. అతను బెల్టుతో బాదేవాడు. బోనులో పిల్లిలా గడగడా వణుకుతూ 'ఈసారి మంచిగా చేస్తా, మీ కాళ్ళు మొక్కుతా కొట్టమాకండి' అంటూ వేడుకునేది. కోపం తీరాక శాంతించేవాళ్ళు. వాళ్ళకిద్దరు పిల్లలు కార్తీక్, కావ్య. పిల్లవాడికి పదేళ్ళు. పాపకు ఎనిమిదేళ్ళు. తల్లిదండ్రుల్ని చూసి పిల్లలిద్దరూ మేరీని కొట్టేవాళ్ళు. పిల్లవాడు క్రికెట్ బాట్‌తో బాదేవాడు. అమ్మాయి చేతికి ఏది దొరికితే, దాన్ని తీసుకొని వేసేది. పిల్లవాడు టి.వి. చూసి అందులో ఫైట్లన్నీ మేరీ మీద చేస్తుండేవాడు. కొట్టీ... కొట్టీ... తలనిండా గాయాలు. ఒళ్ళంతా దెబ్బలు. ఏ రోజన్నా, తిట్టకుండా, కొట్టకుండా ఉన్నారంటే అవి వేళ్ళ మీద లెక్కపెట్టేన్ని రోజులు మాత్రమే. పిల్లలన్నా కొట్టకుండా చూసుకుందామని, ప్రేమగా అనునయించేది మృదువుగా మాట్లాడుతూ, కాని కొద్దిసేపే మంచిగా ఉండేవాళ్ళు. తర్వాత ఏదో విధంగా కొట్టేవాళ్ళు.

ఒకసారి గిన్నెకున్న అన్నం మెతుకులు పోలేదని అట్లకాడ కాల్చి వీపు మీద వాతపెట్టింది. అరుస్తూ కాలనీ అంతా పరుగెత్తింది. చూసిన వాళ్ళెవరూ 'ఎందుకిట్లా అమ్మాయిని హింసిస్తారు?' అనడిగిన దిక్కు లేదు. ఏవన్నా అంటే, తాము చిన్న ఉద్యోగులు, తను మైనింగ్ ఇంజనీర్. కంప్లయింట్ చేసి, ఎక్కడ ఉద్యోగం పీకేయిస్తాడోనని భయపడేవాళ్ళు, కాలనీలో తమ పరువు పోతుందని భర్త రాగానే చెప్పింది. నోట్లో గుడ్డలు పెట్టి తలుపులేసి బెల్టుతో బాదాడు. దెబ్బలు తింటూ, విలవిలా కొట్టుకుని మూర్ఛపోయింది. కాసేపటి తరువాత నోట్లో గుడ్డలు తీసి, నీళ్ళు చల్లి చూశారు. మేరీ కదిలింది. ప్రాణం పోలేదు. "నన్ను చంపకండి... నన్ను జంపకండి... నేనింటికెళ్ళిపోతా... నన్ను వదిలిపెట్టండి" గజగజా వణుకుతూ చేతులు జోడించి అర్థించింది. యిప్పుడెల్లి దెబ్బలు చూపిస్తే, తమకు మాటొస్తదని యిప్పుడెక్కడ? క్రిస్మస్ పండగకు వెళుదువుగాని... కొత్త బట్టలు పట్టిస్తం... ఆగు' అంది సింధూర. యింటికాడి పరిస్థితి తలచుకుని, మళ్ళీ బానిసలా చాకిరీకి ఒంగింది.

జత కొత్త బట్టలు కుట్టిచ్చి, క్రిస్మస్ రెండు రోజులుందనగా, దయతో యాభై రూపాయలు ఛార్జికిచ్చి పంపించేశారు. వెళ్ళే ముందు 'కొట్టిన సంగతి యింటికాడ చెప్పావో ప్రాణం తీస్తా, అని బెదిరించింది సింధూర.

"చెప్పనీరాదె. భయమైతుందా? వాడిప్పటికే నా దగ్గర డబ్బులు తీసుకుని, వాడుకుండు. అవి కట్టి దీన్ని దీసకపోతడు.

డబ్బులియ్యకుంటే, వాడి యిల్లు వేలమేసి, రాబట్టుకుంట. మాల నా కొడుకుని వదిలి పెడతనా?' అన్నాడు గుర్రురుముతూ.

యింటికెళ్ళిన మేరి, తండ్రిని తమ్ముళ్ళని చూసుకుని బావురుమని ఏడ్చింది. "యిగ నేను వెళ్ళనయ్యా, వాళ్ళు కొట్టి సంపుతుంరు" అంది తండ్రి కాళ్ళను చుట్టేసి.

ఏసోబు కళ్ళలో నీళ్ళు తిరిగాయి. "ఎట్ల బిడ్డ అట్లంటే. యింట్లెల్లక మొన్ననే డబ్బులడక్కొచ్చుకుంటివి. ఈ ఒక్క ఆర్నెలు జెయ్యి. బాకి తీరిపోద్ది. అపుడు యింటికొద్దువుగని, నోరెమ్మెంబడి నాల్లకు బోదువుగాని" అన్నాడు బ్రతిమాలుతూ.

"ఆఁ... బుదగరించు బిడ్డని. తీసుకున్న డబ్బులకి జీతం జెయ్యకుంటే పెళ్ళాన్ని వేలమేస్తడు. బిడ్డ జెయ్యకుంటే, తండ్రి జెయ్యాలె జీతం. దొరలు ఊరికేనే వదిలిపెట్టరు." కోపంతో పెళపెళలాడింది కమలమ్మ మాటలు.

"అదే సెబుతున్న లేవే" అని పక్కకు తీసుకుపోయి, "మడిసివి జూడు ఎంత నున్నగ తయారైనవో, రంగు కూడ వచ్చింది తల్లి. పోరగాల్లు నిన్ను జూడంగనే సేసుకుంటరు. మా తల్లి గదూ. ఒక్క ఆర్నెల్లు ఓపికపట్టు. నేనే వచ్చి తీసుకొస్త" అన్నాడు నచ్చచెబుతూ.



తండ్రి బాధ అర్థం చేసుకున్నట్లు మౌనం దాల్చింది.

క్రిస్మస్ వెళ్ళిన రెండో నాడే వధశాలకు వెళ్తున్నట్లు తండ్రి వెంట బయలుదేరింది. హోటల్‌లో అన్నం తిని వెళ్ళమని యాభై రూపాయలు ఏసోబు చేతిలో పెట్టింది. వెళ్ళే ముందు చెప్పలేక చెప్పాడు. "తల్లి లేని పిల్ల. పసిప్రాణం. కొట్టకండమ్మా అని.. "మేమెందుకు కొడతాం. అది బుద్ధిలేని పనులు చేస్తేనే కొడతం. తప్పు చేస్తే మా పిల్లల్ని మాత్రం కొట్టుకోమా. నీకంత ప్రేమగారిపోతే, మా డబ్బులు మా మొఖాన గొట్టి నీ బిడ్డను నువ్వు తీసుకపో" అని పెట పెటలాడించింది మాటలు. "మంచి గుండమ్మో" అని గుడ్లనీరు కక్కుకుంటూ బరువెక్కిన గుండెతో వెళ్ళిపోయాడు తండ్రి.

అప్పటి నుండి మేరి మనసులో భయం గూడు కట్టుకుంది. 'మీ నాన్నకు చెప్పొద్దంటే ఎందుకు చెప్పావే?' అని ఎప్పుడు కొడతారోనని బిక్కు బిక్కుమంటూ గడపసాగింది. చినిగిన చాపపైన, కుక్క పక్కనే పడుకునేది. కాని నిద్రపట్టేది కాదు. కట్టేసి కొడుతున్నట్లు. భార్యాభర్తలు, పిల్లలు కలిసి తనను గట్టిగా పట్టుకుని, కాగే నూనెలో వేస్తున్నట్లూ కలలొచ్చేవి. ఉలిక్కిపడి లేచేది. తల్లిని తలుచుకుని ఏడ్చేది. "అమ్మగారు, అయ్యగారు కొట్టకుండా చూడు ప్రభూ" అని ప్రార్థన చేసుకుని, శిలువను కళ్ళకద్దుకుని, గుండెల మీద పెట్టుకుని కళ్ళు మూసుకునేది. ఎప్పటికో నిద్రపట్టేది.

నాల్రోజులు గడిచిందో లేదో ఆ రోజు రానే వచ్చింది. "మమ్మీ మా మేడం ఇంకు అంటిన చొక్కాలు కాకుండా, తెల్లటివి వేసుక రమ్మంది" అన్నాడు బాబు జేబుకున్న సిరా మరక చూపించి.

"కొత్త చొక్కానే నాన్న. ఆ ముండ సరిగా ఉతకడం లేదు. దానికి బాగా పొగరెక్కింది. వాళ్ళ యింటి కాడ చెప్పిందట మనం కొడ్తున్నామని. ఉండు దాని పని చెబ్తా" అంది అట్లకాడ వేడిచేస్తూ.

"నేనే, దాని పని చెబ్తా" అని ఉత్సాహంగా వెలుపలికి పరుగెత్తాడు.

మేరీ గోడ వైపు తిరిగి, కూనిరాగం తీస్తూ అంట్లు రుద్దుతోంది.

రానైతే వచ్చాడు కాని కొట్టడానికి ఏవీ కనిపించలేదు. పక్కన రుబ్బు రాయి కనబడ్డంతో, దాన్ని రెండు చేతులతో ఎత్తి మేరీ తలపై వేశాడు.

హఠాత్తుగా తలపై బరువు పడటంతో కెవ్వున కేకేసింది. ఓ క్షణం ఏం జరిగిందో అర్థం కాలేదు. తల పగిలి రక్తం ముఖం మీదకు దారకట్టింది. రక్తాన్ని చూసుకుని బేర్‌మంది. దుఃఖం, భయం, కోపం, నిస్సహాయతల మధ్య "అమ్మగారూ! బాబు నా తల పగలగొట్టాడు రాయితో" అంది కారే రక్తాన్ని చేతితో అదిమిపెట్టి.

"నీకు అలాగే శాస్తి జరగాలే. మేము కొట్టామని చెప్పి ఊరంతా మా పరువు తీస్తావా? వస్తున్నా ఆగు. అట్లకాడ తెస్తున్న" అంది స్టౌ మీద అట్లకాడను గుడ్డతో పట్టుకుని గునగునా వస్తూ.

మేరి ప్రాణభయంతో కేకేసింది. "అమ్మో..." అని, అట్లకాడతో వీపు మీద వాత పెడితే ఆ బాధ వర్ణించనలవిగాదు. గాయం తొందరగా మానదు. పడుకుంటే నొప్పి. పనిచేస్తున్నా నొప్పే. "నన్ను చంపకండి అమ్మగారో...!" అంటూ కాలిసత్తువ కొద్దీ పరుగెత్తింది. క్వార్టర్స్ పెద్ద గేటు గుండా పరుగెత్తి, ఎదురుగా వున్న ముళ్ళ కంచె మీంచి, అమాంతం పత్తి చేలోకి దూకి ముందుకు పరుగెత్తింది. కళ్ళలోకి కారుతున్న రక్తాన్ని తుడ్చుకుంటూ, ఫ్యాక్టరీ లైట్ల వెలుతురు పడనంత దూరం మొండిగా ముందు కొరికింది. పరుగెత్తి... పరుగెత్తి ఆయాసంతో ఆగిపోయింది. చిమ్మ చీకటి. చెట్లు తప్ప, నేల కనిపించడం లేదు. 'ఏం చేయాలి? ఎక్కడి కెళ్ళాలి?... యింటికే వెళ్ళిపోవాలి. తనకు తెలిసిన వాళ్ళు ఒక్కళ్ళూ ఊళ్ళోలేరాయె. ఛార్జికి డబ్బులెట్లా?... 'అయ్యగారు రాగానే చెప్పి, అమ్మగారు తనకోసం పంపుతుందేమో పట్టకరమ్మని!... అసలే చీకట్లో బస్టాండ్ వైపు పోయేదెట్లా? దారెటు వుంది?' ఎటూ పాలుపోక, అక్కడే కూలబడి, తల్లిని, తండ్రిని తలుచుకుంటూ చాలాసేపు ఏడ్చింది. ఏడ్చీ.. ఏడ్చీ... అలాగే నేల మీద ఒరిగింది.

* * *

పత్తి చేలోంచి రోడ్డెక్కింది మేరీ. 'ఎవరికి చెప్పుకోవాలి తన బాధ? ఎటువెళ్ళాలి?' దిక్కులు చూస్తూ, వెళ్ళసాగింది. కడుపులో ఆకలి, రాత్రి అన్నం లేదు. అందరూ తిన్నాక కదా తను తినేది. ఈలోపే యిది జరిగి పోయింది. కూర్చుని ఉండటంతో రాయి దొల్లి పడింది. తను పడుకున్నాక తలపై ఎత్తేసి ఉంటే, తల రెండు ముక్కలుగా పగిలిపోయుండేది. ఇప్పటికే నాన్న వాళ్ళు చేరుకుని, ఏడుస్తూ ఉండేవాళ్ళు. అక్కడే ఎక్కడో తనను బొంద పెట్టేసి వెళ్ళిపోయేవాళ్ళు. మనసులో దుఃఖం సుళ్ళు తిరుగుతుండగా, ఆలోచిస్తూ నిర్వేదంగా వెళ్ళసాగింది.

మండల ఆఫీసు పక్కన టీకొట్టు పెట్టిన లాల్‌బీ అమ్మాయిని ఎగాదిగా చూసి "ఎటు పోవాలమ్మాయ్?" అనడిగింది.

మృదువైన ఆ పిలుపుకి గడ్డ కట్టిన దుఃఖం భళ్ళున బద్దలైంది. నిలబడిపోయి భోరున ఏడుస్తూ, "మా ఊరు వెళ్ళాలి" అంది.

"యిట్రా... యిట్రా...! ఏ ఊరు మీది?" అంది దగ్గరికి పిలుస్తూ.

ఏడుస్తూ, మొక్కుతూ తన గురించి పూర్తిగా చెప్పింది మేరీ. లాల్‌బీకి జాలేసింది. మంచి నీళ్ళిచ్చి, టీ పోసింది. యింట్లో పసుపు తెచ్చి, తలమీద అద్దింది. బాలల్ని పనిలో పెట్టుకోవడం తప్పు అటువంటి నేరానికి శిక్ష కూడా పడుతుంది అని ఆఫీసర్లు మీటింగ్‌ల

పెట్టి చెప్పడం, స్కూలు పిల్లల్తో ఊరేగింపులు తీయించడం తాను అనేకసార్లు చూసింది.

"ఎండిఓ లోపలుంది వెళ్ళి చెప్పు. ఏం గాదు. లక్ష్మీకొడుకుని బొక్కలేస్తరు. నిన్ను యింటికి బంపిస్తరు అని ధైర్యం చెప్పింది లాల్‌బీ.

గేటు దాటి వెళ్ళింది మెల్లిగా. అప్పటికి జన్మభూమి కార్యక్రమం ముగిసి రెండ్రోజులే అయింది. వాటి బాపతు రిపోర్టులు తయారుచేస్తూ కూర్చుంది నాగరాణి.

"సురేష్ వాళ్ళబ్బాయి తల పగలగొట్టాడండీ" అంది రాసుకుంటున్న ఎండిఓ ముందు చేతులు కట్టుకుని నిలబడి.

తలపైకెత్తి చూసి ఆశ్చర్యపోయింది. కుర్తా, పైజమా రక్తం మరకలతో వున్నాయి. దుమ్ము కొట్టుకుని, రక్తంతో జుట్టు అంటుకుని పోయింది. కళ్ళలో బెదురు, భయం... ఏం సురేష్?" అడిగింది.

"ఆ ఫ్యాక్టరీలో మైనింగ్ ఇంజనీరండీ" చెప్పింది మేరీ.

ఎండిఓ కూడా దళితురాలే. ఆమె మాటను ఎక్కడ సాగనివ్వరు. తానే నిర్ణయం తీసుకున్నా, దాన్ని కాదని నోడల్ ఆఫీసర్ తీసుకున్న నిర్ణయాన్నే ఫైనల్ చేస్తాడు. ఎంపిపి, ఎన్డీఓ ఒకే కులం కావడంతో ఒక్క మాట మీదుంటారు. కాస్త ఆలోచించి, అక్కడో ఆఫీసరంటాడు. వెళ్ళి చెప్పమ్మా, ఏం గాదు" అంది బాధగా తలవంచుకుంటూ.



యాభయ్యేళ్ళు పై బడ్డ వ్యక్తి, గడ్డంతో, బట్టతలతో కనిపించాడు పేపర్ చదువుతూ. రాత్రి సారు కొడుకు నా తల పగలగొట్టాడు సార్. నన్ను మా యింటికి పంపించండి సార్. ఇక్కడుంటే పట్టుకుని చంపేస్తారు సార్" అంది ఏడుస్తూ.

పేపర్ పక్కన బెట్టి ధైర్యం చెబుతూ, మెల్లిగా అన్ని విషయాలూ తెలుసుకున్నాడు జయవర్ధన్‌రెడ్డి. నీకేం భయంలేదు. నిన్ను మీ యింటికే పంపుతా. ఆ ఫ్యాక్టరీ వైపు పంపను" అని భరోసా యిచ్చి, కేసు ఫైల్ చేయమని, అటెండర్నిచ్చి పోలీస్ స్టేషన్‌కు పంపాడు. వాళ్ళు చెప్పింది విని, అలాగే యిద్దర్నీ స్టేషన్లో కూర్చోబెట్టి, మోటార్ సైకిల్ మీద నోడలాఫీసర్ దగ్గరి కొచ్చాడు ఎస్ఐ నారాయణరెడ్డి. కులమొక్కటై ఉండాలే గాని, యిట్టే సన్నిహితులైపోతారు. ఎస్ఐగా స్టేషన్ ఛార్జి తీసుకున్న రోజే, మండలంలో వున్న రెడ్డి ఆఫీసర్లని, రెడ్డి నాయకులని కలిసి, మందు పార్టీ యిచ్చాడు నారాయణరెడ్డి. నోడలాఫీసరులో దూరపు బంధుత్వం కూడా ఉన్నట్లు వరసలు కలిపాడు. ఇద్దరూ వారానికొక్కసారన్నా కలిసి, సిట్టింగులు వేస్తుంటారు.

ఎస్.ఐ. నేరుగా ఎన్.ఓ. దగ్గరకెళ్ళి "మనం కేసు ఫైల్ చేయడం చాలా తేలిక సార్. వాణ్ణిప్పుడే తెచ్చి సెల్లో వేయగల్ను. కాని మనకూ లాభముండదు. వాళ్ళకూ ప్రయోజనముండదు. కోర్టుకు పంపితే అయిదో, పదో ఫైనేసి వదిలి పెడతారు. అది లెంటీ ప్రాసెస్. ఈలోపు దొరగారే డబ్బులిచ్చి మేనేజ్ చేస్తే, కేసు కొట్టేసినా ఆశ్చర్యం లేదు. నేను ఫూల్‌ని కావాల్సొంటుంది. ఈ మాల ముండా కొడుకులు కూడా. చివరి దాకా నిలబడరు. వాళ్ళ కేస్ట్ లీడర్లొచ్చి, ఎంతో కొంత యిప్పించి రాజీ పెట్టిస్తారు. యిలాంటి వెన్నో చూసి, చూసీ ఉన్నాం సార్, అందుకే అలాకాక, యిలా చేస్తే ఉభయతారకంగా ఉంటుంది" అని వంగి మెల్లిగా చెప్పాడు.

"బావుంది. అలాగే చేద్దాం కాని..." అని గ్రీన్ సిగ్నల్ యిచ్చాడు ఎన్.ఒ.

వెంటనే కానిస్టేబుల్‌నిచ్చి, సురేష్‌ని పిలుచుకుని రమ్మని ఫ్యాక్టరీకి పంపాడు.

పోలీసు రావడంతో భయమేసి, మరో ఫ్రెండ్‌ను వెంట బెట్టుకుని బండి మీద వచ్చాడు. అతనొచ్చేలోగానే మరో కానిస్టేబుల్‌నిచ్చి, అమ్మాయిని డాక్టర్ వద్దకు పంపి, మెడికల్ రిపోర్టులు తెమ్మని, అలాగే దుస్తులు పేక్ చేసి, స్నానం చేయించి, అన్నం పెట్టి తీసుకురమ్మని పంపాడు. మనసులో ఆందోళన కనబడకుండా, ఎన్.ఒ. రూం దగ్గరికొచ్చి, చెప్పులు విడిచి లోపలికెళ్ళి రెండు చేతులు జోడించి, యిద్దరికీ అతి వినయంగా నమస్కారం పెట్టాడు సురేష్.

"ఏంరా! నువ్వే నారా సురేశంటే?" అన్నాడు ఎస్ఐ

ఆ పిలుపుకే సగం కుదేలైపోయాడు. అవునన్నట్లు తల ఊపాడు.

"ఏంరా? నీ పెళ్ళావేవన్నా కరాటే ఫైటరా? అంత చిన్నమ్మాయిని చీటికి మాటికి కొట్టుద్దట. గంటె గాల్చి వాతలు పెట్టుద్దట. వంటి మీద గాయాల గుర్తులూ, కాల్చిన మచ్చలూ ఉన్నాయి సాక్షానికి. నెత్తిమీద ఎంత పెద్ద దెబ్బ తగిలిందో చూసినవా? అనుకుంటుందేమో... స్టేషన్‌కు బిలిపిచ్చి, సెల్‌లేసి, బట్టలూడదీయించి బాదిస్తా. నా సంగతి తెలివదు. వరంగల్‌ల చేసొచ్చినోడ్ని" నిప్పులు కక్కాడు ఎస్ఐ.

"చిన్న పిల్లవాడు సార్. తెలిక కొట్టాడు" అన్నాడు. చెమటలు తుడుచుకుంటూ బలవంతంగా గొంతు పెగుల్చుకుని.

"అంత రౌడీ నా కొడుకుని ఎట్లగన్నవ్‌రా? క్రికెట్ బేట్‌తో గూడా రోజూ కొడ్తడంట గదరా. నేను కొట్టి చూద్నా మీ పోరగాడికి దెబ్బ తగులుద్దో లేదో? నువ్వు కూడా బెల్టుతో బాత్తవట గదరా. యిలాంటి వాడివి గాబట్టే. అలాంటి కేడి నా కొడుకు పుట్టిండు. ఎస్‌సి లంటే ఏమనుకున్నవ్‌రా? వాళ్ళు దళితులురా. కాయకష్టం చేసి, మనల్ని సుఖపెట్టేటోళ్ళురా. ఎస్.సి. ఎట్రాసిటీ కేసు పెడితే కొడకా, ఆర్నెల్లదాకా బెయిలు దొరకదు. జైల్ల చిప్పకూడు దినాలె... గుడ్లురుమి చూస్తూ దాగులేశాడు.

గోడ పక్కన నిలబడి వింటున్న అటెండర్ ఆదాము. ఎస్ఐ నిప్పురా. బీదల పాలిట దేవుడు. యిలాంటోళ్ళుండబట్టే, మా మాల మాదుగులేమాత్రమన్నా బతుకుతుంరు" అనుకుని మనసులోనే దండం పెట్టుకున్నాడు.

ఎస్సై దాగులకు ఇంజనీరుకు ఉచ్చబడ్డంత పనైంది. కాళ్ళు, చేతులు చల్లబడ్డాయి. నోట్లో తడారిపోయింది. ఒళ్ళంతా చెమటలు కమ్మాయి. గొంతు పెగుల్చుకుని, "దయుంచండి సార్. తప్పు జరిగి పోయింది. మీరే నన్నీ ఆపద నుండీ గట్టెక్కియ్యాలి. మీరెలా చెబితే అలా వినుకుంటా" అన్నాడు సరెండరైపోతూ.

బాలికలను పనిలో పెట్టుకున్న కేసు, గతంలో అనేకసార్లు అమ్మాయిని కొట్టి గాయపరిచిన కేసు, రాత్రి చంపబోయిన కేసు అంటే అటెంప్ టు మర్డర్ మొత్తం నాలుగు సెక్షన్ల కింద, మీమీద కేసు ఫైల్ చేయాల్సొంటుంది. యాభైవేల వరకు జరిమానా, ఆరేండ్లకు తక్కువగాకుండా జైలు శిక్ష పడొచ్చు. కానీ మీరు కూడా మాలాగే బాధ్యత గల ఉద్యోగస్తులనీ, ఎందుకైనా మంచిది ఒకసారి చెబుదామని పిలిపించాం" అన్నాడు నోడల్ ఆఫీసర్ తోక కోసి, వెన్నరాస్తూ.

"క్షమించండి సార్. మేమెప్పుడూ కేసులకు పోయినోళ్ళము కాదు. ఎలాగైనా మీరే ఈ ఆపద నుండి గట్టెక్కియ్యాల్సార్" చావు ముఖం పెట్టి చేతులు పట్టుకున్నాడు.

"అమ్మ యింటికి కబురు పోయింది. వాళ్ళు రానీ, వినకుంటే కేసు ఫైలు చేయాల్సిందే" కాస్త దిగుతూనే కఠినంగా అన్నాడు.

"దయుంచండి సార్. వాళ్ళను మేమెలాగైనా ఒప్పిస్తాం. కేసు ఫైలు కాకుండా మీరు దయతలిస్తే చాలు" అవి పేంటు జేబులో పెట్టుకొచ్చిన పది వేల రూపాయల కట్ట ఎస్ఐ చేతిలో పెట్టబోయాడు.

"ఎట్ల కనబడుతున్నంరా నీకు? డబ్బులు తీసుకుని కేసు మాఫీ చేసే వాడ్ననుకుంటున్నవా? ఉద్యోగాలు ఊడతాయి కొడకా. అసలే ఎస్సి ఎట్రాసిటీ కేసు" అన్నాడు లేచి వెలుపలికి వస్తూ.

గోడ పక్కనున్న ఆదాము కాళ్ళ మీద పడబోయి ఆగి, రెండు చేతులూ జోడించాడు ఎస్ఐకి. ఆ క్షణంలో అతనిలో దేవుడ్ని చూశాడు.

ఎస్ఐ డబ్బులు ముట్టకపోవడంతో సురేశ్‌కు భయం ఎక్కువైంది. నోడలాఫీసర్ చేతులు పట్టుకుని, కంట నీరు పెడుతూ, "ఎలాగైనా మీరే నన్నీ ఆపద నుండి బైటపడేయ్యాల్సార్" అన్నాడు.

"నేను నచ్చచెబుతాలే ఎస్ఐకి, వాళ్ళ కానిస్టేబుల్‌తో మాట్లాడి" అని ధైర్యం చెప్పి పంపించాడు.

చెట్టుకింద సిగరెట్ తాగుతూ, మెడికల్ రిపోర్టులో వున్న ఎఎస్ఐ దగ్గరకు మిత్రుడితో కలసి వెళ్ళి రెండు చేతులూ పట్టుకున్నాడు. కేసు కాకుండా చూడండి సార్, మీ సాయం కూడా ఉంచుకోను. ఎస్ఐ గారిని ఒప్పించి, కేసు మాఫీ చేయించండి" అని రెండు వేలు చేతిలో పెట్టాడు పక్కకు తీసుకుపోయి.



"బాల కార్మికుల కేసు సార్. కలెక్టర్‌గారు చాలా సీరియస్‌గా ఉన్నాడు. ఊరికే జీతముంచుకున్నా, కేసు పెట్టమంటుండు. మీరు కొట్టినట్లు రిపోర్టులు కూడా ఉన్నాయి" అన్నాడు కాగితాలు ఊపుతూ".... అయినా నేనొప్పిస్తాను. కాని ఖర్చు కాస్త ఎక్కువవుద్ది" అన్నాడు డబ్బులు పేంటు జేబులో పెట్టుకుంటూ.

"ఖర్చు దేవుంది సార్, యిద్దాం. మా గురించి మీకంతా తెలుసు. ఎప్పుడూ పోలీసులతో కూడా మాట్లాడి ఎరగనోళ్ళం. మా గ్రహచారం కొద్దీ యిదంతా జరిగింది" అన్నాడు పక్కనొచ్చిన శేషుబాబు.

యింతలో మేరీని వెంటబెట్టుకుని, పేక్ చేసిన బట్టలతో వచ్చాడు కానిస్టేబుల్ శంకర్‌రెడ్డి.

ఆ వెనకాలే ఏసోబును వెంటబెట్టుకుని చిన్న చౌదరిగారొచ్చారు. వచ్చేప్పుడే బ్రాంది బిర్రుగా పోయించి మంచి చేసుకున్నాడు. "మీరు చెప్పినట్లే వింటా. అమ్మాయిని కూడా ఒప్పిస్తా" అని మాటిచ్చాడు. పిల్లల మీద ప్రమాణం చేయించుకున్నాడు నమ్మలేక.

కేసు సెటిల్ చేయడానికి యాభైవేలిమ్మన్నాడు ఎఎస్ఐ సలీంఖాన్. బ్రతిమాలి, బామాలి ముప్పైవేలకు బేరం సెటిల్ చేసుకుని, ఇరవై వేలు వెంటనే యిచ్చేశాడు సురేశ్. ఎస్ఐ., ఎన్ఓ పిలిచి అడిగితే ఏం చెప్పాలో అమ్మాయి తండ్రికి వివరించాడు ఎఎస్ఐ.

ఫోన్ మోగడంతో ఎస్ఐ, ఎన్ఓ దగ్గరికి వచ్చాడు. ఎంపిపి, ఎంపిడిఓ కూడా కూర్చున్నారు. కాని వారేమీ మాట్లాడలేదు. ఏసోబుని, మేరీని, అటు సురేశ్‌ని మాత్రమే తీసుకుని ఎఎస్ఐ గదిలోకి వచ్చాడు.

అందరికీ దండం పెట్టాడు ఏసోబు. అతన్ని చూడగానే, ఎత్తుపడ్డ గొడ్డులా అనిపించాడు. కుల నాయకుల్ని వెంట బెట్టుకుని రాకుండా, ఒంటరిగా వచ్చినందుకు రిలాక్స్‌గా ఫీలయ్యాడు ఎస్ఐ భయం భయంగా ఒదిగి నిలబడ్డాడు ఏసోబు.

"రాత్రి జరిగిన సంగతంతా తెలుసుగా. ఏం చేద్దామంటావు? ఆ... చెప్పు కేసు పెడితే ఓ మూడేళ్ళు అమ్మాయితో కలిసి కోర్టు చుట్టూ తిరగాల్సుంటుంది. కింది కోర్టులో శిక్ష పడ్డా పై కోర్టు కెళతాడు. డబ్బున్న మనిషి. కేసు పెడతానంటావా... నీ యిష్టం" అన్నాడు ఎస్ఐ. పెడితే నీ తాడు తెగుద్ది అని అంతర్లీనంగా బెదిరిస్తూ.

"కడుపుల పేగులు లేనోళ్ళం. కేసు లెందుకయ్యా మాకు. మా గాచారం కొద్దీ జరిగిందనుకుంటం. ధర్మ పెబువులు. మీరు ఎట్ల చెబితే, అట్లనే యినుకుంటం" అన్నాడు చేతులు జోడించి, ఆయాసపడుతూ.

"ఈయన వద్ద నువ్వు తీసుకున్న రెండు వేలు మాఫ్. అమ్మాయిని కొట్టినందుకు నీకే ఓ నాలుగువేలు యిమ్మని చెబుతున్నం. పెళ్ళి కావలసిన పిల్ల. రేపు ఖర్చులకు పనికొస్తయి" అన్నాడు ధర్మదాతలా జయవర్ధన్‌రెడ్డి.

ఒక్క నిమిషమాగి, "ఐదువేలిప్పించండయ్యా. తల్లిలేని పిల్ల... మీ పేరు చెప్పుకుని, పెండ్లి చేస్తా" అని దీనంగా వేడుకున్నాడు.

"సరే! నువ్వడిగినట్లే యిస్తడు గానీ, ఎక్కడ కేసు పెట్టననీ, ఈ దెబ్బలతో సురేశ్‌గారికి ఎటువంటి సంబంధం లేదని, కాగితం రాశాడు సంతకం పెట్టు" అన్నాడు ఎన్.ఓ.

చేతులు వణుకుతుండగా, ఎడమ చేతి వేలిముద్ర అద్దాడు ఏసోబు. సురేశ్ ఐదువేలు ఏసోబు చేతిలో పెట్టాడు. అందరికీ మరోసారి దండం పెట్టి, "వస్తనయ్యా" అన్చెప్పాడు. తలవొంచుకుని, అమ్మాయిని వెంటబెట్టుకుని, బస్‌స్టాండ్ వైపు కదిలాడు.

కేసునంతా చక్కబెట్టి, వ్యవహారం నడిపించిన ఎఎస్ఐకు ఒప్పందం ప్రకారం పదివేలు అప్పగించాడు.

"విషయం విలేకరులకు తెలిసిపోయింది. యిందాక ఫోన్ చేశారట సారుకు. ఏం లేదు, పెటీ కేసని చెప్పాడట. అయినా వాళ్ళు నమ్మేట్టు లేదు. ఇన్వెస్టిగేషన్ చేసి, రాస్తామంటున్నారు. పేపర్లో పడితే, కలెక్టర్ దృష్టికి పోద్ది. ఎస్సి సంఘాలు, మహిళా సంఘాలు రంగంలో కొస్తాయి. అప్పుడు మిమ్మల్ని అరెస్టు చేయాల్సుంటుంది. వాళ్ళు రాయకుండా ఉండాలంటే, రాత్రికి సిట్టింగ్ వేయించాలె. కనీసం మూడువేలన్నా అవుద్ది' అన్నాడు సలీంఖాన్.

ఒంట్లో చేవంతా చచ్చినట్లున్న సురేశ్ వెయ్యి రూపాయలు చేతిలో పెట్టి "నన్నిక వదిలేయండి సార్" అన్నాడు చేతులు జోడించి.

"నాకేం వద్దు, వాళ్ళు మిమ్మల్నొచ్చి అడుగుతారు. అప్పుడు ఏం సమాధానం చెబుతారో చెప్పుకోండి" అన్నాడు విసురుగా వెళ్ళి బండి స్టార్ట్ చేస్తూ.

"యింత మునిగాం. ఈ కాస్త కాదెందుకురా. మన జాస్తోళ్ళకు పుట్టుంటరు. అందుకే మన డబ్బు పంచుకుంటున్నారు. యిచ్చెయ్‌రా" అన్నాడు కొడుక్కు మాత్రమే వినబడేటట్లు తండ్రి.

మూడువేలు చేతిలో పెట్టి "యింక మేం వెళ్ళొచ్చా సార్?" అన్నాడు కాస్త వ్యంగ్యంగా.

"నేను ఎస్సైతో చెబుతా వెళ్ళండి. వాళ్ళకు సిట్టింగ్ అరేంజ్ చేయాలి" అని బండి స్టార్ట్ చేసుకుని పోలీస్ స్టేషన్ వైపు వెళ్ళాడు సలీంఖాన్.

పులులు మెల్లగా విందుకు లేచాయి.

## అక్షరాన్ని చెక్కడంలో



**సైదులు ఐనాల**

'ప్రతిభ'
మరోసారి తెర మీద కొచ్చింది
రోడ్లు ఊడ్చుడాలు
బస్సుద్దాలు తుడ్వడాలు
మురికి కాల్వలు కడగడాలు
మరోమారు టీవిల్లో
'విచిత్ర వేషధారణ' పోటీలుగా
ఒకళ్ళెంట ఒకళ్ళు కన్పిస్తున్నారు
వ్యక్తులు వేరు కావచ్చు
కాని దృశ్యాలవే
సమయ, సందర్భాలు వేరు కాని
చెప్పే సాకులు మాత్రం అవే
ఇంతకీ ప్రతిభ అంటే ?
మట్టిని ముద్ద చేసి
కుండగా మల్చటం కాదట
సుతారంగా ఒలిచిన జంతు చర్మం
సజీవ పాదాన్ని పరుచుకోవడమూ కాదట

మగ్గం గుంటలో
ఊపిర్లూదిన అద్దకం పెట్టి
ఒంటిపై రంగులద్దడం కానే కాదట
నాలుగ్గోడల ఇరుకు సందుల్లో
అమాంతం పుస్తకాల్లో దిగబడి
పేరాలకు పేరాల్ని మింగి
పట్టాల్ని వాంతి చేస్కోవడమట
చదువు కోవడం స్థానే
చదువు కొనడం వచ్చినప్పుడు లేని
ఈ ఆందోళన ఎవరికోసం?
చదువు మార్కెట్ సరుకై
కేజీల్లో లీకేజవుతుంటే

ఈ సుద్దావతారుల మౌనాన్ని
ఏమనుకోవాలి!
అలగా జనాన్ని దబాయించి
ప్రతిభ చాటున
ఏళ్ళ తరబడి జుర్రుకున్న
అవకాశాల అసమానత్వాన్ని
నిలదీయాల్సిందే
ఎనకబడ్డోనికి ఊతాన్నందించడంలో లేని
సామాజిక న్యాయం
డబ్బు చుట్టూ తిరిగే
వేలం వెర్రి చదువుల్లో ఉందేమో!
ఓ నా 'ప్రతిభా'వంతుల్లారా రండి
కష్టాల్ని ఇష్టంగా పంచుకొని
కన్నీళ్ళను పోగేసుకోండి
తడిసి ముద్దవ్వండి
ఇక అప్పుడు తెలుస్తుంది
అక్షరాన్ని చెక్కడంలో
అనితర నేర్పెవ్వరిదో!

---



## నాలో సగం

**పి.ఆర్.ఎల్. స్వామి**

నా కష్టాల్లో
కన్నీళ్ళు దరికి రాకుండా
తన చేపపిల్ల కళ్ళ రెప్పలతో కాపలా కాసి
రెండు చేతులతో ఓ కాపు కాసి
ఓదార్పు మంత్రం పఠించి
కొండంత ధైర్యాన్నిచ్చే అండ

నాలోలో నుంచి తొంగి చూసే
అహంకారపు తూటాని తునాతునాకలు చేసి
ప్రేమ బిందువుల్లాంటి
మంచి మాటల ముత్యాల్ని
నా మెడలో హారంగా వేసి
ముందుకు నడిపించే మార్గదర్శి
నా కవితల కత్తిరింపులతో
సాహితీ వెన్నెల పరిచి

సీతాకోకలా ఎగిరి
కవిత్వాక్షరాలను పలకరించి
నా మెదడు పొరలకు అతికించి
సమాజంలోకి చొచ్చుకుపోయేదే
ఉత్తమ కవిత్వమంటూ
నన్ను 'ధారణ'తో పరుగెత్తించే
సంసార రథ చక్రం
పని ఒత్తిడిలో
నాచే అర్ధాంతరంగా సృష్టింపబడిన

టీ కప్పులో తుఫాను పై
నీళ్ళు చిలకరిస్తుంది
అంతే......
నేను మంచు కొండలా కరిగిపోతాను

మబ్బులు తొడుక్కున్న ఆకాశంలా
నాపై కురిపిస్తున్న ప్రేమతో తడుస్తూ నేను
మా ముంగిట పండేవి
అనుభూతుల పంటలు

మమకారం పంచి
పూట పూటా
జీవశక్తి ముద్దలు తినిపించే ఆమె
మా అబ్బాయికీ
నాకూ
తల్లే

---

## తిమిరం

**బొమ్మరాత యల్లయ్య**

అడవి తల్లి నుదుటన
అందంగా దిద్దిన బొట్టు
విరబూసిన మోదుగ చెట్టు

వసుధ నిండా సుమవర్షం
వనజవ్వని పలుకుతోంది
వసంతునికి స్వాగతం

చెట్టేమి చేసేనో పుణ్యం
సంవత్సరాని కోసారైనా
పలకరించును వసంతం

నింగిని నిప్పుల గుండం చేసి
నిర్దయగా మండుతున్నాడు
మధ్యందిన మార్తాండుడు

మండే ఎండలను మరిపిస్తాయి
మంచు పూలను తలపిస్తాయి
గ్రీష్మంలో మల్లెలు

ఆదరణ కొడిగట్టి
ఆరుతున్న వత్తులు
గ్రామీణ వృత్తులు

అసహ్యపు హాస్యంతో
అంగాంగ ప్రదర్శనతో
వెలుగుతోంది వెండి తెర

వెలుగులు చిమ్ముతుంది దీపం
చమురెప్పుడైపోతుందా! అని
ఓర్పుగా చూస్తుంది తిమిరం

తల్లిదండ్రుల కోసం
తనయుల తర్జన భర్జన
'ఓల్డేజి హోం' ఏదైతే మంచిదని

కవి నిరంతరం
పోగేసుకునే ఆస్తులు
ప్రోదిచేసుకునే పుస్తకాలు

# దత్తత



## ఎస్.డి.వి. అజీజ్

"ఒరేయ్ నర్సిగా!"

పశువులకు తాగించడానికి కుడితిలో వరిపొట్టు కలుపుతోన్న నర్సయ్య, ఆ పిలుపు విని పశువుల కొట్టంలో నుంచే పెద్దిరెడ్డి వంక చూశాడు. పెద్దిరెడ్డి పశువుల కొట్టానికి దగ్గర్లోనే వాలు కుర్చీ వేయించుకొని దానిపై తాపీగా పడుకొని సిగరెట్ కాలుస్తూ వున్నాడు.

మరోమారు పిలిచాడు పెద్దిరెడ్డి.

"నర్సిగా!" అంటూ.

"ఆc... వస్తున్నా రెడ్డి!" అనేసి గబగబ వరిపొట్టు కుడితి నీళ్ళలో కలిపేసి, చేతులకంటిన వరిపొట్టును తన తలకు చుట్టుకున్న తుండుతో తుడుచుకుంటూ పెద్దిరెడ్డి దగ్గరికి వెళ్ళాడు నర్సయ్య.

"ఏం రెడ్డి?" పెద్దిరెడ్డి వంక చూస్తూ అడిగాడు.

"నువ్వు ఏన్నాళ్ళ నుంచి నాకాడ పని చేస్తున్నావురా?" అడిగాడు పెద్దిరెడ్డి.

పెద్దిరెడ్డి అలా ఎందుకు అడిగాడో అర్థం కాలేదు నర్సయ్యకు

"చెప్పరా!"

"మా తాత ముత్తాతల కాడ్నుంచి, జీతగాళ్ళుగా మీకాడే పనిచేస్తున్నాంగా రెడ్డి! చెప్పాడు నర్సయ్య.

"నీ తాత ముత్తాతల విషయం వదిలెయ్! నీ విషయం చెప్పు!" 'ఏనాడు ఇలా అడగని రెడ్డి, ఈ రోజు ఎందుకిలా అడుగుతున్నాడు?' అన్న అనుమానం నర్సయ్య మనసులో మొదలయింది. తనవల్ల ఏదైనా తప్పు జరిగిందా?' అన్న ఆలోచన. ఆ ఆలోచన వల్ల లోలోపల బెదురు. అయినా పెద్దిరెడ్డి అడిగిందానికి జవాబు చెప్పాలి కాబట్టి నోరు విప్పాడు.

"సెప్పేదేముంది రెడ్డీ? నాకు తెలివి వచ్చిన కాడ్నుంచి మీ నీడనే బతుకుతున్నా!"

"ఆ.. అది తెల్సులేరా! నీకు పెళ్ళయి ఎన్నాళ్ళయింది?" అయిపోవచ్చిన సిగరెట్ పీకను దూరంగా విసిరేస్తూ అడిగాడు పెద్దిరెడ్డి.

"పదేళ్ళయింది రెడ్డి. మీ నాయనే పెద్ద మనసు సేసుకొని నా మనువు సేసినాడు"

"మరి పదేళ్ళయినా పిల్లలెందుకు పుట్టలేదంటావు?"

"ఆ దేవునికెందుకో మా పై దయ లేదు. ఇద్దరం డాక్టర్ల కాడికి పోయి సూపించుకున్నాం! మా ఇద్దరిలో ఏమీ లేదన్నారు. కాస్త నిదానంగా పుడతారు అన్నారు. వాళ్ళిచ్చిన మందులు వాడినం. ముడుపులు కట్టి ఎన్నో గుళ్ళు వెళ్ళినాం! చెట్టు పుట్టా మొక్కినాం. అయినాకాల.

ఏం సేద్దాం రెడ్డి? ఆపై వోడు ఎప్పుడు మాపై దయ సూపుతాడో ఏమో? అంటూ చిన్నగా నిట్టూర్చాడు.

"నాకూ అదే బాధగా వుందిరా! రేయ్! నీకు ఇంకో మనువు చేస్తాను. చేస్కోరా! ఆ వచ్చేదానికయినా పిల్లలు పుడతారేమో?" ఈ విషయం అంగీకరించడని పెద్దిరెడ్డికి తెలుసు. అయినా కావాలని అడిగాడు.

"వద్దులే రెడ్డి! నాకు పిల్లలు లేరన్న బాధ వున్నా, మరో మనువు సేసుకోవాలన్న ఆలోచన లేదు. ఆడికి నా పెళ్ళాం మొత్తుకొనే వుంటావుంది. 'ఇట్లా ఎన్నాళ్ళు. ఇంకో మనువు సేస్కో అని. నాకే మనసు రావడం లేదు."

"అట్లాగయితే ఎవర్నయినా దత్తత తీసుకోరా?"

"ఈ ఇసయం గురించి ఆలోసన సేయలేదు రెడ్డి"

"ఆలోచన చెయ్యరా! నువ్వు 'ఊ' అన్నావంటే, నేనో పిల్లాడ్ని చూపిస్తాను.

"ఎవర్రెడ్డి?" ఆసక్తిగా అడిగాడు నర్సయ్య.

నర్సయ్య ఆసక్తిని గమనించిన పెద్దిరెడ్డి పెదాలపై మందహాసం.

"ఆ కుర్రాడెవడో నే తర్వాత చెబుతాను గాని, ముందు దత్తతకు నీ పెళ్ళాం ఒప్పుకుంటుందేమో అడుగు.

"అట్టాగే రెడ్డి" అంగీకారంగా తలూపాడు నర్సయ్య.



* * *

తన పెళ్ళాం మారెక్కతో పెద్దిరెడ్డి చెప్పిన విషయం గురించి చెప్పి "ఏటంటావే?" అంటూ అడిగాడు.

ఆలోచనలో పడింది మారెక్క

"ఏందే ఆలోసిస్తా వున్నావు. నీ మనసులోని మాటేంటో చెప్పు"

"మనకా పొలం పుట్రా లేదు. నీవు ఆ పెద్ది రెడ్డి కాడే గాసం సేస్తా వున్నావు. నేనా అడపా దడపా కూలి పనికి పోతా వున్నాను. మరి మనలాటోళ్ళకి ఎవరిస్తారు మామ దత్తత? ఇచ్చేటోళ్ళు మనకేమైనా భూమి పుట్రా వుందా? అని సూస్తారు. అదీ ల్యాకపోతే, లెక్కయినా వుందా? అని సూస్తారు. ఈ రెండూ లేవాయే మనకు" అంది మారెక్క భారంగా నిట్టూర్చి.

"నువ్వు సెప్పింది నిజమే అనుకో! మరి పెద్దిరెడ్డి అట్లా వూరికే అనే మనిసికాదే! మనం ఒప్పుకుంటే, దత్తతకు ఓ పిల్లాడ్ని సూసిపెడ్తానన్నాడు. దత్తత తీసుకొందామే? ఆ దేవుని సల్లని సూపు మనమీద లేదు. మనకింకా పిల్లలు పుట్టరే! కాదనమాక!"

భర్త చెప్పింది విన్న మారెక్క చివరికి! సరే నీ ఇట్టం మావా..." అంది నర్సయ్యలో ఆనందం.

"ఇంతకు ఎవరు మామా ఆ పిల్లాడు?"

"తెలీదే! ముందు నీ పెళ్ళానికి సెప్పి, మాట తీసుకొనిరా! పినక సెబుతానన్నాడు" అన్నాడు నర్సయ్య.

"మన కులమోళ్ళ పిల్లాడేనా?"

"ఏ కులం అయితే ఏటే? దత్తత ఇస్తే సాలు"

"అదికాదే! మనం సూస్తే, కడజాతి వాళ్ళమైతిమి. అట్టాటిది మనకు దత్తత ఇవ్వడానికి ఎవరు ముందుకొస్తారు?"

"ఏటో నాకదంతా తెల్వదు. రెడ్డి ఇప్పిస్తానన్నాడు. పెద్దిరెడ్డి మాటంటే మాటే! ఇప్పించి తీర్తాడు. మనకు పిల్లలు లేనందుకు, రెడ్డి కూడా శానా బాధపడినాడే! ఎంతయినా గొప్పోళ్ళు గొప్పోళ్ళేనే? ఆ రెడ్డి కాడే గాసం సేయడం... నాకు శానా సంతోషంగా వుందే! బేగి ఎళ్ళి 'నా పెళ్ళాం కూడా ఒప్పేసుకుంది' అని పెద్దిరెడ్డితో సెప్తాను. వస్తానే!" అంటూ లేచి వడి వడి అడుగులతో ఇల్లు దాటి వెళ్తున్న భర్త వంక చూస్తూ చిన్నగా నవ్వుకొంటూ అనుకుంది! ఈ మడిసికి అంతా తొందరే!"

మారెక్కలో కూడా ఆనందం!!

* * *

"రెడ్డీ నా పెళ్ళాం ఒప్పేసుకుంది." ఉత్సాహంగా చెప్పాడు నర్సయ్య.

"చాలా సంతోషం!" చిర్నవ్వున పలికాడు పెద్దిరెడ్డి.

"రెడ్డీ! ఆ పిల్లాడు ఎవరో సెబితే..." అంటూ ఆగిపోయాడు నర్సయ్య. నర్సయ్యలోని ఆత్రాన్ని గమనించి సన్నగా నవ్వాడు పెద్దిరెడ్డి.

"తొందరేముంది లేరా! కాస్తాగు! ఆ పిల్లాడెవరో నీకు తెలుస్తుంది."

"ఇంతకు ఏవూరు ఆ పిల్లాడిది! ఆ పిల్లాడి అయ్య, అమ్మ వున్నారా? వాళ్ళు మా కులపోళ్ళేనా?" గుండెల్లోంచి ఉబికి వస్తోన్న సంతోషాన్ని ఆపుకోలేక అడిగాడు నర్సయ్య.

"ఆ పిల్లాడెవరో? ఏ వూరో? వాడి అయ్యా, అమ్మ ఎవరో నిదానంగా అన్నీ నీకే తెలుస్తాయి. కాస్త ఓపికపట్టు."

"అట్టాగే రెడ్డీ" అంగీకారంగా తలూపాడు నర్సయ్య.

"రేయ్! ఈ విషయం నాకు, నీకు, నీ పెళ్ళానికి తప్ప నాలుగోవాడికి తెలియరాదు."

"దేనికి రెడ్డి?" అర్థంగాక బుర్ర గోక్కుంటూ అడిగాడు నర్సయ్య.

"ఎందుకో నే తర్వాత చెబుతాలే! అంతవరకు ఎవరికీ చెప్పమాకు. నీ పెళ్ళానికి కూడా ఎవరితో చెప్పొద్దు అని గట్టిగా చెప్పు!"

పెద్దిరెడ్డి మాటల్లోని ఆంతర్యమేమిటో ఎంతగా ఆలోచించినా బోధపడలేదు నర్సయ్యకు.

"రెడ్డీ! మీరు ఆ పిల్లాడెవరో సెప్పలేదు. ఏవూరో సెప్పలేదు. అయ్యా, అమ్మ ఎవరో సెప్పలేదు. ఇదింత దానికే దాసటం దేనికి? అయినా రేపు దత్తత తీసుకొన్నాక, అందరికీ తెలుస్తుందిగా రెడ్డీ!"

"దత్తత తీసుకొన్నా ఎవ్వరికీ తెలియకూడదు"

"అదెట్లా రెడ్డీ?"

"నీకెందుకు నీమానాన నువ్వు వూరికే వుండు. నేను చెప్పినపుడు నా వెంటరా అంతే!"

"అదికాదు రెడ్డి... ఇదంతా నాకేదో అర్థంకాని యవ్వారంలా వుంది అసలు..." అంటూ ఇంకేదో అనబోతుండగా, పెద్దిరెడ్డి అడ్డు తగులుతూ కోపంగా చెప్పాడు.

"నేను ఏం చెప్తే అది చెయ్యి! ఎదురు ప్రశ్నలడక్కు?"

పెద్దిరెడ్డి కోపాన్ని చూసిన నర్సయ్యలో జంకు.

"మీ సిత్తం రెడ్డి. మీరెట్టా సెబితే అట్టా ఇంటాను"

"సరే! పొలం కాడికెళ్ళి, కలుపు తీసే పని చూడు!"

"అట్లాగే రెడ్డి" అనేసి నర్సయ్య, పెద్దిరెడ్డి ఇంటిని వీడి పొలం దారి పట్టాడు. అతని బుర్రలో ఎన్నెన్నో ప్రశ్నలు, ఆలోచనలు!

* * *

ఓ రోజు కోర్టు నుంచి నోటీసు వచ్చింది నర్సయ్యకు. విషయం అర్థంకాక, భయంగా ఆ నోటీసును తీసుకొని పెద్దిరెడ్డి దగ్గరికి పరుగెత్తుకెళ్ళాడు నర్సయ్య. తనకు నోటీసు వచ్చిన విషయం చెప్పాడు. నోటీసును చూపించాడు.

"మరేం భయపడవలసిన పనిలేదురా! దత్తతకు సంబంధించిన నోటీసు నీవు కోర్టులో దత్తత తీసుకోవాలి. అందుకు సంబంధించిందే ఈ నోటీసు.

నర్సయ్య భయం తగ్గింది.

"కోర్టుకు ఎప్పుడు వెళ్ళాలి రెడ్డి!" అడిగాడు నర్సయ్య

"నే చెప్తాగా! నే చెప్పినప్పుడు వెళ్దువుగాని, కూడా నేనూ వుంటాలే"

'నేనూ నీ వెంట వుంటాను' అన్న పెద్దిరెడ్డి మాటలకు, నర్సయ్యలోని సందేహాలు మటుమాయం అయ్యాయి. ధైర్యం వచ్చింది.

* * *

మీ పిల్లవాడ్ని నర్సయ్య అనే వ్యక్తికి దత్తత ఇవ్వడం మీకిష్టమేనా?" అడిగాడు జడ్జి.

"ఇష్టమే!" పెద్దిరెడ్డి, అతని భార్య అంగీకారంగా తలలూపి చెప్పారు.

"మరి దత్తత తీసుకోవడం మీకిష్టమేనా?" నర్సయ్యను, అతని భార్యను ఉద్దేశించి అడిగాడు జడ్జి.

అంతవరకూ దత్తత ఇచ్చేవారెవరో, పిల్లాడెవరో తెలియని నర్సయ్య, అతని పెళ్ళాం మారెక్క సంభ్రమాశ్చర్యాలకు గురయ్యారు. పెద్దిరెడ్డి తన అయిదేళ్ళ కొడుకును, తమకు దత్తత ఇవ్వడమా? ఇది కలా? నిజమా? అనిపించింది వారిరువురికి.

"చెప్పండి ఇష్టమేనా?" మళ్ళీ అడిగాడు జడ్జి.

ఏం చెప్పాలో తోచలేదు. పెద్దిరెడ్డి వంక చూశారిద్దరు. పెద్దిరెడ్డి మందహాసం చేస్తూ"చెప్పండి' అన్నట్టుగా కనుచూపు ద్వారానే చెప్పాడు.

'ఇష్టమే' అన్నట్టుగా ఇద్దరు తలలూపారు.

కోర్టులో పెద్దిరెడ్డి, అతని భార్య, నర్సయ్య, మారెక్క సంతకాలు చేశాక, ఇతర రాతకోతలు పూర్తయ్యాక, బయటికొచ్చారు.

ఏం అడగాలో తెలీక పెద్దిరెడ్డి వంక చూస్తూ అన్నాడు నర్సయ్య

"రెడ్డీ!"

"మరేం లేదురా! మీది అణగారిన జాతి అని ప్రభుత్వం మీకు చదువుల్లో, ఉద్యోగాల్లో, ఇతర వాటిల్లో రిజర్వేషన్ కల్పించింది. ఇప్పుడంతా పోటీ ప్రపంచం. రేపుదయం నా పిల్లాడు పెరిగి పెద్దయి, పోటీని తట్టుకొని ఓ స్థాయికి ఎదగాలంటే, వాడికి మీలాగే రిజర్వేషన్ అవసరం. మేం అగ్రకులస్తులం కదా! మాకు రిజర్వేషన్ లేదు. అందుకే మా వాడికి నీ ద్వారా ఇలా రిజర్వేషన్ కల్పించాను. నీకు దత్తత కోసం మీ కులంలోనే ఎవర్నో ఒకర్ని చూస్తాను. నువ్వు చేసిన ఈ పనికి ఈ పదివేలు వుంచు' అంటూ పదివేల రూపాయలు కట్టతీసి నర్సయ్య చేతికి ఇవ్వబోయాడు. నర్సయ్యలో అప్పటిదాకా పెద్దిరెడ్డి పట్ల వున్న అభిమానం తొలగి అసహ్యం చోటుచేసుకుంది. పెద్దిరెడ్డి చేసిన మోసం పూర్తిగా కాకపోయినా లీలగా అర్థమయింది.

"తమరికి దొడ్డబుద్ధి వుంటుంది అనుకున్నాను. కాని ఇలా లేకిబుద్ధి వుంటాయనుకోలేదు. నీ డబ్బు వద్దు. నీ దగ్గర జీతగాడిగా వుండటం వద్దు! రాయే ఎళ్దాం!" అంటూ భార్యను రెక్కపుచ్చుకొని కోర్టు ఆవరణ నుంచి బయటకు విసురుగా నడిచాడు నర్సయ్య.

(అనంతపురం జిల్లాలో జరిగిన
ఓ యదార్థ సంఘటన ఆధారంగా)

# సమీక్షా పర్వం

* పోలవరం గిరిజన గర్జన "జీవన్మరణం"
* కవి హృదయంలోని అపరాధ భావన "నాయిన"
* ఆత్మవిశ్వాస ధిక్కార స్వరం "నఖాబ్"
* "ప్రతిభ - ఇమాజినేషన్" సిద్ధాంత వ్యాసం
* కవిత్వపు "పొత్తిళ్ళలోంచి"
* "మార్గదర్శిని - అనువాదదర్శిని"
* శ్రమజీవుల సంకేతం "స్వేదాశ్రువులు"
* "జంఝావతి కథలు"

పోతగాని సత్యనారాయణ



## పోలవరం గిరిజన గర్జన జీవన్మరణం

మానవత్వం నుంచే కవిత్వం పుడుతుంది. సాటి మనుషుల ాధా వేదనలకు స్పందించడంలోనే నిజమైన కవితా సృష్టి ారంభమవుతుంది.

ఖమ్మంజిల్లా సాహితీ ప్రవంతి ఆధ్వర్యంలో పోలవరం ాజెక్టు ముంపు ప్రాంతాలలో పర్యటించి బాధితుల మనోభావాలకు, ద్వేగాలకు, ఆవేశాలకు, ఆవేదనలకు ప్రత్యక్ష సాక్షులైన కొందరు వుల, రచయితల సాహితీ వాఙ్మూలమే 'జీవన్మరణం'.

ఈ సంకలనంలో పొందుపరచిన కవితలన్నీ పోలవరం ాజెక్టుకు ప్రత్యామ్నాయాలను పరిశీలించని ప్రభుత్వ నియంతృత్వ ోకడలను నిరసిస్తూ ఎక్కుపెట్టిన అక్షరాయుధాలే!.

రి నా వెర్రి గిరిజనుడా -
........................
ంతోనే నీ గళం కోసేస్తారు!
వ్వు పిడికిలి బిగించి నినదించు
పి(డి) కొండలు ప్రతిధ్వనిస్తాయి
వ్వు పొలికేక పెట్టు!
లవరం ఆటకట్టు!!'

అంటూ అనివార్యమైన జీవన్మరణ పోరాటానికి సిద్ధం కమ్మని ుపునిస్తారు సాధనాల.

ఆదిమ మానవుని ఆఖరి అడుగుజాడలైన ఆదివాసీల ంస్కృతిని, జీవన విధానాన్ని ప్రాజెక్టు పేరుతో 'ధ్వంసం' చేయడాన్ని ిసిస్తూ...

ాదిని కూల్చి
భవనాన్ని నిర్మించగలవు?!
ాలాన్ని పేల్చి
సిద్ధాంతాన్ని నిరూపించగలవు?!'
ంటూ ప్రశ్నిస్తాడు మరో కవి ఈగ హనుమాన్.

'నిప్పంటుకుంటే నీరార్పేది
నీరే అంటుకోబోతోంది ఏం చేయాలి?' అంటూ వాపోతాడు శేషగిరి

'ఏ భాషా శాస్త్రానికి లొంగని ఆగ్రహం
హెచ్చరిక బోర్డైఊరి పొలిమేరలో
ధిక్కారం ప్రకటించడాన్ని గుర్తు చేస్తాడు' పి. విద్యాసాగర్.

'మా ఉనికి మా చేతుల్లోనే
విల్లంబై లేస్తుంది!
పోలవరం కలకలంపై
పోరువనం జయిస్తుంది!!' అంటూ ప్రజా విజయాన్ని కాంక్షిస్తాడు కె. ఆనందాచారి.

'అడవిపై ఉన్న హక్కు
పుట్టుక తెచ్చిన ఊపిరి
ఆ హక్కును ఉరితీసే సర్కారే తలారి' అంటూ ఆక్షేపిస్తుంది శ్రీమతి పురిమళ్ళ సునంద.

'నిరసన గళాలు
పెను ఉప్పెనై ఎదురొస్తే
పోలవరం గడ్డిపోచే కొట్టుకుపోతుంది' అంటూ హెచ్చరిస్తుంది అలవోకల కవయిత్రి బి. ఇందిర

'అడగగానే అమాయకంగా వేలు కోసివ్వడానికి
ఎనకటి ఏకలవ్యులం కాదు
ద్రోణుడి ద్రోహబుద్ధి పసిగట్టిన దొరకూనల'మంటూ అనాదిగా ఆదివాసీలకు జరుగుతున్న అన్యాయాన్ని నొక్కి చెప్పాడు పారుపల్లి వేంకటేశ్వరరావు.

పౌరాణిక పాత్రలను ఉదాహరణగా తీసుకొని కవిత్వం రాయడం కొత్తకాకపోయినా సందర్భోచితంగా స్పందిస్తూ కవితను నడిపించడంలో నవ్యత్వాన్ని ప్రదర్శించాడు కవి.

'రాజులే లేనిచోట రాజద్రోహం కేసులతో నిలువరించాలనుకుంటే అరుణారుణ బావుటాలతో ఎగసిపడే ఎర్రని జ్వాలలు ఉప్పెనలా లేచి ధిక్కారాలై, దిగ్బంధనాలై, నిరసనలై నిలువెత్తు లేవనున్నాయి'

పోలవరం ప్రాజెక్టును నిరసించినవారిపై రాజద్రోహం పేరిట కేసులు పెట్టిన ప్రభుత్వ వైఖరిని నిరసిస్తూ భవిష్యత్ పోరుబాట క్రమాన్ని కళ్ళ ముందుంచాడు 'నేను సైతం' అంటూ లెనిన్ శ్రీనివాస్.

కవిత్వ పరమార్థం ఒక నమ్మకాన్ని, ధైర్యాన్ని, ఆశనీ పుట్టించాలి. అగ్నినీ, ఆర్తినీ, అనుభూతినీ రంగరించి పోలవరం ముంపు ప్రాంతాలలో నివసించే ఆదివాసీల ఆత్మఘోషను అక్షరీకరించిన ఈ కవులు ఖచ్చితంగా ఉద్యమ కవులు.

'తెగబడితే...' జరిగే పరిణామాలను కవితా శరాలుగా అందించిన దేవేంద్ర, 'హెచ్చరిక' చేసిన డాక్టర్ కాసర్ల రంగారావు 'పొలికేక' పెట్టిన ఎన్. తిర్మల్, 'బతకనీండి' అంటూ వేడుకున్న టి. దుర్గాచారి, 'మరో రాఘవ దండై' కదిలిన మాల్యశ్రీ, 'ధిక్కార స్వరాన్ని' వినిపించిన వట్టికూటి మురళి, 'వద్దురా' అంటూ వారించిన నీరుకొండ హనుమంతరావు, 'పొత్తిలి పోరు' సలిపిన అమ్మిన శ్రీనివాసరాజు, 'బతుకు భూమి నుండి' నడచి వచ్చిన సిహెచ్. ఆంజనేయులు, 'నిదురెట్టబోతావు తమ్ముడా!' అంటూ పోరుబాటకు ప్రేరేపించిన కపిల రాంకుమార్, ఈ 'మృత్యు లోయ', ఎవరికోసం అంటూ ప్రశ్నించిన డాక్టర్ దిలావర్, 'అడవి అమ్ములపొది'గా మారుతున్న వైనాన్ని తెలిసిన హనీఫ్, ఎమ్మెస్సార్, 'రేపటి దృశ్యా'న్ని ఆవిష్కరించిన షుకూర్, 'ఎటునుండి ఎటువైపుకు' అంటూ ప్రభుత్వ తిరోగామి చర్యల్ని ఎండగట్టిన కటుకోర్వుల రమేష్ వంటి కవులు అభినందనీయులు.

ఇంకా ఈ సంకలనంలో 'ఓ వెన్నెలమ్మా...' అనే పాటను రౌతు రవి, 'పోలారం ప్రాజెక్టాపండి' అంటూ సాగే పాటను కన్నెగంటి శ్రీ వాణి, 'ఆకలి మందు' అనే పాటను కట్టా జ్ఞానేశ్వర్‌లు హృద్యంగా రచించారు.

సంకలనాలలో వివిధ కవుల కవితలుండటం సహజం కానీ ఒకే ఉద్యమ స్ఫూర్తితో వెలువడిన ఈ సంకలనంలో ఒకే దృక్కోణంతో రాసిన నలుగురు కవులకు చెందిన కవితలు రెండు చొప్పున కనబడతాయి.

కథల్లోకి వస్తే మొదటి కథ శిరంశెట్టి కాంతారావుగారు రాసిన 'పోరువనం' భద్రాచలం డివిజన్ ఏజెన్సీలో తను ప్రత్యక్షంగా చూసిన ప్రతి సంఘటననీ, ప్రతి ప్రదేశాన్నీ ఈ కథలో అక్షర నిక్షిప్తం చేస్తూ ముత్తెం రెడ్డి పాత్ర ద్వారా ఆదివాసీలలో ఉద్యమ స్ఫూర్తిని నింపడానికి ప్రయత్నించారు.

రెండవ కథ జాతశ్రీ రాసిన 'అమానుషం'. ఈ కథలో 'పోరాటమే దారి భూమికి బదులు భూమి ఇచ్చినా, గుడిసెలకు బదులు బిల్డింగులిచ్చినా మాకొద్దు! మా ఊరొదిలితే మా ఊపిరి పోద్ది. ప్రాణాలు పోయినా ఇక్కడే పోవాలి! ఇక్కడే పుట్టినం ఇక్కడే పెరిగినం ఇక్కడే చావైనా బ్రతుకైనా' అంటూ గిరిజనుల దృఢ సంకల్పాన్ని, మనోగతాన్ని వారి జీవన విధానంపై తనకున్న స్పష్టమైన అవగాహనతో తెలియజేశారు.

మూడవ కథ దీప్తి రాసిన 'గద్దొచ్చె కోడిపిల్ల భద్రం భద్రం'. ఈ కథలో రచయిత్రి పోలవరం కట్టడం వల్ల పర్యావరణ సమస్య తలెత్తడాన్ని వివరిస్తూ 'కోమలి' పాత్ర ద్వారా తన మూలాల్ని మరచి ప జీవీ మనుగడ సాగించలేదనీ మాయా ప్రపంచపు బంధనాలు తెంచుకొని తన జన్మభూమిని కాపాడుకోవడమే మంచిదని ఉద్బోధిస్తుంది.

ఈ సంకలనంలో ఆఖరి కథ జీవన్ రాసిన 'పోటెత్తిన జనసంద్రం' ముసలోడి పాత్ర ద్వారా ఆదివాసీల జీవన స్థితిగతులను వివరిస్తూ పోలవరం ప్రాజెక్టు వల్ల రాబోయే ఉపద్రవాన్ని నివారించడానికి ఆదివాసీలు ఐక్యం కావాలని 'ముంచే ప్రాజెక్టు కాదు పెంచే ప్రాజెక్ట కావా'లని నినదించారు.

పోలవరం ముంపు ప్రాంతాలను సందర్శించిన అతి తక్కువ కాలంలోనే గిరిజనుల వాస్తవిక జీవితాలను వైవిధ్యభరితమైన కథలుగా మలచిన రచయిత (త్రి)లు, పాత్రల వాస్తవిక భాషను సైతం వ్యక్తీకరించడానికి ప్రయత్నించడం అభినందనీయం.

**(సంకలనం : జీవన్మరణం, ప్రచురణ : సాహితీ స్రవంతి ఖమ్మం, వెల : రూ. 50/-, దొరుకుచోటు : ప్రజాశక్తి బుక్‌హౌస్ బ్రాంచీలు)**

## వల్లభాపురం జనార్ధన




# ఆత్మవిశ్వాస ధిక్కార స్వరం "నఖాబ్"

"ఊహ తెలియని వయసులో గుమ్మానికి పరదా కడితే
రంగు రంగుల కుచ్చులు చూసి మురిసిపోయినదాన్ని
అప్పుడే స్వేచ్ఛకు మొదటి బేడీ అని తెలుసుకోలేని పసిదాన్ని
గుమ్మానికి కట్టినట్టే అమ్మీ ముఖానికి నఖాబ్ కడితే
స్వప్నంలాంటి జిందగీకి శాపమని అప్పట్లో తెలియనిదాన్ని"

అంటూ తనను తాను ఆవిష్కరించుకున్న ముస్లిం కవయిత్రి షాజహానా. స్త్రీలందరి ప్రతినిధిగా మగ పెత్తనం కింద నలుగుతున్న ఆడవారి జీవితాలను ముఖ్యంగా ముస్లిం స్త్రీల జీవితాలలోని అసహాయతను – దయనీయతను కవితా వస్తువుగా కలం చిత్రాలు గీసింది. చీకటి కొట్టంలాంటి ఇంటిలో పశువుల్లా బతుకుతున్న ఆడవాళ్ళ అంతరంగాల్లోని ఆర్తినీ – అంతర్మథనాన్నీ – ఆక్రోశాన్నీ పట్టించే కవితా సంపుటి నఖాబ్. ఇందులోని కవితలు ఇంకా గుండెల్లో తడి మిగిలి ఉన్న మనుషుల్లో స్పందనకు ప్రేరకాలుగా నిలుస్తాయనడం వాస్తవం. స్త్రీలపై ముఖ్యంగా ముస్లిం స్త్రీలపై కొనసాగుతున్న సామాజిక – కుటుంబ – మత ఛాందస వివక్షలకు వ్యతిరేకంగా అక్షరాలను ఎక్కుపెట్టిన కవి షాజహానా.

ముస్లిం ప్రజల చైతన్యాన్ని సమాధి చేస్తున్న ప్రహరీగోడ బుర్ఖా. అలాగే సంప్రదాయం ప్రపంచ స్త్రీలనందరినీ సమాధి చేయడాని ప్రహరీ గోడగా ఉందనే అంశాన్ని కుండబద్దలు కొట్టినట్లు చెప్పారు షాజహానాగారు. ఈమె కవితల్లో ప్రకటించిన భావాలలోని నిజాయితీ వ్యక్తీకరణలోని నిర్భయత్వం – పదాల ఎంపికలోని సూటిదనం కవితా ప్రియుల మనస్సులను కట్టిపడేస్తుందనడం అతిశయోక్తి కాదు.

ముస్లిం సనాతనవాదులకూ – వర్తమాన వాహికగా మారుతున్న వారికీ మధ్య జరుగుతున్న భావాలు సంఘర్షణలో ఆధునిక వైపు బలమైన గొంతును వినిపిస్తున్న కవితల సంపుటి నఖాబ్.

ఈ సంపుటిలోని 20 కవితల్లో ముస్లిం స్త్రీల అణచివేతను వర్ణించే కవితలు ఎక్కువగా ఉన్నాయి. పురివిప్పిన మతోన్మాద పాశవికతకు సమిధలుగా మారుతున్న స్త్రీల వెతలను పట్టించే కవితలు కొన్నయితే, ముస్లింల దేశాభిమానాన్ని, దేశభక్తినీ ప్రకటించే కవితలు ఆధునిక స్త్రీ కర్తవ్యాన్ని తెలిపేది కొన్ని, ప్రాంతీయ గళం వినిపించే కవితలు కొన్ని ఉన్నాయి.

'పర్దా హటాకె దేఖో' కవితలోని

'ఇవ్వాల్టి పదునాలుగేళ్ళ వసంతాన్ని అరవై యే శిశిరానికంకితమియ్యమంటే'

"కిరాతకంగా నన్ను వ్యభిచార బానిసగా అమ్మేస్తుంటే
స్వేచ్ఛ కనీసం వినటానిక్కూడా నిషేధింపబడినదాన్ని"

అన్న అభివ్యక్తి పేద ముస్లిం కుటుంబాల ఆడపిల్లల నిస్సహాయత - పెళ్ళి పేర అరబ్బు షేకులకు ఆడతనం అమ్మబడటం బలంగా వ్యక్తీకరించింది. 'అరవై యేళ్ళ శిశిరానికి అంకితం', 'వ్యభిచార బానిస' పద బంధాల ద్వారా పదునాలుగేళ్ళ వసంతం పడే పాట్లు మనసు పొరలను చీల్చుకొని తాకుతాయనడం సబబుగానే ఉంటుంది.

'అనార్కలి' కవితలోని 'మతాలు మోసే మగతనాల వికటాట్టహాసం' 'తడి లేకుండా పోవడానికి ఎడారులం కాదుగా" "నీ ఆగిపోయిన శ్వాసను పునరుద్ధరించడానికి ఒక్కొక్క ఇటుకనే పెళ్ళగిస్తున్నా" అనటంలో మగతనాల వికటాట్టహాసం స్త్రీల ఊపిరిని లాగేసే మత సంప్రదాయాలను నిలదీసే ధ్వని కనిపిస్తుంది. "తడి లేకుండా పోవడానికి ఎడారులం కాదుగా" అనటం స్త్రీలు రాళ్ళు కారు మనసున్న మనుషులే, వారిలోనూ స్పందన ఉంటుంది సుమా అనే సుతిమెత్తని హెచ్చరికను జారీ చేస్తుంది. 'నీ ఆగిపోయిన శ్వాసను పునరుద్ధరించడానికి ఒక్కొక్క ఇటుకనే పెళ్ళగిస్తున్నా" అనటం అనార్కలి ప్రేమ ఫలితానికి ఆధునిక భాష్యం చెప్పటం తప్ప మరొకటి కాదు. ఈ మాటల్లో తిరగబడే ఆధునిక స్త్రీ స్వభావాన్ని వ్యక్తీకరించడం జరిగింది.

మగవాడి పశు మనస్తత్వాన్ని కళ్ళకు కట్టించిన కవిత తస్వీర్.

"అతని అలవాట్ల యాసిడ్‌లో ముంచి
అస్థిపంజరంలా తేల్చాడు.
బట్టలకు అత్తరద్దుకున్నట్లు శరీరానికి ఔరత్‌ల అందాలను
అద్దుకోవాలని ఆరాటపడుతుంటాడు"
మాటల కమ్మీలతో నీ పారదర్శక అందాలలో
పర పురుషుల నీడల్ని వెతుకుతుంటాడు"

మగవాని అలవాట్లను యాసిడ్‌తో పోల్చడం కొత్త ప్రతీకగా చెప్పుకోవాలి. యాసిడ్‌కు పదార్థాలను కరిగించే శక్తి ఉంటే మగవాని అలవాట్లు ఆడదాన్ని ప్రాణమున్న అస్థిపంజరంగా చేస్తున్న వాస్తవాన్ని 'యాసిడ్' ప్రతీకతో మగవాని అలవాట్లలోని క్రూరత్వాన్ని పట్టించే ప్రయత్నం అలతి పదాలతో సాధించబడింది. అలాగే శాడిస్టు నడవడిని కళ్ళ ముందు నిలదీసిందీ కవిత!

"అసలు నేనే నవ్వులు పూసే ఆకాశం
నేను అతని హలాల్ అయిన్నాటినుండీ
ఆకాశమంత నవ్వుని కత్తిరించి చిర్నవ్వు చేశాడు"

''గుంగీ'' కవితలోని ఈ మాటల్లో పెళ్లితో పరాయీకరించబడిన ఆడవారి పరాధీన శిథిల జీవన దృశ్యం అక్షర చిత్రం చేయబడింది.

"మెహర్ మొహాన కొట్టి పెళ్ళాలను మార్చుకొనే టెంపరరీ మొగుళ్ళని తెలిసీ
సంప్రదాయపు కొండచిలువని నల్లపూసలుగా చుట్టుకున్నవాళ్ళం"

ఖబడ్దార్ కవితలో పెళ్ళి పేరుతో ఆడవారి మెడలో చేరే నల్లపూసలను సంప్రదాయ కొండ చిలువగా పోల్చడం, తలాఖ్ అనే మాటతో పెళ్లాలను మార్చుకునే ముస్లిం సంప్రదాయపు పెళ్ళిలోని పిటాకుల స్వభావాన్ని వ్యక్తీకరించడం జరుగుతుంది.

"మమ్మల్ని మౌన మాంసాలుగా ఉత్పత్తి యంత్రాలుగా
బతకమంటున్న సంప్రదాయానికో సలాం"
"మా గుండెలయలు దగ్గరయిందెప్పుడూ
శరీరాల ఆబత్వం తప్ప"

థుత్కార్ కవితలోని ఈ మాటలు స్త్రీని తమ శృంగారమనే ఆకలి తీర్చే మాంసం ముద్దగా చూస్తున్న మగ పెత్తనాన్ని ఎండగట్టాయి. కామం తప్ప సహజీవనం, సమజీవనం పట్టించుకోని జీవంలేని వివాహ వ్యవస్థ పునాదిని కదిలించేలా ఉన్నాయనడం అతిశయోక్తి కాదంటాను.

అపరిచిత ఒంటరి కఫన్ - కాలీ దునియా కవితలు మతోన్మాద వికృత రూపాన్ని అది ముస్లిం స్త్రీల జీవితాలను ఎలా కకావికలు చేస్తుందనే విషయాన్ని బలంగా వ్యక్తీకరించాయి. అపరిచిత కవితలో.

"జాతీయంగానో, అంతర్జాతీయంగానో ఏం జరిగినా
హఠాత్తుగా నా పరిసరాల్లో నేను అపరిచితనైపోతాను"

ముస్లిం స్త్రీలు ఎంతో అభద్రతకు గురవుతారనేది అక్కడెక్కడో జరిగిన సంఘటన. ఇక్కడ వీరిని సమాజం నుంచి ఒంటరిని చేస్తుందన్నది చిన్న మాటల్లో పొదగడం జరిగింది.

"యోనుల్లో ఆయుధాలు పొడిచి ఇవ్వాళ నువ్వు చావుల విందు చేసుకునుండొచ్చు.
కానీ నన్ను హత్య చేయలేవు, నేను బతకడమే కాదు నిన్ను పుట్టించి బతికించేదీ నేనే"

అన్న "కాలీ దునియా" కవిత మతోన్మాద దుశ్శాసన చర్యలను "చావుల విందు" పదబంధంతో ఆలోచనల కళ్ళకు చూపించింది. "నిన్ను పుట్టించి బతికించేదీ నేనే" అనటం స్త్రీ వ్యక్తిత్వాన్ని రూపు కట్టించింది.

ఈ మట్టిలో కలిసిన మా రక్త మాంసాలను చేతనైతే జల్లెడ పట్టండి
ఈ భూమిలో మమేకమైన మా మనసులను విడగొట్టగలరేమో చూద్దాం"

అన్న 'ఇన్సానియత్' కవిత 'జల్లెడ పట్టండి' 'ఈ భూమిలో మమేకమైన మా మనసులు' పదబంధాలు మతం కళ్లు కాదు కాదు మతోన్మాదం కళ్లతో అనుమానపు చూపులు చూస్తున్న వారిని పుట్టిన గడ్డతో పెనవేసుకున్న మా మనసులను దాని నుండి విడగొట్టగలరా అంటూ ప్రశ్నించి వారి విజ్ఞతను నిలదీశాయి.

"స్త్రీ తప్ప మగాణ్ణి క్షమించేదెవరు?
ఎప్పటికీ ప్రపంచం నా రొమ్ము తాగుతున్న పసిబిడ్డే"

మతోన్మాదుల పెడ పోకడలను క్షమించి వారిని మార్చి అక్కున చేర్చుకునేది స్త్రీయే అని 'కాలీ దునియా'లోని ప్రపంచం నా రొమ్ము తాగుతున్న పసిబిడ్డే" అన్న ప్రతీక కవితాత్మకంగా నిరూపించింది.

"నేను చాలా వాటికి ప్రపంచాన్ని నాకే ప్రపంచం లేదు' అంటున్న 'ప్యాసీ' కవిత ప్రపంచానికీ మూలమైన స్త్రీకి తనదైన ప్రపంచం లేకుండా చేసిన పురుషాధిక్య విషాద కృత్యాన్ని తాత్వికంగా బయటపెట్టింది.

అంతేకాదు ముస్లిం సమాజంలోని అగ్రవర్ణాల వారు తమలోని వారిలో కొందరిని తక్కువగా చూస్తూ సామాజిక వివక్షకు గురిచేస్తున్న విషయాన్ని కూడా 'లద్దాఫ్ని' కవితలో

"రెండు దవడల మధ్య ఉండచుట్టిన పాన్‌నయ్యాను
మా వాళ్ళు మాత్రం అస్లీ తురకమ్మాయినని ఖరారు చేశారు"
నా దూదేకులతనాన్ని షోహర్ ఆపాదించుకోనప్పుడు
అస్లీ ముస్లిం ముద్రను మాత్రం నేనెందుకు భరించాలి"

అంటూ ముస్లిం అగ్రవర్ణ స్వభావాన్ని - వారు చూపుతున్న సామాజిక వివక్షను ఎత్తి చూపింది. ఇందులోని రెండు దవడల్లో ఒకటి మతం, రెండవది సామాజిక హోదా. వీటి నడుమ నలిగిపోతున్న బడుగు ముస్లిం స్త్రీ పరిస్థితి నమలబడి ఉండగా ఉమ్మివేసిన పాన్‌లా ఉందనడం మంచి పోలిక.

కవయిత్రి నిరాశావాది కాదు. భవిష్యత్తుపై నమ్మకం గలది. అందుకే 'పర్దా హటాకె దేఖో' కవిత.

"మాటలు రానప్పుడు ఏమో కానీ పోరాటం చేయగలిగినప్పుడు కూడా

చేతులు కట్టుకు కూర్చోవటం ఇకపై నా వల్ల కాదు
పొట్ట కూటి కోసం నాల్గు రాళ్ళు సంపాదించడం కోసం
రాళ్లనైనా పగలగొట్టగల సత్తా నాకుంది.
మీరు బిగించిన ఇనుప సంకెళ్ళను విదిల్చేయగల
గుండె ధైర్యం నాకు చాలా చాలా ఉంది"

ఆధునిక స్త్రీ ఆలోచనా ధోరణికి ప్రతీకగా నిలుస్తుంది. "రాళ్ళనైనా పగలగొట్టగల సత్తా" 'ఇనుప సంకెళ్ళను విదిల్చేయగల గుండె ధైర్యం' అనేవి పురుషాధిపత్యంపై పోరాటం చేయగల సత్తా – వారు వేసిన సంకెళ్ళను తెంచేసుకోగల సత్తా – తిరుగుబాటు చేయడానికి గుండె ధైర్యం చాలా చాలా ఉంది అని చెప్తున్నది. అలాగే 'ఖౌసె ఖిజా' కవిత.

చీకటి బురఖాని తొడుక్కున్న రాత్రి కూడా వేకువ కోసం చూస్తుంది

నేను మాత్రం నల్లటి మబ్బులను మూసేస్తూ
నీలాకాశపుటంచుల్లో ఖౌసె ఖిజౌనవుతా"

"చీకటి బురఖా" అణచివేతను సూచిస్తే 'వేకువ' విముక్తిని సూచిస్తుంది.

'నల్లటి మబ్బులు స్త్రీలు అనుభవిస్తున్న వివక్షకు సంకేతం. 'నీలాకాశపుటంచులు' స్వేచ్ఛా సమానతలు గల ప్రపంచానికి ప్రతీక. 'ఖౌసె ఖిజానవుతా' అనేది విముక్తిని సాధిస్తాననేందుకు సంకేతం.

షాజహానా తన కవితల్లో సామాజిక వాస్తవికతను ప్రతిఫలింపచేసింది. స్త్రీ అణచివేయబడుతున్న కోణాలను చిత్రం కట్టించింది. ముస్లిం సమాజంలోని స్త్రీల అసహాయతకు, అణచివేతకు ముస్లింలలోని అగ్రవర్ణ భావజాలం కలిగిన పెద్దల పెత్తనమనే విషయాన్ని కూడా గుర్తించింది. కానీ ఆ పెత్తనాన్ని నిలదీసి పోరాటం చేయడానికి పీడితులందరూ ఒకటై కదలాలనే విషయం కూడా చెప్పి ఉండే సమగ్రత వచ్చి ఉండేదని నా అభిప్రాయం.

నఖాబ్ కవితా సంపుటిలో స్త్రీల పట్ల తనకు గల తపననూ, ఆర్తినీ చాలా బలంగా వ్యక్తీకరించింది షాజహానా. అదే సమయంలో ఉర్దూ పదాలు ఎక్కువగా వాడింది. ఉర్దూ పదాలు వాడటం తప్పు కాదు. కానీ మౌలికంగా తాను ఏ భాషలో కవిత్వం రాస్తున్నదో ఆ భాషా సౌందర్యాన్నీ మింగేసే రీతిలో ఉర్దూ లేదా యితర భాషా పదాలు ఉండకుండా చూసుకుంటే బాగుంటుంది. నిఘంటువుల అవసరం లేకుండా జనసామాన్యానికి అర్థమయ్యే వాటిని తెలుగు పదాలుగా కలిసిపోయే వాటిని వాడటం మంచిదంటాను. తప్పనిసరిగా భావ వ్యక్తీకరణకు తప్పనిసరై జనానికి అర్థం కాని పదాలను వాడాల్సి వస్తే అలాంటి వాటికి పాదసూచికల్లో అర్థాలు ఇస్తే బాగుంటుంది. కవయిత్రి ఉర్దూ పదాలను పుంఖానుపుంఖంగా వాడింది కాని వివరణ ఇవ్వలేదు. ఈమె ఉర్దూ పదాలను వాడటం వరకే పరిమితం కాలేదు. వాక్యాలకు వాక్యాలు ఉర్దూ నిర్మాణ రూపాల్లో వాడింది. దీనివల్ల కవితకు భాషకు అందం రాకపోగా పాఠకుల అవగాహనకు తిమ్మురుసు ముద్రలుగా మారాయని నా వ్యక్తిగతాభిప్రాయం. 'షాదీహీ తస్వీర్ మే మేరీ హో భోలీసే మా' లాంటి ఉర్దూ వాక్యాలు కవితార్థ వినియోగ ప్రచారానికి అడ్డుకట్టలవుతాయి తప్ప అనుభవయోగ్యం కావనేది కాదనరాని వాస్తవం.

స్త్రీ వాద సమస్యలను ఆవిష్కరించిన ఈ కవితా సంపుటిని అణచివేయబడుతున్న దేశ దేశాల ముస్లిం స్త్రీలందరికీ అంకితం ఇవ్వడం అర్థవంతమైనదే. ముఖపత్రానికి నల్లరంగు నేపథ్యంగా వాడటం సముచితంగా ఉంది. ముస్లిం స్త్రీల జీవితాల్లోని అనేక కోణాలను – అణచివేతను ప్రతిభావంతంగా కవిత్వీకరించిన 'షాజహానా' అభినందనీయురాలు. ఈ పుస్తకం సమాంతర – సహచర – నవోదయ ప్రజాశక్తి పుస్తకశాలల్లో దొరుకుతుంది. కవితా స్పృహ – గుండె తడి ఉన్నవారంతా చదవాల్సిన కవితా సంకలనం నఖాబ్. షాజహానా ముందు ముందు మరింత చక్కటి తెలుగులో సంకలనాలను తీసుకురావాలని కోరుకుంటున్నాను.

**(సంకలనం : నఖాబ్, రచయిత్రి : షాజహానా, వెల : రూ. 50/-, దొరుకుచోటు : ప్రజాశక్తి బుక్‌హౌస్, చిక్కడపల్లి, హైదరాబాద్)**

---

**అద్దేపల్లి ప్రభు**




## కవిత్వపు పొత్తిళ్ళలోంచి "స్వామి"

కవిత్వం కేవలం భాషకి సంబంధించినది కాదు. అది అంతకన్నా ఎక్కువగా భావానికి సంబంధించినది. దుఃఖంతోనూ, వేదనతోనూ ప్రపంచముతో ఘర్షణకి దిగుతాడు. మానవ సంబంధాల్లోని సున్నితమైన, తేలికైన అంశాల దగ్గర్నుంచి సంక్లిష్టమైన విషయాల వరకూ ప్రతి దాన్ని కవి ప్రేమిస్తాడు. ఘర్షణ పడతాడు. బహుశా ఈ సంవేదనలు అందరిలోనూ ఉంటాయి. కానీ కవి ఈ సంవేదనల్ని గొంతు చించుకుని అరవడం వల్ల అతడు లోకానికి దగ్గరవుతాడు.

తనకు స్ఫురించిన భావంతో వివరీతముగా మమేకమైనప్పుడు కవి ఒక అద్భుతమైన అనుభూతిని పొందుతాడు. ఆ అనుభూతి స్వీయాత్మకమైనది కాదు. అది మన సంస్కారాన్ని పుటం పెట్టే అగ్ని. దానికి తగ్గ భాషని ఉపయోగించి వ్యక్తీకరించినపుడు పాఠకుడికి కూడా ఆ భావోన్మత్తత... అనుభూతి కలుగుతాయి.

పి.ఆర్.ఎల్. స్వామి పొత్తిళ్ళల్లోంచి... కవిత్వంలో యిటువంటి సంఘర్షణ... అనుభూతి మనల్ని ఆకట్టుకుంటాయి. గోదావరిని కానీ, ఏ నదిని కానీ చూసినప్పుడు ఏ మనిషికైనా ఒకలాంటి ఉద్వేగం కమ్ముకుంటుంది. నదిని కేవలం నీటి ప్రవాహంగా భావించేవారికైనా అందులోని ఒక మాంత్రిక స్వభావం మనిషిని రసహృదయుణ్ణి చేస్తుంది. దాంతో పాటు చరిత్ర, సమాజం తెలిసిన వారికి, కవిత్వం తెలిసినవారికైతే

**గోదావరి నీటి పరుపుపై**
**అలల నృత్యం నా కంటపడినప్పుడు**
**పూర్వ కవుల వ్యాఖ్యనిర్మాణాలు**
**నా నాలుకపై నర్తించినట్టుంటుంది.**

భావం నదిలాంటిదైతే భాష అలలాంటిది. అలల కదలికలో ఒక క్రమమూ ఉంటుంది. తదేకంగా చూస్తే ఒక ఆవేశమూ వుంటుంది. కవిత్వం అలాంటి ప్రవాహం, అది తరాలలోంచి ప్రవహించి వచ్చే సంస్కృతి.

ఈ వేళ తెలుగు సమాజంలో అసహజంగా ప్రవేశించిన అనేక అంశాలు, వాటివల్ల వచ్చిన మార్పులపైన అనేక కవితలు ఈ సంకలనంలో ఉన్నాయి. కేబుల్ బలిపీఠం అన్న కవిత అనేక కవి సమ్మేళనాల్లో శ్రోతల్ని... కవిత్వాభిమానుల్ని ఆకట్టుకున్న కవిత, దీంట్లో కవి కుటుంబములో ఏర్పడిన అసహజ వాతావరణాన్ని వ్యక్తీకరిస్తాడు చివరికి...

ఎవరికి వాళ్ళం ఎపిసోడ్సు ఎపిసోడ్సుగా
విడి విడిగానే బతుకుతున్నాం.

అనడంలో రక్త సంబంధాల మధ్య పెరిగిన అపరిచిత దూరం ఛెళ్ళుమని స్ఫురణకు వస్తుంది. అంతేకాదు కలసి బతకడం అనే మానవ సహజీవితాన్నుంచి మనిషి ఎంతగా పరాయిని చేసిందో ఈ కవిత అద్భుతంగా చెప్తుంది.

'వాటర్ బోయ్' కవితలో గుండెల్ని పిండే ఒక విషాదం ఉంది. బాల కార్మికుడు ఎక్కడైన పని చేయడం వేరు - బడిలో పనిచేయడం వేరు. అందులోని విషాదంలో వ్యక్తిగత సామాజిక మూలాల్ని పరోక్షంగా చెప్తాడు కవి. 'రేపట్నించీ బడికెళ్ళాలి' అన్న ఎత్తుగడతో మొదలైన ఈ కవిత పిల్లాడు బడికి వెళ్ళాల్సింది చదవడానికి కాదు నీళ్ళు మొయ్యడానికి అని చెప్పునపుడు మనల్ని దుఃఖం కమ్మేస్తుంది. కవి ఉపాధ్యాయుడు కాబట్టి యిటువంటి అంశాల్ని రకరకాల సందర్భాల్లో చెపుతాడు. 'బతుకు పుస్తకం' కవితలో బాల కార్మికులను చూస్తే

*ఎలిమెంటరీ పాఠశాలలో*
*అస్తవ్యస్తంగా చిరిగి మూలకి విసిరేయబడ్డ*
*భారతదేశ పటం గుర్తుకొస్తుంది*

అంటాడు. యిది ఒక సహజత్వానికి... నిర్లిప్తత్వానికి కూడా మంచి వ్యక్తీకరణ. చదువుకోవలసిన పిల్లలు పనులు చేస్తూ కనబడితే ఎవరికైనా బాధగానే ఉంటుంది. అందులో ఉపాధ్యాయుడైతే మరీనూ... ఎందుకంటే వాళ్లు చదువుకుంటే ఏమి కాగలరో ఆ భవిష్యత్తుని ఉపాధ్యాయుడు దర్శించగలడు కాబట్టి.

చేతుల్లేని కుంచె - దూరమైన నేపథ్యంలో - చిరిగిన పుస్తకం - వాటి కవితల్లో చాలా సున్నితమైన అనుభూతుల్ని వ్యక్తపరుస్తాడు స్వామి - ఒక్కోసారి అనిపిస్తుంది. ఎందుకీ కవిత్వం? అందర్లా వందమందినైనా అణగ్గొట్టి మనొక్కళ్ళం పైకి లేచిపోవచ్చు కదా! రైల్లో పెట్టెలు తుడిచె కుర్రాణ్ణి చూస్తే ఎక్కువ ఆలోచించకుండా ఓ రూపాయి వాడి మొహాన కొట్టో... ఈ వెధవల్ని జైల్లో పడేయాలనో ఆవేశపడి మర్చిపోవచ్చు కదా... ఎపిసోడ్స్ ఎపిసోడ్స్‌గా ఈ భూమ్మీద నటించేయొచ్చు కదా!

అవును! మనుషులకి యిప్పుడు జీవితం కన్నా నాటకం ముఖ్యమైపోయింది. ఎక్కువైపోయింది. నటనకి ఉన్నంత విలువ జీవితానికి లేదు కానీ కవి కుదురుగా ఉండడు. ఈ కఠోరమైన మానవ సంబంధాల్లోకి మెత్తగా దిగుతాడు. ద్రవించి తీరతాడు. తడిగా అన్ని గుండెల్ని తాకడానికి తన్ని తాను నిరంతరం ద్రవీభవించుకుంటాడు. యిటువంటి ద్రవీభవన స్థానం ఈ స్వామి హృదయంలోనూ, కలంలోనూ నిక్షిప్తమై ఉంది.

విసిరేయబడ్డ... పరచబడ్డ... నరకబడ్డ... ఈ బడు ప్రయోగాలు కళ్లలో కంకరలాగా పడుతున్నాయి. కవిత్వంలో యిలాంటి కర్మణి ప్రయోగాలు పరిహరించుకోవడం అవసరం. కవిత్వపు 'పొత్తిళ్ళలోంచి' వచ్చిన స్వామి బలమైన కవిగా ఎదుగుతాడని ఆశిద్దాం.

**(కవిత్వపు పొత్తిళ్ళలోంచి - పి.ఆర్.ఎల్. స్వామి, వెల : రూ. 70/-, పేజీలు : 74, దొరుకుచోటు : ప్రజాశక్తి బుక్‌హౌస్, చిక్కడపల్లి, హైదరాబాద్)**

---

**ఎ. హరినాథరెడ్డి**



## శ్రమజీవుల సంకేతం "స్వేదాశ్రువులు"

"ఏ నినాదం వెనుక ఏ వర్గ ప్రయోజనం ఉందో గమనించు" అంటాడు మార్క్సిస్టు మహోపాధ్యాయుడు 'లెనిన్'. ఆచార్య ..ఎల్. శ్రీనివాసరెడ్డిగారి వచన కవితా సంపుటి 'స్వేదాశ్రువులు...!' లోన దాగి ఉన్నది పీడితులని, అణగారిన వర్గాలని, దగాపడిన జీవన స్వరూపాలని ప్రత్యేకంగా చెప్పుకొనే వీరి కవితా సంపుటి శీర్షిక తెలియజేస్తుంది.

కవిత్వం వ్యక్తిత్వానికి అద్దం పడుతుంది. మస్తిష్కపు పొరల్లో నిగూఢంగా దాగి ఉన్న భావనలు కాలక్రమేణా సమాజంతో స్పందించి, ప్రతిస్పందించి, విభేదించి కవిత్వమై ఆవిష్కృతమవుతాయి. ఈ కవి వృత్తిరీత్యా ఆచార్యులు, ప్రవత్తి రీత్యా కవి, భాషోద్యమ కార్యకర్త. తన కవితా సంపుటి స్వకీయంలో 'ముప్పైయేండ్లకు పై బడిన కవితా వ్యవసాయమిది, ప్రత్యక్షంగా లేదా పత్రికా గవాక్షాల ద్వారా చూసిన సంఘటనలే ఈ కవితలకు ప్రేరణలు' అన్నాడు.

ఈ సంపుటిలో మొత్తం నలభై కవితలున్నాయి. ప్రతి కవితను తనదైన శైలిలో, స్పష్టతతో, నిర్దిష్టంగా, కొత్త చూపుతో, వస్తు వైవిధ్యంతో దృశ్యమానం చేశాడు. శ్రీశ్రీ, తిలక్‌ల కవిత్వాన్ని విపరీతంగా అభిమానించే ఈ కవిపై వారి ప్రభావం తప్పని సరైందేమో అని ఈ సంకలనం చదివిన ఎవరికైనా అనిపిస్తుంది.

శీర్షికా కవిత 'స్వేదాశ్రువులు' -

"ఏ దేశానికీ లేదు / ఆ దేశం పేరుతో ఒక మహాసముద్రం/ ఈ దేశానికున్నట్లుగా / ఎందుకో తెలుసా? / ఏ దేశంలోనూ /

ఇంతమంది / జనాలు / జార్చలేదు / ఇన్ని చెమట బిందువులు / కార్చలేదు / ఇన్ని కన్నీటి బిందువులు / ఆ బిందువులేగా అయ్యిందీ హిందూ మహా సింధువుగా"

ఈ కవితలో స్వేదం శ్రమజీవుల శారీరక శ్రమకు సంకేతం, అశ్రువు మానసిక వ్యధకు సంకేతం. శ్రమజీవుల శారీరక, మానసిక సంక్షోభ సమ్మేళనమే ఈ దేశం అని, హిందూ మహాసముద్రాన్ని ప్రతీకగా చేసి ఎంతో ఆర్ద్రతతో వ్యక్తీకరించాడు.

ఒక క్లిష్టతను ప్రతిపాదించి, దాన్ని విస్తృతపరచి, అర్థయుతంగా సంపూర్ణం కావించడం కవిత్వ నిర్మాణాలలో ఒక ఉత్తమ పద్ధతి. పై కవితలో అదే చేశాడు ఈ కవి.

విలువలు పతనమై వికృత చేష్టలకు వేదికగా మారిన రాజకీయ పదవుల నుద్దేశించి 'నాడు – నేడు' కవితలో

"ముళ్ళకిరీటం / ఒకప్పుడు / మంత్రిపదవి / ఇప్పుడది / మగువ పెదవి / మధువుల చవి / నవ నిధుల తాళపు చెవి' అని అంటాడు.

దేశంలో పెరుగుతున్న జనాభా నుద్దేశించి 'మన స్థితిగతులు' కవితలో

'ఏ యేటికాయేడు / ఈ దేశం ఈనుతోంది

ఆస్ట్రేలియా అంత జనాభాను' అని తీవ్రంగా హెచ్చరిస్తాడు.

రోజుల పేర్లు ఆధారంగా మత సామరస్యాన్ని ప్రబోధించే 'చెట్టాపట్టాల్' కవితలో –

'శనివారం హిందువుణ్ణి నేను / చెట్టాపట్టాలేసుకుని / జీవితాన్ని సాగిస్తున్నాను / దశాబ్దాలుగా, శతాబ్దాలుగా / ఎడమ పక్క ఆదివారం 'క్రైస్తవునితో / కుడిపక్క శుక్రవారం ముస్లిముతో' అని చిత్రంగా కొత్త చూపు చూస్తాడీ కవి.

నేటికీ సజీవంగా వుండే కుల రక్కసి ఉన్న ఈ పల్లెభూమికి రానంటూ–

"ఎన్నో ఏళ్ళ కిందట / నేను వదలివచ్చిన / నా జన్మభూమికి తిరిగి వెళ్ళను గాక వెళ్ళను!' అని శపథం ప్రకటిస్తాడు దళితుని పక్షాన.

అవినీతిని హక్కుగా భావించే అధికారులకు 'మనం మనుషులం' అనే కవితలో చురక అంటించాడు కవి.

'ఎందుకూ పనికిరాని చెత్త కాగితాల్ని / ఏరుకొని తినే జంతువును / 'గాడిద' అని చీదరించుకొంటాం! / ఆకలి లేకున్నా అజీర్ణం చేసి ఉన్నా / అత్యంత విలువైన కాగితాల్ని / అదే పనిగా మేసే కొందర్ని / అధికారులని ఆదరిస్తాం!' అని చమత్కరించాడు.

స్త్రీల సమస్యల్ని ఈ కవి వ్యక్తీకరించిన తీరును చూస్తే ఈ కవి 'స్త్రీ పక్షపాతి' అని అనక తప్పదు.

'అతణ్ణి ఎందుకు అడగరు?' కవితలో

పెళ్ళి కాకుండానే నేను తల్లినెలా అయినానని మీ ప్రశ్న?

పెళ్ళి కాకుండానే అతను తండ్రి ఎలా అయినాడని ఎదురు ప్రశ్న??

అభినవ కుంతి అని నన్ను నిలదీస్తున్నారు

అభినవ సూర్యభగవానుణ్ణి అడగండి, నిలదీయండి' అని

తన కంఠస్వర తీవ్రతను తెలియజేస్తాడు. అనునిత్యం స్త్రీలు ఎదుర్కొనే సమస్యలను కళ్ళ ముందు నిలుపుతాడు – 'అద్దం' కవితలో

'ఆమె తిన్న తన్నులూ, పడ్డ పాట్లూ / ఆమె శరీరం, మనసూ చెప్పాలే తప్ప / చరిత్ర పుటలన్నీ కలిసినా చెప్పలేవు' అంటాడు.

ఇంకా తీవ్రతను చెబుతూ –

'ఆమె కట్టుబానిస / ఆమె దాసులకు దాసి / దేశంలోని అట్టడుగు మానిసి / ఈ దేశంలో ఏనాటి నుంచో / ఉతికి ఆరేయబడి ఇస్త్రీ చేయబడుతోంది స్త్రీ' అని స్త్రీల స్థితిగతులను చిత్రించాడు.

దేశానికి అన్నం పెట్టే రైతులను తక్కువ చూపు చూసే స్థితిని నిరసిస్తూ 'మీరెప్పుడు కలుస్తారు?' కవితలో

'చాలా సులభంగా, తిరస్కార సూచకంగా / నీవు ఏదో వ్యవసాయం చేస్తున్నావంటారే తప్ప / నీవు దేశానికి ఎనలేని సాయం చేస్తున్నావన్న / విషయాన్ని గుర్తించరెందుకు? / గౌరవ పురస్కార సూచకంగా నిన్ను ప్రశంసించరెందుకు?' అని ప్రశ్నిస్తాడు.

నదులలో వృధాగా పారే నీటిని వినియోగించాలని తెల్పుతూ 'సంపూర్ణ సస్యశ్యామలం' కవితలో

'ఉధృతంగా లేచి, వ్యర్థంగా పొంగి పొరలి / కడలి లోపల కలిసిపోయే నదుల నీటిని / భగీరథ ప్రయత్నం చేసి / కరువు ప్రాంతాలకు తరలిస్తే / కాదా దేశం / సంపూర్ణంగా సస్యశ్యామలం?' అని ఈ కవితా భగీరథుడు సూచిస్తాడు.

కవితా రంగస్థలంలో వచ్చిన వస్తువు మార్పుల్ని 'రంగస్థలం' కవితలో

'మొన్న గుడి / నిన్న జడ / నేడు అలజడి' అని అల్పాక్షరాల్లో అనల్పార్థాన్ని సృష్టించాడు.

మిత్రుని వంటి ఒక మంచి ముకురం ప్రయోజనాన్ని తెల్పుతూ 'ముకురం' కవితలో

'మనలోని సొగసుల్ని చూపుకోవడానికే కాదు

మనలోని లొసుగుల్ని రూపుమాపుకోవడానికి కూడా' అని అంటాడు.

భారతదేశ చిత్రపటాన్ని నాట్యమాడుతున్న నర్తకీమతల్లి భారతిగా పోల్చిన 'అవిశ్రాంత నాట్యం' కవిత కవి సునిశిత పరిశీలనా దృక్పథాన్ని చాటుతుంది.

ఒక గొప్ప ప్రయోజనం కోసం చేసే త్యాగాల్ని గుర్తు చేస్తు 'నల్ల కవి' కవితలో

జ్ఞాన బోధలో/సహకరిస్తుంది సుద్దతో నల్ల బల్ల / కావలసిందే రొట్టె / కానీ కాల్చుకొంటుంది తన తనువంతా పెనం' అంటాడు.

ఇదే కవితలో కవి అమరుడని తెల్పుతూ

'అతడు అక్షరాకృతి / అతన్ని ఉరి తీయలేరు / ఉరికంబమెకే ప్రతి కవి / ఉదయించి ఎరుపెక్కే రవి / అతడు ఛేదిస్తాడు చీకటిని సాధిస్తాడు వేకువను' అని కవిని విశ్లేషిస్తాడు.

ఈ సంపుటిలో ప్రతి కవితలోను జీవం తొణికిసలాడుతుంది ఇప్పుడిప్పుడే కవితా వ్యవసాయంలోకి దిగుతున్న యువకులకు దిక్సూచి 'స్వేదాశ్రువులు' కవితా సంపుటి అనడంలో అతిశయోక్తి లేదేమో. ఈ సంపుటికి అభినందనలు రాసిన సి.నా.రె., శేషేంద్ర, ఆచార్య హెచ్.ఎస్. బ్రహ్మానందల వ్యాఖ్యలు ఈ సంపుటికి సహజ ఆభరణాలు.

అక్షరాలను అచ్చెయ్యటమే తప్ప అమ్ముకోవడం తెలియని ఈ ఆచార్యుని 'స్వేదాశ్రువుల' రుచి తప్పక చూడాల్సిందే.

**(స్వేదాశ్రువులు, రచయిత : పి.ఎల్. శ్రీనివాసరెడ్డి వెల : రూ. 50/-, దొరుకుచోటు : ప్రజాశక్తి బుక్‌హౌస్, చిక్కడపల్లి హైదరాబాద్)**

**పసునూరి రవీందర్**




# కవి హృదయంలోని అపరాధ భావన 'నాయిన'

ప్రపంచీకరణ నేపథ్యంలో చిద్రమవుతున్న మానవ సంబంధాల్ని వెతుక్కుంటున్న సందర్భమిది. ఇటువంటి సందర్భాన తెగిపోతున్న పేగుబంధాల్ని ముడిపెట్టే ప్రయత్నం జరిగింది. అంతరిస్తున్న కుటుంబ సంబంధాల్ని, మరిచిపోతున్న మానవ విలువల్ని నిలబెట్టే కృషి 'నాయిన'. సాహిత్యంలో తండ్రి అనే భావనను పరిపూర్ణంగా ఆవిష్కరించిన సంకలనం 'నాయిన'. ప్రస్తుతం ఈ నాయిన సంకలనం, కవిత్వంలో తండ్రులకున్న స్థానాన్ని తెలియజేస్తున్నది. సాహిత్యకారులు తమ తండ్రుల్ని వివిధ కోణాల్లో స్మరించుకున్న తీరు, తలచుకున్న విధం మన కళ్ళ ముందుంటుంది. అన్ని దేశాలు ఒక్కలా లేనట్టే, అందరు తండ్రులు ఒక్కలా ఉండరు. అందుకే 'నాయిన' తండ్రుల్లోని విభిన్న పార్శ్వాల సంగమం అయింది. ఒకే వస్తువును స్వీకరించి 234 మంది కవులు విభిన్న రీతుల్లో వ్యక్తీకరించడం, అదంత ఒకేచోట లభించడం గొప్ప విషయం. నాన్నల స్వభావాల్ని, వ్యక్తిత్వాల్ని, అంతరంగాల్ని, అనుబంధాల్ని, అనుభూతుల్ని కొడుకులు ఒకసారి స్పృశించుకోవడానికి నాయిన' సంకలనం ద్వారా కవులకు ఒక మంచి అవకాశం లభించింది. తండ్రిని తలచుకోవడం ఇందులో రెండు విధాలుగా మనకు కనిపిస్తుంది. ఒకటి తండ్రి పోయిన తర్వాత తమకు తమ తండ్రి ఏం చేశాడో, రెండు బ్రతుకున్న తండ్రులు తమ ఎదుగుదలకు ఎలా ఆధారమయ్యేడో ఈ కవితల్లో అర్థమవుతుంది. కాలం మారుతున్న కొద్ది నాన్నల ఆలోచనల్లో, పిల్లల్ని పెంచే తీరులో మార్పు కనిపిస్తుంటుంది. పిల్లల ఇష్టాయిష్టాల్ని గ్రహించకుండా గమనించకుండా వ్యవహరించే తండ్రులు ఒకప్పుడు ఉన్నారు, ప్రస్తుతం కూడ ఉన్నారు. కాని ఆధునిక కాలంలో పిల్లల పెంపకం విషయమై మార్పు మాత్రం స్పష్టంగా కనిపిస్తుంది. అధునాతనంగా అందుబాటులో ఉన్న సౌకర్యాల్ని ఎలా తమ పిల్లలకి అందివ్వాలనే తపన ప్రస్తుత తండ్రుల్లో నిత్యం కనపడుతూనే ఉన్నది. ఏ సాహిత్యంలోనైనా తండ్రులకున్న స్థానం చాలా తక్కువ. ఏ కవి అయినా, రచయిత అయినా తనకు అత్యంత ఇష్టమైన వ్యక్తి గురించి రచన చేయాలనుకుంటే గుర్తుకొచ్చే వ్యక్తి అమ్మ. అలా అమ్మ ఎప్పుడో సాహిత్యంలోకి వచ్చింది. అమ్మ మీద కవితా సంకలనాలు, కథలు, నవలలు కూడా ఎన్నో వచ్చాయి. కానీ అందరు మరచిపోయిన మూలస్తంభం నాన్న. మరుగునపడి పోయిన మహనీయుడు నాన్న. అన్ని అందించి తెరవెనుకే మిగిలిపోయిన దర్శకుడు నాన్న, ఇంటిని నడిపించేందుకు ఏండ్ల తరబడి ఇంధనంలా ఖర్చయినవాడు నాన్న. అటువంటి నాన్నను సాహిత్యంలో వెదికితే ఎక్కడో అక్కడక్కడ మాత్రమే కనిపిస్తాడు. ఈ లోటు 'నాయిన' సంకలనం ద్వారా సగం తీరింది.

ఈ సంకలనం నిండా కొడుకుల సాక్ష్యాలు, తండ్రుల జీవితాలు, కష్టాలు కళ్ళముందు కదలాడతాయి. పుస్తకంలోని ప్రతి కవిత దేనికదే గొప్పగా ఉంది. తండ్రి గొప్పతనాన్ని ఒక కవితలో వ్యక్తీకరించేందుకు కవులందరు పడ్డ శ్రమకు అభినందనలు చెప్పాలనిపిస్తుంది. ఒక్కో కవి వాడిన ఉపమానాలు కొత్తగా ఉన్నాయి. ఎవరికి వారే పోటీపడ్డట్టు కొత్త ఎక్స్‌ప్రెషన్స్‌ని ప్రదర్శించారు. ఈ మొత్తం కవిత్వంలో స్త్రీవాదులైన కవయిత్రులు కూడా తమ నాన్నల్ని అద్భుత రీతిలో స్మరించారు. వివక్ష చూపించని తండ్రులతో పాటు, వివక్షకు గురిచేసిన తండ్రుల్ని కూడా కవయిత్రులు తమ కవితల్లో వ్యక్తీకరించారు.

ఆయా సామాజిక నేపథ్యాల నుండి వచ్చిన సాహిత్యకారులు తమ జీవన పయనంలో తండ్రి కృషిని ఒకసారి వెనక్కి తిరిగి చూసుకున్నారు. ఈ సంకలనంలో ఎక్కువమంది కవులు గ్రామీణ నేపథ్యం కల్గి ఉన్నట్లు తమ కవితలు తెలియజేస్తున్నాయి. వ్యవసాయిక కుటుంబాల నుండి వచ్చిన వాళ్ళు చదువుకొని ఉద్యోగాల్లో స్థిరపడ్డాక, తాము ఎదిగి వచ్చిన దారుల్ని, ఆ దారుల్లో నడకలు నేర్పిన తండ్రుల్ని తమ కవితల్లో తలచుకున్నారు. వ్యవసాయంలో తండ్రి పడ్డ కష్టాన్ని, తమ ఎదుగుదలకు ఆ శ్రమ జతైన తీరును కళ్ళముందుంచారు. ఆ గుర్తుల్ని చూస్తే ఇప్పటికి తండ్రి కళ్ళముందుంటాడనే భావ గాఢతని వెలిబుచ్చారు. ఆత్మీయులు దూరమైనపుడు ఉబికి వచ్చే కవిత్వం సాధారణంగానే కొంత ఎమోషన్‌ని కలిగి ఉంటుంది. అదే క్రమంలో జన్మనిచ్చిన తండ్రి, తమను ఈ స్థితికి తీసుకువచ్చిన తండ్రిని బలమైన వ్యక్తీకరణలతో కవిత్వంలో చిత్రించడం ఈ సంకలనంలో చోటు చేసుకుంది. అలాగే కూలీలుగా తమ తల్లిదండ్రుల్ని, కష్టించి తమను పెంచిన తీరును కూడా ఇందులోని కవులు మంచి పోలికతో వర్ణించారు. ఎక్కువమంది కవులు తమ తండ్రుల్ని పొగడటం వరకే పరిమితమయ్యారు. కానీ సీతారాం గారన్నట్లు ఏ ఒక్క కొడుకు నాన్నని తిట్టలేదని, తిరస్కరించలేదని, నాన్నని అర్థం చేసుకోలేకపోయానని, నాన్నని నానా బలహీనతలతో మన్నించలేకపోయానని, ఒక అపరాధం చేశానని రాసుకోకపోవడం కవుల లోపం. అయితే ఇందులో ఉన్న కవిత్వం మాత్రం వాసిలోను, రాశిలోను పెద్ద మొత్తంగా ఉంది. పుస్తకానికి చిత్రకారుడు అక్బర్ గీసిన ముఖచిత్రం అందంగా కుదిరింది. ఒక మహా సంకలనాన్ని అందించిన ఘనత సంపాదకుడు 'అన్వర్'కు దక్కుతుంది. ఈ పుస్తకం చదివిన వాళ్ళు అన్వర్‌ని అభినందించకుండా ఉండలేరు. తండ్రి విలువేమిటో, తండ్రి పిల్లల కోసం, కుటుంబం కోసం పడే కష్టమేమిటో, విభిన్న కోణాలు తండ్రిలో ఎలా ఉంటాయో తెలుసుకోవాలంటే ఈ పుస్తకం చదవాల్సిందే. సంపాదకుని ముందుమాటలో చెప్పినట్లు 812 కవితల నుండి కేవలం 234 కవితల్ని ఎంపిక చేశారంటే సంకలనం యొక్క నాణ్యతను పాఠకులు అర్థం చేసుకోవచ్చు.

తెలుగు సాహిత్యంలో నిలిచిపోయే సంకలనాల సరసన 'నాయిన' చేరుతుంద నడంలో ఎటువంటి సందేహం లేదు.

**('నాయిన' - కవితా సంకలనం, సంపాదకుడు : అన్వర్, ప్రతులకు : సృజనలోకం, ప్రశాంతి క్లినిక్, 16-10-1294, శివనగర్, వరంగల్-2. అన్ని పుస్తక కేంద్రాలలో. పేజీలు : 506, వెల : రూ. 150/-)**



అద్దేపల్లి రామమోహనరావు

## 'ప్రతిభ - ఇమాజినేషన్'లపై ఆసక్తి కలిగించే సిద్ధాంత వ్యాసం

**లో**కంలో అందరూ అనుభూతులు పొందుతారు. కాని సృజనశీలి మాత్రమే, అనుభూతులకు ఉదాత్తమైన ఆకారం ఇచ్చి, అందరికీ పంచగలడు. సృజనశీలిలో ఉన్న ఈ శక్తిని గూర్చి ప్రపంచవ్యాప్తంగా పూర్వం నించి ఈనాటిదాకా అనంతమైన ఆలోచనలు, చర్చలు సాగుతూనే ఉన్నై. ఈ సర్వాలోచనల్లో రెండు భావనలకు గొప్ప గుర్తింపు లభించింది. అవే ప్రతిభ, ఇమాజినేషన్. ప్రాచ్య అలంకార శాస్త్రజ్ఞుల ప్రతిపాదనల సారం ప్రతిభ, పాశ్చాత్య సృజన, సౌందర్యవేత్తల ఆలోచనల సారం ఇమాజినేషన్. ఈ రెండు సిద్ధాంతాల్నీ తులనాత్మకంగా పరిశీలిస్తూ, డాక్టర్ అమరవాది నీరజ రాసిన సిద్ధాంతవ్యాసమే 'ప్రతిభ – ఇమాజినేషన్'.

కావ్య హేతువుల్ని గూర్చి, అలంకార శాస్త్రవేత్తల అభిప్రాయాలన్నీ రచయిత్రి చెప్పారు. భరతుడు మొదలుకొని, భామకుడు, ఆనందవర్ధనుడు, రాజశేఖరుడు, జగన్నాథ పండిత రాయలు మొదలైన వారినే గాక, రామలింగారెడ్డి, విశ్వనాథ, శేషేంద్రల భావాల్ని కూడా చెప్పారు. ఈ అందరివీ ముఖ్యమైన శ్లోకాలు, వాక్యాలు ఉదహరించారు. అలంకార శాస్త్రజ్ఞులు ప్రతిభ, వ్యుత్పత్తి, అభ్యాసనలు – అనే మూడు కారణాల్ని గూర్చి చెప్పారు. అందులో 'ప్రతిభ'కి అందరూ ప్రథమస్థానం ఇచ్చారు. అయితే, దీన్ని పూర్వజన్మ ఫలితంగా వారు భావించారు. ప్రతిభను కూడా సాధించవచ్చునని చెప్పిన హేమచంద్రుడు, 'సమాధి' అందుకు కారణమని చెప్పాడు. ఈ 'సమాధి' అనే పదం చాలామంది ఉపయోగించారు. దీన్ని రుషిత్వంగా చెప్పడం, వారి విశ్వాసమే గాని, 'సమాధి' అంటే వర్ణనీయ వస్తువులో లీనం కావడమే. అది ఎంత ఎక్కువగా ఉంటే అంతగా కవి రాణిస్తాడు. ఎప్పటికప్పుడు అపూర్వమైన భావాలు రావడమే 'ప్రతిభ' అన్నది అలంకార శాస్త్రజ్ఞుల ప్రధానమైన నిర్ణయం. దీనికి పూర్వజన్మల్నీ, తపస్సునీ, మంత్రాల్నీ కారణాలుగా చెప్పడం అకాలపు విశ్వాసాల వల్లనే. రచయిత్రి వాటిని కూడా స్వీకరించవలసిన అవసరం లేదు. ఎందుకంటే, శాస్త్రీయమైన ఆలోచనలు అలంకార శాస్త్రాల్లో తార్కికంగానే ఉంటై.

తరువాత, పాశ్చాత్య తత్వవేత్తలైన ప్లేటో, అరిస్టాటిల్, మండికాంట్, హెగెల్, కోలరిడ్జ్, వర్డ్స్‌వర్త్, షెల్లీ దాకా అందరూ 'ఇమాజినేషన్' గూర్చి చెప్పిన అభిప్రాయాల్ని రచయిత్రి వివరించారు. మన శాస్త్రజ్ఞులు 'ప్రతిభ' అన్నదాన్నే సుమారుగా వారందర 'ఇమాజినేషన్' అని పేర్కొన్నారు. రచయిత్రి ఇరువురి భావాల్నీ వివరిం యిలా అంటారు.

'ఈ సమీక్షకు ఫలం భారతీయుల ప్రతిభ అనే కా హేతువులో పాశ్చాత్యుల ఇమాజినేషన్, ఫాన్సీ, జీనియస్ మొదల అంశాలన్నీ గతార్థాలవుతాయని నిర్ణయించడమైనది.'

'ఈ పుస్తకంలో అలంకారాలు, భావచిత్రాలు, ప్రతీకలు గూర్చి ఒక వ్యాసం కూడా ఉంది.

ఒక మంచి అంశాన్ని తీసుకుని, అవసరమైన ఆలోచన కలిగించేందుకు కృషి చేసిన రచయిత్రిని అభినందించవలసిందే గా ఈ పుస్తకం చాలా అసమగ్రమనిపిస్తుంది. ప్రతిభ, ఇమాజినేషన్ గూ ప్రపంచవ్యాప్తంగా అనేక చర్చలతో, అసంఖ్యాకమైన పుస్తకాలు, వ్యాసా వచ్చినై. మౌలికమైన ప్రతిపాదనలూ, మనస్తత్వ శాస్త్ర వ్యాఖ్యానాల ఉన్నై. 'ప్రతిభ – ఇమాజినేషన్' అన్నది చాలా చిన్న పుస్తకం. అందు చాలావరకు ఎవరు ఏమి చెప్పారన్నదే ఎక్కువ స్థానం ఆక్రమిస్తుం వాటిపై మౌలికమైన ఆలోచనలు కనిపించవు.

ప్రాచ్య పాశ్చాత్యుల అనేక ఉటంకింపులు ఇవ్వడం, ఒ ముఖ్య విషయం మీద పాఠకులకు ఒక అభిప్రాయం కలిగించడం 'ప్రతిభ – ఇమాజినేషన్' ఆసక్తితో చదివించే పుస్తకమవుతుంది.

**(రచయిత్రి : డా॥ అమరవాది నీరజ, వెల : రూ. 45/ కాపీలకు : మైత్రీ బుక్స్, హైదరాబాద్-38, ప్రజాశక్తి బుక్‌హౌ హైదరాబాద్, నవోదయ బుక్‌హౌస్, హైదరాబాద్)**

నిశాపతి




## ప్రశంసనీయమైన మార్గదర్శిని - అనువాద దర్శిని

**క**థా ప్రధానమైన వచన గ్రంథాల్ని అనువదించినంత సులువు కాదు. కవిత్వాన్ని అనువదించడం, కవిత్వంలో ఒక్కో ప్రత్యేక వర్గానికి ఒక్కో ప్రత్యేక అభివృద్ధి ఉంటుంది. ఇక్కడ వర్గం అంటే సామాజిక, ఆర్థిక వర్గం అని మాత్రమే కాదు. దేశం, భాష, జెండర్ యిలా ఎన్నిటికో ప్రతీక ఆ పదం. ఆ అభివ్యక్తిని భిన్న వర్గానికి అందేలా చేయడానికి భాష ఒక్కటే సరిపోదు. కాని దురదృష్టవశాత్తు అదొక్కటే మన చేతిలో ఉ పనిముట్టు.

కాని, అలా అని చేతులు ముడుచుకు కూచుంటే ప్రప మహా కవులంతా తమ ఇరుకు గదుల్లోనే ఉండిపోయేవారే! వీలయిన మూల మైత్రికంగా (Original Friendly) ఒక భాషలో కవి సౌందర్యాన్ని వేరొక వారికి అందించడమే అనువాదం చేయవలసిన ప మూల విధేయంగా కాదు.

ఈ ఆవశ్యకత 'తెలుగు' వంటి ఒక అత్యంత పరిమితమై వ్యాప్తి గల ప్రాంతీయ భాషకి మరింత ఎక్కువగా ఉంది. ఆ కొ తీర్చడానికి రచించిన ఈ గ్రంథం బాగా ఉపయోగపడుతుంది.

'అనువాద దర్శిని' అనే పేరు గల ఈ గ్రంథంలో చా వైవిధ్యం ఉంది. అనువాదంలోని కష్టనష్టాలు, దానికి కావల నికషోపలాలు వగైరా చర్చించే మంచి వ్యాసాలు ఒకవైపు ఉండే స్త్రీ పార్శ్వాన్ని ప్రదర్శించే ముక్తక కవితలు, మరికొన్ని ఆధు కవితలు, క్లాసిక్స్ – (ఆముక్తమాల్యద, పాండురంగ మహాత్మ్య

పారిజాతాపహరణం - ఈ మూడింటిలోని కొన్ని ఘట్టాలు), వీటి అనువాదాలు మరోవైపు వున్నాయి. తెలుగు మూలాన్నీ, ఆంగ్ల అనువాదాన్నీ పక్క పక్క పేజీల్లో ముద్రించడం మరో ప్రత్యేకత.

రామారావు తన ముందుమాటలో ఒక విషయాన్ని స్పష్టంగా చెప్పారు. తను ప్రధానంగా 'మన దేశంలోని యితర రాష్ట్రాల చదువరుల'ను దృష్టిలో పెట్టుకున్నాననీ, 'విదేశీ చదువరులను ఆకర్షించడం' తన ఉద్దేశం కాదనీ విశదం చేశారు. ఆ నేపథ్యంలో వీరి అనువాదాల్ని పరిశీలించాలి.

అయితే రామారావు విదేశీ పాఠకుణ్ణి దృష్టిలో పెట్టలేదనడం బాగానే ఉంది. కాని దీనిని మొదటి మెట్టుగా మాత్రమే స్వీకరించాలి. సాహిత్యంలో నోబెల్ బహుమతి పొందింది భారతదేశంలో అప్పటికీ, ఇప్పటికీ టాగూర్ ఒక్కడేగా! ఈ పరిస్థితి ఎందుకు ఏర్పడింది? మన దేశంలో ప్రతిభావంతులైన కవులు లేక కాదు.

అనువాదం అనేది అనువాదకుడి కోణం నుంచి చూస్తే పెద్దగా వర్కవుటయ్యే అంశం కాదు. పైపెచ్చు Thankless Job. ఇటువంటి పరిస్థితుల్లో 'కవిత్వం రాయగలిగినంత ఆంగ్ల పరిజ్ఞానం' కలవారు మంచి కవితల్ని అనువాదం చేయడానికి ముందుకు రావాలి. ఏదో Prosaic గా అక్కడున్న మాటలకు సమానార్థమైన మాటలు 'కట్టించడం' కాదు అనువాదం. ఇంచుమించు ఆ కవిత ఒరిజినల్‌గా ఆంగ్లంలోనే రాయబడిందేమో అన్న భ్రమ కలిగించాలి. అదే ఉత్తమ అనువాదానికి గీటురాయి.

అటువంటి ప్రతిభా వ్యుత్పత్తులు గలవారు ఎందరో తెలుగువారిలో ఉన్నారు. కాని వారి దృష్టి అనువాద ప్రక్రియ మీద ఎందుకో ప్రసరించడం లేదు! ప్రసరిస్తే తెలుగులోని ఉత్తమ కవిత్వంలో అధిక శాతం ఈపాటికి ఆంగ్లంలోకి వెళ్ళిపోయి ఉండేవే.

ఆ శుభ దినం కోసం ఎదురు చూద్దాం.

**(అనువాద దర్శిని, రచయిత : వి.వి.బి. రామారావు, పేజీలు : 196, వెల : రూ. 53/-) ప్రతులకు : విశాలాంధ్ర బుక్‌హౌస్, హైదరాబాద్),**

**...ంపశయ్య నవీన్**

# జంఝావతి కథలు




శ్రీకాకుళ సాహితి వారు ఇదివరకు 'వంశధార కథలు' పేరుతో ఉత్తరాంధ్ర ప్రాంతానికి చెందిన కొందరు కథకుల కథల్ని ఒక సంకలనంగా ప్రచురించారు. ఇప్పుడు వీరే 'జంఝావతి కథలు' అన్న పేరుతో ఇదే ప్రాంతానికి చెందిన కథకుల కథల్ని మరోసారి ప్రచురించారు.

ఉత్తరాంధ్ర ప్రాంతానికి కొన్ని ప్రత్యేకమైన సమస్యలున్నా యనీ, ఆ సమస్యల్ని చిత్రించిన కథకుల కథల్నే ఈ సంకలనాల్లో ప్రచురించామనీ శ్రీకాకుళ సాహితీ సంస్థవారు చెప్పుకున్నారు.

'నాగేటి చాలు...' అనే పేరుతో ఈ 'జంఝావతి కథలు'కు రాసిన ముందుమాటలో సంపాదకులు ఉత్తరాంధ్ర ప్రాంతాన్ని గూర్చి ఇలా చెప్పారు.

"ఇది నీరు లేని రాయలసీమ కాదు. నిజాం పాలనలో మూలుగులు పీల్చి అయిపోయి, దారిద్ర్యంతో కునారిల్లిన పేద భూమి కాదు.

అయినా - ఆ రెండు ప్రాంతాల్లో లేదా అంతకుమించీ వెనుకబడిన ప్రాంతమైంది. సాగునీటి ప్రాజెక్టులు లేవు. తాగునీటి కొళాయిల్లేవు. విద్యకు విద్యాలయాలు లేవు. విద్యాధికులకు కొలువుల్లేవు. కర్మాగారాల్లేవు.. కార్మికుల కడుపులకు మెతుకుల్లేవు. ఆసుపత్రులు లేవు. ఉంటే వైద్యులూ, మందులూ ఉండవు. ఈసురోమని ఈ నేల... యేడుస్తోందర్రా నాయిన్లారా..."

ఈ ప్రాంతం బాగుపడాలంటే యేం జరగాలో కూడా చెప్పారు.

"నాగేటి చాళ్ళు మీద నాగలి పట్టినోడే శాసనకర్త కావాల. అంతదాకా ఈ దుఃఖం తప్పదు. ఈ నెత్తురు తప్పదు. ఈ యుద్ధం ఆగదు. ఈ మట్టిపొరలు, పొరల గురించి, దాని చుట్టూ వున్న సకల జీవుల గురించీ ...కితం కావటానికి మించి అక్షరానికి కర్తవ్య మేముంది? నాయిన్లారా, కలలను నాగేటి చాళ్ళల్లో నడిపిద్దామర్రా, నడిపిద్దాం. అపుడన్ని మంచి బతుకులు పండుతాయి. మంచిరోజులు వస్తాయి.

ఈ ప్రాంతానికి వ్యవసాయం ముఖ్యంగా రైతులు అభివృద్ధి చెందకపోవడమే ప్రధాన సమస్య అని పై వాక్యాలు చదివితే అర్థమవుతుంది. ఈ కారణం చేతనే ఈ జంఝావతి కథల్లో చోటు చేసుకున్న చాలా కథల్లో రైతుల సమస్యల్నే చిత్రించడం కనిపిస్తుంది.

ఈ సంపుటిలో మొత్తం 21 కథలున్నాయి. కథకులందరూ ఉత్తరాంధ్ర ప్రాంతానికి చెందినవారే. ఈ సంపుటిలోని మొదటి కథ 'అన్నెమ్మ నాయురాలు'. ఈ కథను సీనియర్ మోస్ట్ కథకుడు కాళీపట్నం రామారావు రచించాడు.

ఈ కథను రచయిత ఉత్తమ పురుషలో చెప్పారు. అన్నెమ్మ నాయురాలు అనే ఓ రైతు కుటుంబానికి చెందిన స్త్రీ ఈ కథలో ప్రధాన పాత్ర. దేశానికి స్వాతంత్ర్యం రాకముందు నుండి మొదలెట్టి స్వాతంత్ర్యం వచ్చాక ఉత్తరాంధ్ర ప్రాంతంలోని వ్యవసాయ రంగంలో ఉత్పన్నమైన అనేక పరిణామాల నేపథ్యంలో అన్నెమ్మ నాయురాలు అనే ఓ రైతు జీవితాన్ని ఈ కథలో రచయిత చిత్రించాడు.

అన్నెమ్మ నాయురాలు తన పొలాల్లో వ్యాపార పంటలు పండించడానికి వ్యతిరేకి. మిగతా రైతులు వ్యాపార పంటలు పండించి దెబ్బతిన్నారు. అన్నెమ్మ నాయురాలు ఈ ప్రమాదాన్ని గమనించి జాగ్రత్త పడింది. కానీ ఆమె మునిమనవడు మాత్రం వ్యాపార పంటల్నే పండిస్తానని ఆమెకు ఎదురు తిరుగుతాడు. ఈ ముని మనవడి ధాటికి ఆమె ఎదురు నిలవలేకపోయింది.

ఈ కథను రచయిత ఇలా ముగిస్తాడు.

"దేశాభివృద్ధి అంటే సంపద అభివృద్ధి. దానికి మూలవిరాట్లు శ్రామికులు. ఆ శ్రామికుల శ్రమశక్తి దోపిడీ కావడంతో పాటు, వారిలో శ్రమశక్తి పట్ల గౌరవం లుప్తమై, లుచ్ఛాలను వారి జీవితోద్ధారకులుగా, ఆటగాళ్ళను వారి దేవతలుగా ఆరాధించే విధంగా దిగజారడం నన్ను చాలా బాధిస్తుంది. అంతకన్నా గ్రామాలను విముక్తం చేసి నగరాలను ముట్టడించడం విప్లవమార్గమని చెప్పిన మావో సూత్రీకరణను అపార్థం చేసుకుంటున్న ప్రజా పోరాట నాయకులను చూస్తే గుండె చెదురుతుంది.

సన్నకారు రైతులు మధ్య దళారులను నమ్మే స్థితికి రావడం, వాళ్ళను ఉద్ధరించాల్సిన ప్రజా పోరాట నాయకులు కూడా వాళ్ళను ఉద్ధరించలేకపోవడమనే వాస్తవాన్ని రచయిత ఈ కథలో చిత్రించాడు. అయితే ఈ కథ చాలా చోట్ల వ్యాసంలా మారిపోతుంది.

కొప్పుల భానుమూర్తి రచించిన "కళింగ ఎక్స్‌ప్రెస్" అన్న కథలో ఓ ట్రెయిన్ యాక్సిడెంట్‌కు సంబంధించిన ఉదంతం చిత్రించబడింది. ఒక లైన్ మీదికొచ్చిన రెండు ట్రెయిన్లు ఒకదానితో ఒకటి ఢీకొనడంతో అనేకమంది ప్రయాణీకులు చనిపోతారు. ఈ యాక్సిడెంట్‌కు తనే కారణమనుకుంటూ స్టేషన్ మాస్టర్ ఇలా విలపిస్తాడు.

"ఇంత ఘోరం నేనెప్పుడూ చూళ్ళేదు. నా సర్వీసులో ఇదే మొదటిసారి. ఇంతమంది చావుకి కారకుణ్ణి నేనే..నేనే...నేనేనా? ఎందుకో నా బుర్ర సరిగ్గా పనిచేయలేదు అట్నుంచి కేంద్రమంత్రిగారి బండి. దానికి ముందు లైనివ్వాలి. ఇచ్చానురా... ఇచ్చానా.. ఆహ ఇవ్వలేదు. ఇట్నించి సి.ఎం. గారి

బండికిచ్చాను. సరిగ్గా అదే టైములో పార్లమెంట్ ప్రతిపక్ష నాయకుడి జన చైతన్య యాత్రా బండి స్టేషన్‌లోనే పబ్లిక్ మీటింగ్. అంతా గందరగోళం..."

చాలా ట్రెయిన్ యాక్సిడెంట్స్‌కి రాజకీయ నాయకులే కారణమన్న ధ్వని ఈ కథలో ఉంది.

తయ్యా వెంకట రమణమూర్తి రచించిన "వేరు పాట్లు" అనే కథలో వేలమంది శ్రామికులు చేసే పనిని కొన్ని గంటల్లో చేసేసే ప్రొక్లెయినర్‌లాంటి యంత్రాలు రావడం వల్ల గ్రామీణ ప్రాంతాల్లో నిరుద్యోగ సమస్య ఎలా జఠిలమైపోతున్నదో చిత్రించబడింది.

పి. కమలకుమారి రచించిన "భస్మ సింహాసనం" కథలో ఒక కర్మాగారాన్ని నిర్మించడం కోసం ఎంతమంది పేదవాళ్ళను భూస్థాపితం చేయాల్సి వచ్చిందో రచయిత్రి చూపించింది.

గంటేడ గౌరునాయుడు రచించిన 'ముంపు' కథలో కూడా ఒక పెద్ద నీటి పారుదల ప్రాజెక్టు నిర్మాణం కోసం ఎన్ని పల్లెల్ని నీట్లో ముంచాల్సి వస్తుందో చిత్రించబడింది. ముంపుకు గురయిన ప్రజలకు ప్రభుత్వం వారిచ్చే నష్టపరిహారాన్ని గూర్చి వాళ్ళు ఎంత అమాయకంగా కలలుగంటారో రచయిత ఈ కథలో సమర్థవంతంగా చిత్రించాడు. సంపుటిలో ఉన్న మంచికథల్లో ఈ కథను ప్రత్యేకంగా చెప్పాలి.

ఎన్. రమణమూర్తి రచించిన "రెక్కని సాగని కథ" శక్తికి మించిన అప్పులు చేసి భంగపడ్డ ఓ టీచర్ని గూర్చి చెబుతుంది.

జి.ఎస్. చలం రచించిన 'పొగ' కథ ప్రైవేట్ పాఠశాలలూ, ప్రైవేట్ బస్సులూ విరివిగా రావడంతో ప్రభుత్వ పాఠశాలలు, ఆర్టీసీ బస్సులు ఎలా దెబ్బతిన్నాయో చెబుతుంది. ప్రైవేట్ పాఠశాలల యాజమాన్యాలు బాగా చదువుకున్న నిరుద్యోగుల్ని ఎలా దోచుకుంటాయో కూడా ఈ కథలో చిత్రించబడింది.

ఎ.వి. రెడ్డి శాస్త్రి రచించిన 'అస్తమయం' కథ గురయ్య, లచ్చయ్య అన్న ఇద్దరు వృద్ధుల కథను చెబుతుంది. వీళ్ళు కన్న కొడుకులు వీళ్ళను పట్టించుకోకుండా పట్టణాలకు వెళ్ళిపోతారు. ఒకరికొకరు తోడవుతూ బతుకుతున్న ఈ ఇద్దరు వృద్ధులు ఒకే రోజు కూడబలుక్కొని పోయినట్టుగా ఈ ప్రపంచంలోంచి శాశ్వతంగా వెళ్లిపోతారు.

స్కూలుకెళ్ళడం ఇష్టంలేని ఓ గిరిజన కుర్రాడ్ని బలవంతంగా గిరిజనుల కోసం నడుపబడుతున్న ఓ ప్రభుత్వ ఆవాస పాఠశాలలో చేర్పిస్తారు. ఆ కుర్రాడి పేరు చిరంజీవి. చిరంజీవికి జబ్బు చేస్తుంది. హాస్టల్ వార్డెన్ అతని ఆరోగ్యం పట్ల సరైన జాగ్రత్తలు పాటించకపోవడం వల్ల చిరంజీవి చనిపోతాడు. గిరిజనుల కోసం స్థాపించబడిన ఈ ఆవాస పాఠశాలలు హెడ్‌మాస్టర్ల, వార్డెన్ల జేబులు ఎలా నింపుతున్నాయో ఆప్త చైతన్య రచించిన 'చెలగాటం' కథ చిత్రిస్తుంది.

ప్రళయావతీ నది మీద నిర్మించబడుతున్న ఆనకట్ట కారణంగా ఏర్పడే రిజర్వాయర్‌లో ఎంతో మంది ఆదివాసీల ఆవాసాలు ముంపుకు గురవుతాయి. ఈ ప్రాజెక్టు డిజైన్ మార్చటం వల్ల ఎక్కువ గ్రామాలు ముంపుకు గురయ్యాయని తెలిసిన ఆదివాసీలు పెద్ద ఆందోళనకు పూనుకుంటారు. ఆందోళన అదుపు తప్పడంతో పోలీసులు కాల్పులు జరుపుతారు. అట్టాడ అప్పల్నాయుడు రచించిన "ప్రా.....?" అన్న కథ ఇతివృత్తంతో సాగుతుంది.

ఇలా ఈ సంపుటిలో చోటు చేసుకున్న ప్రతీ కథలోనూ ఉత్తరాంధ్ర ప్రాంతపు యేదో ఒక సమస్యకు కథా రూపం ఇవ్వడం కనిపిస్తుంది. అక్కడి ప్రజల జీవనశైలిని, అక్కడి ప్రజలు మాట్లాడే భాషనూ ఈ రచయితలు తమ కథల్లో మాట్లాడే భాషనూ ఈ రచయితలు తమ కథల్లో చక్కగా జొప్పించగల్గారు. సాహిత్యంలో ప్రాంతీయ స్పృహ బాగా పెరిగిపోతున్న ఈ తరుణంలో ఇలాంటి కథా సంకలనాల ఆవశ్యకత ఎంతైనా ఉంది.

**(జంఝావతి కథలు : ఉత్తరాంధ్ర కథకుల కథల సంకలనం, ప్రచురణ : శ్రీకాకుళ సాహితి, 'హరిత', విశాఖ ఏ కాలనీ, శ్రీకాకుళం-532 001, ప్రతులకు : మైత్రీ బుక్‌హౌస్, మసీదు వీధి, కార్ల్‌మార్క్స్ రోడ్, విజయవాడ-520 001, పేజీలు : 204, వెల : రూ. 100/-)**

---

# సమీక్షలపై మనవి

ప్రస్థానంలో సమీక్షలు రావడంలో జాప్యానికి సంబంధించి అనేక మంది రచయితలు దృష్టికి తెస్తున్నారు. పుస్తకాలు ఎక్కువగా రావడం, సమీక్షకోసం తీసుకున్న మిత్రుల జాప్యం వంటి కారణాలు తప్ప ఇందుకు వేరే కారణాలుండవు. సమగ్రంగానూ, సంతృప్తికరంగానూ చేయాలన్న తపన కూడా కొన్నిసార్లు జాప్యానికి కారణమవుతుంటుంది.

అన్నిటినీ మించి ప్రస్థానం ఇప్పటికి మూడు మాసాలకొకసారి వెలువడే పత్రికే గనక స్థలాభావం సమస్య వుండనే వుంటుంది. రచయితలు ఎంతో అభిమానంతో పుస్తకాలు పంపుతుంటారు. రెండేళ్లకు పై బడని పుస్తకాలపై సమీక్షలు వెలువరించగలమని లోగడ తెలియజేశాం. ఇప్పటికీ ఆ పద్ధతిలోనే ముందుకు సాగుతున్నాం. కాని యంత్రాంగం లోపం వల్ల, సమీక్షకు తీసుకున్న వారు సకాలంలో ఇవ్వలేక పోవడం వల్ల జాప్యం జరుగుతుంటుంది.

ప్రస్థానంలో ప్రధానంగా సమకాలీన రచనలపై చర్చ జరగాలనే భావిస్తున్నాం. అందుకే సమీక్ష శీర్షికలోనే గాక నచ్చిన రచన, పరిశీలన, విశ్లేషణ వంటి వివిధ రూపాలలో పుస్తకాలపై చర్చకు అవకాశం కల్పిస్తున్నాం. కనక రచయితలు కేవలం ఆ శీర్షికలో రానంత మాత్రాన రాదని భావించనవసరంలేదు. మరింత వివరంగా రావడానికి ఇతర శీర్షికలను ఉపయోగించే అవకాశముంటుంది. సాహితీ మిత్రులెవరైనా ఈ వివిధ రూపాలలో రాస్తే పరిశీలించి రెండు పేజీలకు మించకుండా వుండాలి.

ప్రస్థానం మౌలిక సూత్రాల పరిధిలో విమర్శలు, అభినందనలూ ఏమి వచ్చినా లౌకిక ప్రజాస్వామిక రచనలన్నిటికీ చోటుంటుంది. రచయితల అనుబంధాలను బట్టి గాని, ఇతర అంశాలను బట్టి కాని సమీక్షించకపోవడం అన్న ప్రసక్తి వుండదు.

కొంతమంది మిత్రులు చిరునామాలు పంపించి పుస్తకాలు తెప్పించుకుని సమీక్షలు చేశారు. వారికి కృతజ్ఞతలు. ఈప్రక్రియ ఇకముందు కూడా కొనసాగుతూనే వుంటుంది. ఇకపైన కొంత సంక్షిప్తంగానైనా ఎక్కువ సమీక్షలు ఇవ్వడానికి ప్రయత్నిస్తాం. కొన్ని పత్రికలో వలె చిన్నవిగా వెంటనే సమీక్షలు వేస్తే మంచిదా అన్న విషయమై అభిప్రాయాలు కోరుతున్నాం.

మొత్తంపైన రాబోయే సంచిక నుంచి మరింత క్రమబద్ధంగానూ, ఇంకా ఎక్కువగానూ సమీక్షలకు చోటు కల్పించడానికి కృషి చేయగలం.

**- ఎడిటర్**

33

# బతుకు మొదలయిందే ఇప్పుడు



యాళ్ల అచ్యుత రామయ్య

"చేటలో బియ్యం పోసుకుని నెమ్మదిగా వరండాలోకి వచ్చి, బాగా వెలుతురుగా ఉన్న చోటు చూసుకుని కూర్చుంది తులసమ్మ. కాళ్ళు చాపుకుని, చేటను ఒడిలో పెట్టుకుని రాళ్ళు ఏరడానికి ప్రయత్నించింది. అంతా అలికినట్లయినా ఏమి కనిపించడం లేదు. ఈ మధ్య కాలంలో చూపు మరీ మందగించ డంతో, కాస్త దూరంగా ఉన్న వాళ్ళని కూడా పోల్చుకోవడం ఆమెకి కష్టంగా ఉంటోంది.

కొడుకు వెంకట్రావు తెలగపిండిని కుంచంలో నింపుకుని బయటికి వస్తుండటం గమనించిన తులసమ్మ "ఒరే యేంకట్రావో, నా కళ్లజోళ్లో అద్దంవోటి పగిలిపోయిందిరా. నీకు ఈలయినపుడు దీన్ని బాగు సేయించరా. పున్నేవుంటాది" అంటూ ప్రాధేయపడింది.

వెంకట్రావు కుంచాన్ని కింద పెట్టి "ఈ యేడు పంట డబ్బులు సేతికందగానే, నీకు కొత్త కళ్లజోడీపిత్తాను లేయే!" అన్నాడు.

ఇత్తడి బిందిని అప్పుడే చింతపండుతో తళతళలాడేలా తోమి, ఇంటిలోకి తెస్తున్న కోడలు బూరెమ్మకి ఈ మాటలు చెవిన పడ్డాయి. "వోయబ్బో అమ్మ మీన పేమ పొంగిపోతంది. ఈల్లమ్మ పదారేల్ల బాలాకుమారనీ – కొత్త కళ్లజోడేపెత్తాడంత, కొత్త కళ్లజోడు! ఈ ముసిల్దానికింకా బతుకుమీద కాపీనం పోలేదు. ఈ వొయసులో ముసిలోల్లు ఆ బొగమంతుణ్ణుంచి పిలుపు ఎప్పుడొత్తాదాని ఎదురుసూత్తావుంటారు. సీ... యెదవ బతుకు... కాకిలా కలకాలం బతికేద్దావనే" అంటూ అరవడం ప్రారంభించింది.

నెమ్మదిగా వెంకట్రావు గొడ్ల చావిడిలోకి జారుకున్నాడు.

కోడలి ధోరణి కొత్త కాకపోయినప్పటికీ, తులసమ్మ కళ్ళు చెమ్మగిల్లేయి. తన చావుకోసం ఎదురుచూసేవాళ్ళు ఇంట్లో రోజు రోజుకి ఎక్కువ కావడం ఆమెను మరింతగా బాధిస్తోంది.

పాలివ్వని ఆవుని కబేళాకి తోలేసినట్టు, ఒళ్ళొంచి గట్టిగా పని చేయలేని ముసలి తల్లిని బయటకి గెంటేయడమే న్యాయంగా తన కొడుకూ కోడలూ భావిస్తున్నట్లుగా ఆమెకి అనిపించింది. పిల్లలకి జన్మనిచ్చిన వెంటనే తల్లి తేలు చనిపోతుందంటారు. అలానే ఆఖరి ప్రసవం అయిన వెంటనే, తన ప్రాణాలు గాలిలో కలిసిపోయుంటే ఎంత బావుండేది? రోజు రోజుకీ మనుషుల్లో మంచితనం మాయమైపోతుంది. ఏదో భూతం తన కొడుకూ కోడల్ని ఆవహించినట్లనిపిస్తోంది. ఈ భూతాన్ని బతికుండటమే తను చేసిన నేరంలా కోడలు పదే పదే కసురుకోవడంతో తులసమ్మ ఎంతో మనస్తాపానికి గురయింది. రెండేళ్ళ క్రిందటోసారి – కరణంగారి కోడలి సాయంతో శాంతి ఆశ్రమానికి చేరుకుని, అక్కడ వంటమనిషిగా స్థిరపడింది. కొన్ని నెలల తర్వాత ఈ వార్త తన గ్రామ పెద్దలకు తెలియడమూ, వెంకట్రావునీ, బూరెమ్మనీ పిలిచి చీవాట్లు పెట్టి, తనని బలవంతంగా ఇంటికి రప్పించడమూ జరిగిపోయాయి.

'గుట్టుగా ఉన్న మా కాపురాల్నీ ముండ బజారుకీడ్చింది. యే నూతిలోనో దూకి సావక, ఏ మొగం పెట్టుకుని నా

గడప తొక్కిందో దగుల్బాజి లెంజ!' అని కోడలు మరింతగా రెచ్చిపోయింది.

చావంటే తులసమ్మకి భయం లేదుకాని, బలవంతంగా చనిపోయినవాళ్ళు భూతాలుగా మారి, ఏడు జన్మల వరకూ ఈ కొంపల చుట్టూతా తిరుగుతారని తమ పెద్దవాళ్ళు చెప్పగా విన్నది. ఆ చిన్నప్పటి నమ్మకం ఆమెతో బాటుగా పెద్ద భూతంగా పెరిగి, మనసునంతా ఆవహించేసింది.

కోమటి రత్తమ్మ రావడంతో ఆమె ఆలోచనలకు గండి పడింది.

"తులసమ్మా, బియ్యం ఏరుతున్నావా? ఎప్పుడూ ఈ సంసారపు రంధేనా? కృష్ణా, రామా అనుకునే వయసిదీ! సాయంకాలం శివాలయంలో స్వామి శ్రీ రామానంద వారి ఉపన్యాసం ఏర్పాటు చేశారు. ఆయన ఉపన్యాసం వినడానికి మన తూర్పు గోదావరి జిల్లాలోని చాలా ఊళ్ళ నుండి జనం బళ్ళు కట్టుకొని మరీ వస్తున్నారట!" అంది రత్తమ్మ కళ్ళు పెద్దవి చేసుకుంటూ.

"నాకంత తీరుబడెక్కడ వొదినా! అన్నీ సమకూరిన నీలాంటి దానికవన్నీను" అంది తులసమ్మ.

"మళ్ళీ వస్తాలే. నేతి గిన్నె మీద మూత పెట్టడం మర్చిపోయాను" అంటూ రత్తమ్మ బయటికి నడిచింది.



రొండు రోజుల్లో మనవరాలి పెళ్ళి పెట్టుకుని తనిలా గుళ్ళూ, గోపురాలూ తిరిగితే ఎలా అని తులసమ్మ మనసులోనే అనుకుంది. మనవరాలు చిట్టి పెళ్ళి తిరుపతిలో చేయబోతున్నారని, రెండు రోజుల క్రితం తెలియగానే, ఆనందంతో ఆమె గుండె వేగంగా కొట్టుకుంది.

కలియుగ దైవమైన వేంకటేశ్వరుణ్ణి కళ్ళారా దర్శించుకోవాలన్న తన కోరిక ఏనాటిది? తన చిరకాల వాంఛను పెళ్ళయిన కొత్తలో భర్తతో అంటే ఆయన 'దానికేం భాగ్యం లేయే! సంవత్సరానికో బిడ్డనెత్తుకుని ఎంకన్నబావు దర్శినం సేసుకొందాం' అన్నాడు. మొదటిది జరిగింది కాని, రెండోదింత వరకూ సాధ్యం కాలేదు. పిల్లలెదిగే కొద్దీ ఖర్చులు పెరగడంతో, తిరుమల కొండ అంతకంతకూ తమకందనంత ఎత్తుకి ఎదిగిపోయింది.

ఆశ చావక తను ఎప్పుడైనా గుర్తు చేసినా 'వోసి ఎర్రిదానా, యెంకన్నబాబు ఆ కొండమీదే ఉన్నాడా? మన గుండె లోపలెదికితే కనబడ్డా?' అని భర్త తనకి నచ్చచెప్పే ప్రయత్నం చేసేవాడు. కొండమీదున్న దేవుడి సంగతేమోగానీ, గుండెల్లో దాచుకున్న తన దేవుడ్నే ఆ దేవుడు తన దగ్గరికి పిలిపించేసుకున్నాడు. ఒకరోజు వెంకట్రావు పాలు పితుకుతూ ఉంటే, అతని కుడికాలు బొటనవేలును గేదె తొక్కేసింది. చిన్న గాయమే అని ఊరుకుంటే, అది కాస్త ధనుర్వాతానికి దారితీసి, మనిషి ప్రాణం మీదకి తెచ్చింది. అప్పట్నుంచి ఆడపనికి, మగపనికీ తనే అయి, సంసారాన్ని ఈ మేరకు లాక్కొచ్చింది.

"అత్తా! పిండొడియాలు డబ్బా సూసేవేంటీ?" అన్న కోడలి పిలుపుతో తులసమ్మ ఆలోచనల నుండి బయటపడింది. "నువ్వే కదే, బోషాణంలో పెట్టిందీ" అని గుర్తు చేసింది.

బోషాణం అంటే చెక్కతో చేసిన పెద్ద పెట్టె మాత్రమే కాదు. మెట్టినింటిలో సాగిన తన వైవాహిక జీవితానికి నిలువెత్తు నిదర్శనం. "కొత్త కోడలు బోషాణం అట్టుకొచ్చింది. అందులో యే యెండి సామానుందో సూపించమ్మాని సుట్టు పక్కలోల్లంతా అంటంటే సిగ్గుతో సచ్చిపోతున్నాను. దాంట్లో అరివేడి బుడ్లూ, సలివిడి కుండా తప్పితే ఏం లేవని ఎలా సెప్పనూ?' అని అత్తగారు దెప్పిన మాటలింకా తులసమ్మ చెవిలో మార్మ్రుగుతూనే ఉన్నాయి. బోషాణానికి ఎన్ని అరలో, తులసమ్మ మెదడులో అన్ని పొరలు, ఆలోచనా తెరలు.

కోడలు బూరెమ్మ ఒడియాల డబ్బా బిడ్డనెత్తుకున్నంత జాగ్రత్తగా చంకనెత్తుకుని వస్తూ "అత్తా, ఏవన్నా అంటే అన్నానంటావు కానీ - కొత్త కోకలు మూడింకా బోషాణంలో మడతలిప్పకుండానే ఉన్నయ్. ఎంతకాలం బతికేద్దామని ఆటిని అలానే పూజింతన్నావు?" అని విసుక్కుంది.

తులసమ్మ కోడలికి సమాధానం చెప్పడం ఎప్పుడో మానేసింది. చిట్టి పెళ్లిలో ఈ మూడు చీరలూ కట్టేయాలని నిర్ణయించుకుంది. మనవరాలి పెళ్ళి తిరుమల కొండపై చేయాలని మగపెళ్ళివారు పట్టుబట్టేరని విన్నప్పుడు, దారి ఖర్చులన్నీ కొడుకు నెత్తిన పడబోతున్నాయన్న బాధ కలిగినా, ఈ రకంగానైనా స్వామి వారి దర్శనం చేసుకునే భాగ్యం కలిగినందుకు తులసమ్మకి సంతోషమైంది.

తులసమ్మ చేతి సంచి తీసుకుని, భోషాణంలో దాచిన కొత్త చీరలు మూడింటినీ అందులో ఉంచుకుని, తనూ ప్రయాణానికి సిద్ధమవుతోంది.

ఇది గమనించిన బూరెమ్మ గబగబా భర్త వెంకట్రావు దగ్గరకు వెళ్ళి "ఏవయ్యో మీయమ్మ కూడా తిరపతికి రెడీ అయిపోతున్నట్టుంది. కరువులో అధిక మాసమనీ, ఎంత లేదన్నా ఈ ముసిల్దానికి అయిదొందలన్నా వొదుల్తాయా లేదా?" అని సాధించింది.

వెంకట్రావు పరుగు పరుగున వచ్చి కొట్టు గదిలో ఉన్న తల్లిని చూసి "అమ్మా, ఇయ్యాలా రేపూ నీ పేనం బావుంటం లేదు కదా! నువ్వు ఇంటి నే కనిపెట్టుకునుంటే, పిల్లదాని పెళ్ళి చూసుకుని మేం బేగా వచ్చేత్తాం" అన్నాడు. అంతా ఆమె మంచి కోసమే అన్నట్టు.

"ఓరెంకట్రావో, డబ్బులకి నువ్వెంత ఇదైపోతన్నావో, నాకు తెల్దా? మా పుట్టింటోళ్ళ పేరు జెప్పుకుని నా ఒంటి మీద మిగిలిన ఈ ఒక్క బంగారు గాజునీ అమ్మేసి, ఆ డబ్బుతో టిక్కటీ నేనే కొనుక్కుంటాను. మిగతా సొమ్ములో కొంత సిట్టికిచ్చి, కొంత ఎంకన్నబాబు వుండీలో యేసేత్తాను. బతికున్నప్పుడు నీ బాబు నన్ను దోపిడీ సేసేసేడు. సివరికి మిగిలింది ఈ ఎంకన్న బాపుకి నిలువు దోపిడీ ఇచ్చేత్తాను" అంటూ చేతికున్న గాజును తీయబోయింది తులసమ్మ.

వెంకట్రావు వీపు మీద ఎవరో చరిచినట్లయింది. చూడబోతే అసలు గుట్టు రట్టయ్యేట్టుంది. "సర్లేయే. నీవొక్కదాని టిక్కటీతో నేను బికారోణ్ణెం అయిపోతానా? కానీయ్, అందరితో బాటూ నువ్వూను. ఎలాగా ఆ పాడావుని అమ్మేయక తప్పేలాగ లేదు" అన్నాడు.

తిరుపతిలో కాలుమోపగానే తులసమ్మకి వేరే లోకంలో ఉన్నట్లే ఉంది. పెళ్ళి జనం, వీళ్ళ తరఫువాళ్ళు, వాళ్ళ తరఫువాళ్ళు కలసి ఓ ముప్పైమందికి పైగానే ఉన్నారు. సామాన్లు లెక్క పెట్టుకోవటం, పిల్లల్ని కసిరికొట్టడం, పరుగెత్తే పోర్టర్లని తప్పించుకోవడం... అంతా హడావిడిగా వుంది. వెంకట్రావ్ పెద్ద కొడుకు ప్రసాద్ అందరినీ ఒక ప్రక్కగా నడవమని కేకలేస్తున్నాడు. అల్లంత దూరాన ఉన్న తిరుమల కొండని చూస్తుంటే, భూదేవి స్వామివారికి సమర్పించుకున్న పగడాల కిరీటంలా తులసమ్మకి అనిపించింది. ప్రసాద్ అందరినీ ప్రక్కనే ఉన్న ఓ షెడ్‌లోకి తీసుకెళ్ళి, దర్శనం కోసమని అందరి చేతికీ టోకెన్లు వేయించాడు.

తులసమ్మకి ఇదంతా కలలా అనిపిస్తున్నది. "సామీ, ఈ జన్మకిది సాలు. కళ్ళారా నిన్ను సూసేకా, ఈ కట్టె ఏవైనా పర్లేదు' అని మనసులోనే అనుకుంది. మొన్నా మధ్య కోమటి రత్తమ్మ స్వామివారి దివ్య మంగళ విగ్రహం గురించి చెబుతుంటే తను నోరు తెరుచుకుని విన్నది.

బస్సు - క్లిష్టమైన కొండ మలుపులు తిరుగుతూ ఉంటే భక్తులు గోవింద నామస్మరణ చేస్తున్నారు. మధ్యలో కాలి నడకన కొండెక్కుతున్న భక్తులను చూసి "యెంకట్రావ్, నే సెపితే ఇన్నావు కాదు, నడిసి కొండెక్కితే ఎంత పున్నెవనుకున్నావ్?" అని తులసమ్మ అన్నదో లేదో, ప్రసాద్ "ముసిల్దానా, నడిసి ఎక్కితే కొండ మీదికేమో గానీ పై లోకానికెళ్ళిపోతావ్?" అనడంతో అందరూ గొల్లున నవ్వారు. చిన్న మనవడు రమణ తప్ప.

రమణ నాన్నమ్మకు దగ్గరగా వచ్చి, ప్రక్కనే కూర్చుని "నాన్నమ్మా... ఆ కనిపిస్తున్న మెట్లున్నాయి సూడు. అదే కొండ మీదికి నడిసెల్లే దారి. వాటిని సూసి మొక్కుకున్నా పుణ్యమే!" అనగానే, తులసమ్మ చేతులెత్తి మొక్కుకుంది. చిన్న మనవడికి తన భర్త పేరు పెట్టడం వలన, వాడంటే తులసమ్మకి వల్లమాలిన ప్రేమ. అందుకనే అసలు పేరుతో పిలువకుండా 'నంటీ' అని ముద్దుగా పిలుచుకుంటుంది. రమణకి నాన్నమ్మ అన్నా, ఆమె చెప్పే కథలన్నా, చూపించే ఆప్యాయత అన్నా బోల్డంత ఇష్టం.



కాటేజీలో దిగగానే తులసమ్మ ప్రక్కనే ఉన్న కోనేటిలో స్నానం చేసి వచ్చి, పచ్చని అంచున్న కొత్త తెల్ల ఖద్దరు చీరను కట్టుకుని మనవరాలితో 'గుడికెల్దామా, సిట్టీ?" అంది.

ఆ పిల్ల కాస్త ముఖం మాడ్చి "ఏంటే నా పెళ్ళి కంటే, గుళ్ళో కెళ్ళడమే నీకు ఎక్కువైపోయింది? ముదేవన్నా మనూరి రావులోరి కోయిలనుకున్నావా, ఎప్పుడంటే అప్పుడెల్లిపోడానికీ! మన సేతులకి కంకణం ఏసినపుడే సెప్పేరు. దర్శనం రాత్రి ఎనిమిద్దాటేకనే అయితాదని" అంది.

అంతలో బూరెమ్మ వచ్చి "అదే మంచిది. పెళ్ళయిన వెంటనే అందరం కలిసి యెంకన్న బావుని సూసి వచ్చేయ్యొచ్చు" అంది.

వేంకటేశ్వర స్వామిని దర్శించుకోవాలన్న ఆత్రంలో - పగలంతా ఎలా గడిచిందో, పెళ్ళి ఎలా జరిగిందో తులసమ్మకు తెలియనే లేదు. అందరూ కలసి దర్శనానికి బయల్దేరడం మాత్రం స్పష్టంగా తెలుస్తోంది. అన్నమయ్యలాంటి పరమభక్తులు నడయాడిన నేల ఇది! ఈ గాలీ, ధూళీ కూడా పరమ పవిత్రమైనవే!! ముక్కోటి దేవతలు నిత్యం స్వామివారిని కొలుచుకుంటారట!! కోమటి రత్తమ్మ కథలు కథలుగా చెప్పిన వైనం గుర్తుకొచ్చింది.

తన ప్రమేయం లేకుండానే 'గోవిందా, గోవిందా' అనే పదాలు తులసమ్మ నాలుకపై నర్తించడంతో తనిలా ఎంతసేపటి నుండి లైనులో నడుస్తున్నదో గమనించనే లేదు. ఒక్కసారి చుట్టూ కలియజూసింది. తమ వాళ్ళందరూ గుండ్లు గీయించుకోవడం మూలాన వింత వింతగా కన్పిస్తున్నారు. భక్తుల లైను గర్భగుడికి దగ్గర కావడంతో రద్దీ ఎక్కువై తోపుడూ, తొక్కిసలాటా మొదలైంది. జనం మడమలపై బలువునా పైకి సాగి స్వామివారిని ఎక్కువసేపు తమ కళ్లల్లో ప్రతిష్టించుకోవాలని ప్రయత్నిస్తున్నారు.

తులసమ్మకి మసకమసకగా కనిపిస్తోందంతా! ఎవరో చిన్నపిల్ల భయంతో ఏడుస్తున్నట్లుగా అనిపించడంతో, ఆమె చుట్టూ కలియజూసింది. ఓ అయిదారేళ్ళ పిల్ల కంగారుగా అటూ ఇటూ చూస్తూ ఏడుస్తుంటే, ప్రక్కగా ఉన్న పెద్దవాళ్ళు మాత్రం భక్తి పారవశ్యంతో రెండు చేతులూ పైకెత్తి మొక్కుకుంటున్నారు. తుసలమ్మ గుండె కరిగిపోయింది. కొంపదీసి ఈ పిల్లనెవరూ తొక్కేయరు కదా!' అనే ఆలోచన రాగానే ముందుకు కదిలి ఆ అమ్మాయిని నెమ్మదిగా ఎత్తుకుని చంకనేసుకుంది. ఆ పిల్ల కాస్త బెరుకుగానే తులసమ్మ చంకనెక్కి, ఆమె మొహంలోకి వింతగా చూసింది. గోవింద నామస్మరణ అంతకంతకు ఎక్కువవుతోంది. ఆలయ సిబ్బంది భక్తుల చేతులు పట్టుకుని గుంజి పడేస్తున్నారు. ఎక్కడ దెబ్బ తగులుతుందోనని తులసమ్మ పాపని రెండు చేతులతో కప్పేసింది. గ్రద్ద దాడి చేయబోతుంటే, రెండు రెక్కల కిందా పిల్లలను దాచేసిన తల్లి కోడిలా.

ఉప్పాడ సముద్రంలో ఉప్పెన వచ్చినట్టుగా జనం వెల్లువ ఎక్కువైంది. తనకి తెలియకుండానే తులసమ్మ గర్భగుడి నుండి బయటనున్న మండపంలోకి నెట్టబడింది. చల్లగాలి తగలడంతో, చేతిలో ఉన్న పిల్ల మొహం తేటగా కనిపించింది. కాస్త తేరుకున్నాకా ఆ పాప తులసమ్మ ముఖంలోకి చూస్తూ "మమ్మీ మమ్మీ కావాలి" అంటూ మారాం చేయడం ప్రారంభించింది.

అంతలో ఒకామె హడావిడిగా వచ్చి తులసమ్మ చేతిలోని పిల్లను గుంజుకుని, అనుమానంగా చూసింది. ఆ పిల్ల వెంటనే "మమ్మీ" అంటూ ఆమెకు అతుక్కుపోయింది. ఆమె పిల్ల చేతికున్న గాజులు, చెవులకున్న కమ్మలూ, మెళ్లో గొలుసూ అన్నీ సరిచూసుకుని, తులసమ్మ వంక చిరాకుగా చూసి, అక్కడి నుండి వెళ్ళిపోయింది.

ఒక్కక్షణం తులసమ్మ మనస్సు చివుక్కుమన్నా 'ఆమెదేం తప్పు లేదులే! రోజులలా వున్నాయ్. ఎలాగోలా, ఆసామే తల్లీబిడ్డల్ని ఒకటిగా సేసేదు' అని సంతోషించింది. ఈ ఆనందంలో స్వామివారిని దర్శించుకోలేకపోయానన్న ఆలోచన ఆమెకి ఏ కోశానా లేదు. 'ఇంత రాత్రిపూట, ఈ ఒంటికంటి కళ్ళద్దానికి సామోరు కనిపించడం కట్టమే. రేపు పొగులు సానా యెలుగుంటాది. అప్పుడే రెండు కళ్ళూ పెద్దయి సేస్కుని సూడమని సామోరి తీరుపై వుంటది' అనుకుని తృప్తిగా గాలి పీల్చుకుంది.

గర్భగుళ్ళో నుండి బయటకొచ్చే వాళ్ళందర్నీ తులసమ్మ శ్రద్ధగా గమనిస్తోంది. 'ఇన్ని గుండుల్లో మన గుండ్లు పోల్చుకోడం ఇంత రాత్రేల కట్టవే' అనుకుంది. నిలబడి నిలబడి నీరసం వచ్చి ప్రక్కనే ఉన్న మండపం మెట్లపై కూర్చుంది.

గంటలు గడిచిపోతున్నా తమవాళ్ళ ఆచూకీ దొరక్కపోవడంతో తులసమ్మ గుండెలో దడ ప్రారంభమైంది. తమ వాళ్ళు దొరక్కపోతే ఎలా? ఈ ఊరికాని ఊరిలో! వొద్దు, వొద్దని అందరూ అంటున్నా. తనే పంతం పట్టి మరీ బయల్దేరింది. అన్నిటికీ ఆ ఎంకన్నబాబే ఉన్నాడు' అని కాస్త ధైర్యం తెచ్చుకుంది.

పూజారిలా ఉన్న వ్యక్తి ఒకాయన కొంచెం దూరంలో కూర్చున్నాడు తులసమ్మని చూసి "ఏమ్మా! గాబరాగా ఉన్నారు?" అంటూ పలకరించాడు.

"ఆయ్! మావోల్లంతా కనిపించడం లేదండయ్యగోరు. తవరు కాత్త సాయం సేయండి బాపూ. గుళ్ళోంచి ఇవతలికి రావడానికి ఇదొక్కటే దారాండీ?" అంది తులసమ్మ.

"హుండీలో ఏమైనా వేయాల్సి ఉంటే అటుగా వెడతారమ్మా" అంటూ అతను దారి చూపించాడు.

ఆ హుండీ దగ్గర తులసమ్మ గంటకు పైగా పడిగాపులు కాసింది. సమయం గడిచే కొద్దీ తమ వాళ్ళని కలుసుకోగలనన్న నమ్మకం ఆమెకు అంతకంతకూ సన్నగిల్లుతోంది.

ఓ పెద్దమనిషి ప్రశాంతంగా నడుచుకుంటూ వెడుతుంటే "బావుగారూ, మావోల్లు కనిపించడం లేదండయ్యా. నాక్కొంచెం సాయం సేసిపెట్టరూ?" అంటూ తులసమ్మ ప్రాధేయపడింది. అది వినగానే అతని మొహంలో ప్రశాంతత మాయమైంది. "పోమ్మా చిల్లర లేదు" అంటూ చిరాకుపడ్డాడు. 'ఈయన కంటికి నేను అడుక్కునేదాన్లా కనిపించేనా?... ఆయన తప్పే వుందిలే ఇయ్యాల, రేపూ ఎవరూ అడుక్కునేవోల్లో సెప్పడం కట్టవే' అని సరిపెట్టుకుంది.

కళ్ళు తిరుగుతున్నట్లనిపించడంతో దగ్గర్లో ఉన్న కుళాయి దగ్గర నీళ్ళు తాగి వచ్చింది. తన కోసం తన వాళ్ళెన్ని తిప్పలు పడుతున్నారో? 'ఇంటికాన్నే ఉండిపో' అని కొడుకు చిలక్కి చెప్పినట్లు చెబితే, తను వింటేగా!

అర్ధ రూపాయంత బొట్టు, బిళ్ళగోచీ కట్టిన చీరతో అపర మంగాదేవిలా ఉన్న ఒకామె కనిపించడంతో, తననీ ఆపద నుండి గట్టెక్కించమని ప్రాధేయపడింది. ఆమె సౌమ్యంగా ఏదో చెప్పింది కానీ, అదేం భాషో తులసమ్మకి అర్థం కాలేదు.



కొంచెం దూరంలో తెలుగు మాట్లాడుకుంటున్న దంపతులు కనిపించారు. తన సమస్య చెప్పగానే భర్త వెంటనే "కాస్త ముందుకు వెడితే, ఎడం చేతి ప్రక్కన ఓ ఆఫీసు వుందమ్మా, అక్కడ మీ వాళ్ళ వివరాలు చెబితే మైక్‌లో ఎనౌన్స్ చేస్తారు" అన్నాడు. 'కాస్త ముందుకెడితే సాయం దొరకొచ్చు' అన్నంత మేరకు తులసమ్మకి అర్థమైంది.

కొంచెం ముందుకెళ్ళేసరికి ఇద్దరు పోలీసులు కనిపించారు. తులసమ్మకి వాళ్ళని చూడగానే భయంవేసి, ప్రక్కకి తప్పుకుంది.

తులసమ్మ కొంచెం ముందుకు నడచి ఆలయం బయటికి వచ్చేసరికి నదిలో తమ జట్టు నుండి తప్పిపోయిన చేపపిల్ల. సముద్రంలోకి వచ్చిపడ్డట్లయింది. తను తప్ప అందరూ హడావిడిగా, అటూ ఇటూ పరుగులు తీస్తూ వెళ్ళిపోతున్నారు. 'దారి తప్పిన గొర్రె పిల్లపైనే దేవుడికి ఎక్కువ ప్రేమ' అని ఏసుపాదం మేష్టారు చెప్పడం ఆమెకు గుర్తుకు వచ్చింది. కాస్తంత ఓదార్పు, మరింతలోనే గొంతులో ఉండచుట్టుకున్న భావన.

'సక్కగా పిల్లదాన్ని పెళ్ళి చేసుకున్నాం. సామోరి దర్శనం సేసుకున్నాం అన్న సంబరం లేకుండా పోయింది నావోళ్ళకి. యెంకట్రావ్ మాట కటువుగా ఉన్నా, మనసు యెన్న! భోజనం, బొట్టూ లేకుండా ఆళ్ళంతా నాకోసం యెతికెతికి అలసిపోయుంటారు అని మనసులోనే అనుకుంది.

పుట్ట పగిలినట్లుగా జనం బిలబిలా నడిచిపోతున్నారు. కోటిలింగాల్లో బోడిలింగం అన్నట్లుగా ఇంతమంది జనంలో తనవాళ్ళు మాత్రం తనని ఎలా వెతికి పట్టుకోగలరు? దిక్కులేని వాళ్ళకి దేవుడే దిక్కంటారు! కాళ్ళు వణుకుతున్నాయి. కడుపులో తంపట వేసినట్లుగా ఆకలి మంట అంతకంతకూ ఎక్కువవుతోంది.

కొంచెం ముందుకెళ్ళేసరికి అక్కడ వీధిలైట్లు లేక, కాస్త చీకటిగా ఉంది. ఎందుకైనా మంచిదని, తులసమ్మ చేతికున్న గాజుని తీసి, కొంగుకు ముడివేసి బొడ్డు దగ్గర దోపుకుంది.

ఇంకాస్త ముందుకెడితే, బస్టాపు కనిపించింది. అందులో ఉన్న గట్టుపై కూలబడింది. క్రింద కూర్చుని చిల్లర లెక్కపెట్టుకుంటున్న ఓ ముష్టిది అనుమానంగా చూసుకుంటూ అక్కడి నుండి కదిలిపోయింది. బస్సులు వస్తున్నాయి, పోతున్నాయి. దిగే జనం దిగుతూ ఉంటే, ఎక్కే జనం ఎక్కుతూనే ఉన్నారు.

అంతలో ఒకామె వచ్చి తులసమ్మకి కాస్త దూరంగా కూర్చుంది. ఆమె చేతిలో ఉన్న గులాబీలతో నిండిన గంపని చూస్తే ఆమె కొండవైపు పూలమ్ముకుని జీవిస్తున్నదని అర్థమవుతుంది. ఆమె గంపలో ఉన్న గులాబీలు. ఆమె ఒంటిపై నుండి వచ్చే చెమట కంపూ – ఇవన్నీ కలగలసి ఒక రకమైన వెగటు వాసన ఆమె నుండి వస్తోంది.

తులసమ్మ కళ్ళజోడు సవరించుకుంటూ చూస్తుంటే, "ఇంతరాత్రిపూట ఒక్కదానివి ఎక్కడికి పోతున్నావమ్మా?" అంటూ అమ్మాయే పలకరించింది. ఆమెను చూస్తుంటే... తన మనవరాలికంటే కాస్త పెద్దదిగా ఉన్నట్లుగా తులసమ్మకి అనిపించింది.

కొత్తవాళ్ళకి అసలు విషయం చెప్పడం ఎందుకులే అని "మావోళ్ళు బజారుకని ఎల్లేరమ్మా!" ముసల్దాన్ని అవన్నీ ఏం తిరగ్గలనులే అని, ఇక్కడ కూసున్నా, ఇంతకీ నీ పేరేమిటమ్మా? మీదే ఊరు అనడిగింది తులసమ్మ.

"నా పేరు అరుణ, మాది తాడేపల్లిగూడెం..."

ఆమె మాటలకు మధ్యలోనే అడ్డం వస్తూ "ఏటీ మీది తాడేపల్లిగూడెవా? మా పెద్ద మనవణ్ణి అక్కడే ఇచ్చేం. 'బస్సా' వోళ్ళని వున్నారు. ధాన్యమాడే మిల్లు కూడా వుంది" అంటూ తులసమ్మ ఉత్సాహంగా వివరాలందించింది.

అరుణ కాస్త ఇబ్బందిగా ముఖం పెట్టి "నాకు తెలవదమ్మా! రెండేళ్ళ నుండీ ఈ కొండపైనే బ్రతుకీడుస్తున్నా నిన్ను చూస్తుంటే, మా అమ్మ గుర్తుకొస్తా వుంది. నీకేం సాయం కావాలన్నా చెప్పమ్మా!" అంది.

అప్పటిదాకా గుండెల్లో ఆవరించిన గుబులంతా విడిపోతున్నట్లుగా అనిపించింది తులసమ్మకి. జరిగినదంతా పూసగుచ్చినట్లుగా చెప్పింది.

అరుణ అంతా శ్రద్ధగా విని "నువ్వేమీ కంగారుపడకమ్మా. నిన్ను మీ వాళ్ళ దగ్గరకు చేర్చే బాధ్యత నాది. మీరు దిగిన కాటేజీ నెంబరు, పెళ్ళికొడుకూ, పెళ్ళికూతురు పేర్లూ చెప్పమ్మా" అంది.

"కట్టెజి అంటే?"

"మీరు మకాం చేసిన విడిది వివరాలు"

"అయ్యేవీ తెలవ్వమ్మా! మా మనవరాలు – అదే పెళ్ళికూతురు పేరు సిట్టి. పెళ్ళి కొడుకు పేరు తెల్వదు."

"పోనీ, మీ అబ్బాయి పూర్తి పేరు చెప్పగలవా?"

"గాదం యెంకట్రావ్, సెంద్రపాలెం గ్రామం తూర్పుగోదావరిజిల్లా"

అరుణ ప్రక్కనే ఉన్న టెలిఫోన్ బూత్ దగ్గరకు వెళ్ళి పెన్సిలూ ఖాళీ సిగరెట్టు పెట్టే తీసుకుని వచ్చింది. సిగరెట్ పెట్టెను తెరచి, లోపలి భాగంలో ఈ వివరాలన్నిటినీ రాసుకుంది.

"అమ్మా, ఇప్పటికే చాలా రాత్రి అయింది. నా గదికి పోయి ఏదైనా ఇంత తిందాం. ఉదయాన్నే ఆఫీసుకు పోయి, మీ వాళ్ళ వివరాలన్నీ తెలుసుకుంటాను." అంది అరుణ.

"ఆ యెంకన్నబాబే ఈ పిల్లరూపంలో వొచ్చి కాపాడేదు అని తులసమ్మ మనసులో అనుకుని అరుణ వెంట నడిచింది.

కొంతదూరం వెళ్ళాకా ఓ చిన్న ఇరుకు సందులో ప్రవేశించారు. చిన్న చిన్న ఇళ్ళు దగ్గర దగ్గరగా ఉన్నాయి. అందులో

ఓ ఇంటి ముందు ఆగిన అరుణ జాకెట్టులో నుంచి చిన్న పర్సు తీసి, అందు లోంచి తాళం చెవి బయటకు తీసింది. తాళం తెరచి లోపలికెళ్ళి, స్విచ్ ఆన్ చేసింది. లాంతరు వెలుతురును మించని కాంతినిచ్చే బల్బు అది.

"లోపలికి రామ్మా" అంటూ సాదరంగా పిలిచింది అరుణ.

తులసమ్మ లోపల అడుగుపెట్టేసరికి, ఒకలాంటి ముక్కవాసన అక్కడంతా వ్యాపించి ఉంది. ముందుగానే పరచి వున్న చాప మీద చతికిలపడింది. కాళ్ళలో రక్తం జరజరా ప్రాకుతున్నట్లనిపించింది.

అరుణ ఓ లోటాతో మంచినీళ్ళు తెచ్చి ఆమెకు ఇచ్చింది. ఆకలితో ఉన్న తులసమ్మకు ఆ నీళ్ళు అమృతంలా అనిపించాయి.

అంతలో సుమారు ఓ ఇరవై ఏళ్ళ వయస్సున్న అమ్మాయి చంకలో పిల్లాడిని ఎత్తుకుని లోపలికి వచ్చి "అక్కా నీవెప్పుడొత్తావాని సూత్తన్నా. చాయ్ దుకాణంలో గిరాకెక్కువైంది. మాయమ్మ నారాజయితావుంది. ఇగో నీ కొడుకు ఈడేడుస్తుంటే రెండ్రూపాయలెట్టి బిస్కత్తులు కొన్నా" అంటూ పిల్లాడిని అరుణకి అప్పగించి వెళ్ళిపోయింది.

తులసమ్మ కళ్ళు పెద్దవి చేసుకుని చూస్తూ, రెండు చేతులూ చాచి "ఓరి... ఓరి... ఈడు నీ కొడుకా" అరి భడవా... ఇటు రామ్మా, ఈడి నాన్న ఏం జేత్తాడమ్మా" అంటూ పిల్లాడిని ఎత్తుకుంది.



అరుణ మొహం కాంతి విహీనమైంది. "అమ్మా, నా బ్రతుకు గురించి నిజం తెలిస్తే ఏమనుకుంటావో నువ్వు. ఎప్పుడో పోగొట్టుకున్న నా తల్లిలాగ కన్పిస్తున్నావు. నీ దగ్గర దాపరికమెందుకు! తిండికి కటకటలాడే కుటుంబం మాది. నేనూ, నా ముగ్గురు చెల్లెళ్లూ ఎదిగి ఇంట్లో ఉన్నాం. పక్కింటి డబ్బున్న అబ్బాయి కురిపించే ప్రేమ నిజమని నమ్మేశాను. తిరుమల కొండపై రిజిస్టరు మ్యారేజి చేసుకుంటానని చెప్పి తీసుకొచ్చి, ఇక్కడున్న ఓ కాటేజీలో దింపేడు. నాలుగు రోజులకే నాపై మోజు తీరిపోయింది కాబోలు. చెప్పకుండా వెళ్ళిపోయాడు. చచ్చే ధైర్యం లేకా, ఇంటికి వెళ్ళే తెగువా లేక ఇక్కడే పూలమ్ముకుంటూ ఇలా బతుకును నెట్టికొస్తున్నాను. ఇదమ్మా నా కథ..." అంటూ వెక్కి వెక్కి ఏడ్చింది.

పిల్లాడు తులసమ్మ చంక దిగి నేల మీద పాకుతున్నాడు.

తులసమ్మ అరుణని దగ్గరగా తీసుకుని భుజంపై ఆప్యాయంగా నిమిరింది. "నిన్ను మోసం చేసి వొదిలిపెట్టి పారిపోయిన వెధవ సిగ్గుపడాలి. నువ్వేం సేత్తావమ్మా! ధైర్యంగా బతుకిలా నెట్టుకొత్తన్నావ్ అదే గొప్ప" అంటూ కళ్ళు తుడిచింది.

ఇదే మొట్టమొదటి మానవ స్పర్శగా అనిపించింది అరుణకి. ఇన్నేళ్ళ తన దుఃఖం ఒక స్పర్శతో తీసిపడేసినట్లయింది. లేచి వెళ్ళి ముఖం కడుక్కుని వచ్చి "అమ్మా, నువ్వు మనవణ్ణి చూసుకుంటూ ఉండు తినడానికేదైనా పట్టుకొస్తాను" అంటూ అరుణ బయటకు నడిచింది.

* * *

అరుణ తిరిగొచ్చేసరికి, తులసమ్మ పిల్లాడి తలకి శుభ్రంగా కొబ్బరినూనె పట్టించి, కాళ్ళపై పట్టుకోబెట్టుకుని జోకొడుతోంది. ఇంతకాలంగా తనేం కోల్పోయిందో అరుణకు అర్థమవుతోంది. అరుణ పిల్లాణ్ణి అందుకుని చాపపై పడుకోబెట్టి వచ్చి, ఇడ్లీ పేకెట్లు విప్పింది.

తులసమ్మ ఇడ్లీ ముక్కని చట్నీలో ముంచి తినబోతుంటే, కళ్ళలో నీళ్ళు తిరిగాయి. అరుణ అది గమనించి "ఏమైందమ్మా?" అంటూ దగ్గరకు వచ్చింది.

"ఏం లేదమ్మా, నువ్వు తింటూ ఉండు. నా కొడుకు యెంకట్రావు లేడూ. ఆడికి ఇడ్డెనూ, అల్లం సెట్నీ అంటే ఎంతిట్టమో! యెర్రి నాగన్న. ఏం తిన్నాడో ఏమో? నేనిక్కడ బానే వున్నాగానీ, నా కొడుకూ, కోడలూ, మనవలూ, మనవరాళ్ళూ నాకోసం తిండి తిప్పల్లేకుండా ఈ రాత్రంతా ఎక్కడెక్కడ దేవులాడుతున్నారో?" అంటూ తులసమ్మ నిట్టూర్చింది.

"నువ్వే కంగారుపడకమ్మా, ఉదయాన్నే లేచి మీ వాళ్ళని వెతికి పట్టుకుంటాను. కొండపైన పెళ్ళి జరిగిందంటే, తప్పకుండా రిజిస్ట్రేషన్ చేయిస్తారు. పెళ్ళికూతురి తండ్రి పేరు కరెక్టుగా చెప్పేవు కాబట్టి రేపు ఉదయమే వెళ్ళి, వాళ్ళు ఏ కాటేజీలో దిగేరో వాకబు చేసి వస్తాను" అంది అరుణ.

"అరుణమ్మా! ఈ ముసలి పేణం తెల్లారేదాకా తట్టుకోలేదు. నువ్వేమీ అనుకోపోతే. యిపుడే ఎల్లి యెదుకమ్మా, సచ్చి నీ కడుపున పుడతాను. సంటోడ్ని నా గుండెపై పడుకోబెట్టుకుని, ఇక్కడే నడుం వాలుత్తాను."

"ఇందులో శ్రమ ఏముందమ్మా! ఒక్క రాత్రయినా నిన్ను నా ఇంట్లో ఉంచుకోవాలన్న స్వార్థం తప్ప తలుపు దగ్గరకు వేసుకోమ్మా, నేను తొందరగా కనుక్కుని వచ్చేస్తా" అంటూ అరుణ బయటకు నడిచింది.

* * *

రాత్రి పన్నెండు దాటి ఉంటుంది. అరుణ నెమ్మదిగా తలుపు నెట్టుకుంటూ లోపలికి వచ్చింది. పిల్లాడు నిద్రపోయాడు. తులసమ్మ వాడి ప్రక్కనే పడుకుని, చూరు వంక చూస్తూ ఉంది.

"వచ్చేవా తల్లీ, మా వోళ్ల సంగతి ఏవైనా తెలిసిందా?"

"అమ్మా, మీ వాళ్ళు దిగిన కాటేజీ నెంబరు తెలిసింది. బయట బాగా చలిగా వుంది. ఇంత చలిలో రాత్రి పూట నడుచుకుంటూ వెళ్ళడం నీకు కాస్త కష్టమే. ఉదయం పూట వెళ్ళడమే మంచిదనిపిస్తోంది."

"అలా అనకు తల్లీ. పిల్లదానికి పెళ్లిచేసిన నెంబరు తెలిసింది. బయట బాగా చలిగా ఉంది. ఇంత చలిలో రాత్రిపూట నడుచుకుంటూ వెళ్ళడం నీకు కాస్త కష్టమే. ఉదయం పూట వెళ్ళడమే మంచిదనిపిస్తోంది."

అరుణ చాపమీద నిద్రిస్తున్న కొడుకును చూపి "వీడికి మధ్యలో నిద్రలేచే అలవాటు లేదులే అమ్మా. వీణ్ణి ఇంటిలోనే ఉంచి, తాళం వేసేసి, మనిద్దరం వెడదాం" అంటూ చెప్పులు వేసుకుంది.

తులసమ్మ పిల్లాడిని ముద్దాడి బయటకు నడిచింది. ఈ కొద్దిగంటల పరిచయానికే. వాణ్ణి ఒదిలి వెళ్ళాలంటే ఆమెకు గుండెల్లో గుబులుగా అనిపించింది.

ఏదో గుర్తుకు రావడంతో అరుణ ఇంట్లోకి వెళ్ళి, శాలువాతో తిరిగి వచ్చి "ఈ కొండగాలికి నువ్వు తట్టుకోలేవమ్మా" అంటూ తులసమ్మ భుజాలపై కప్పింది - ఇంకా మిగిలి వున్న మానవత్వానికి చిరుసత్కారం చేస్తున్నట్లుగా.

దూరంగా కొండపైన వేంకటేశ్వరస్వామి వారి నామాలు రంగురంగుల బల్బులతో ధగద్ధగాయమనంగా వెలిగిపోతున్నాయి అమ్మ మనసులా. క్రిందకి చూస్తే లోయలు చీకటి గుయ్యారాల్లా ఉన్నాయి. అనుబంధాలు మరచిన మనుషుల్లా!

అర్ధరాత్రి దాటి చాలాసేపయినట్లుంది. తులసమ్మ నడుస్తూ క్రిందనున్న ఊరి వంక చూసింది. మినుకు మినుకుమంటున్న దీపాలను

చూస్తుంటే - ఎవరో పిల్లలు ఆకాశం నుండి కొన్ని నక్షత్రాలను కోసి, నేలపై వెదజల్లినట్లుగా వుంది.

జనం కాస్త పల్చబడటంతో, వీధుల్లో రద్దీ తగ్గింది. తులసమ్మ ఉదయం తను స్నానం చేసిన కోనేటిని గుర్తుపట్టింది. నిలకడగా ఉన్న కోనేట్లోకి చూస్తుంటే, అందులోనూ మెరిసే నక్షత్రాలలో ఆకాశం! తులసమ్మకి రెండు ఆకాశాల మధ్యలో ఉన్నట్లుగా అనిపించింది.

అరుణ ఎన్నో వీధులు తిప్పి, ఓ కాటేజీ ముందు నిలబెట్టి "అమ్మా! ఈ కాటేజీలోనే మీ వాళ్ళు దిగింది" అని చెప్పగానే, తులసమ్మ మొహంలో వేయి కాగడాల వెలుగు కనిపించింది.

అరుణకు మాత్రం ఒంటరితనమనే భూతం మళ్ళీ వెంటపడుతున్నట్లుగా అనిపించింది.

అదే కాటేజీలో నుండి ఓ నడివయసులో వున్న వ్యక్తి దుప్పటి నిండుగా కప్పుకుని బయటకు వస్తున్నాడు. ఎదురుగా వున్న తులసమ్మని గుర్తించి "ఇప్పటి వరకూ ఎక్కడికి పోయేవమ్మా, తులసమ్మా?" నేనూ... బూరెమ్మ అన్నని. కడుపులో బాగాలేక సోడా తాగొద్దామని ఇలా బయల్దేరాను" అన్నాడు.

"నువ్వా ఆదిమూర్తీ! ఈ మధ్య బొత్తిగా కళ్ళు కనిపించడం లేదు. గుళ్ళోనే తప్పిపోయాను. అనవసరంగా అందర్నీ కంగారుబెట్టేను" అంది తులసమ్మ ఇబ్బందిపడుతూ.

"ఇబ్బందా! ముసిల్ది బాగానే తప్పిపోయిందని అందరూ సంబరంగానే ఉన్నారు. హోటేల్లో బాగా మెక్కి నిద్రబోతన్నారు సూడు! మా సెల్లి సంగతి సెప్పనే ఒద్దూ! నీ కొడుకునంటే నీక్కోపం వస్తదేమోగానీ, పెళ్ళం గయ్యాళితనాన్ని అడ్డం పెట్టుకుని, యెంకట్రావ్ కూడా బాధ్యతల నుంచి బాగానే తప్పించుకుంటున్నాడు. నీ అదురుష్టం బావుండి యెనక్కి వచ్చేవుగానీ, లేపోతే నిన్నిక్కడే వొదిలేసి, రేవంతా మనూరికి ఎల్లిపోదామనుకుంటున్నారు... వుండమ్మా, ఇప్పుడే వస్తాను" అంటూ అతను ముందుకు కదిలాడు.



తులసమ్మకి ఆదిమూర్తి గురించి బాగా తెలుసు. బూరెమ్మలా కాదు. ఎవరికీ భయపడకుండా, ఉన్నది ఉన్నట్లుగా మాట్లాడటం మూలాన, అతనికి చాలామంది భయపడతారు. తులసమ్మ కళ్ళల్లో నీళ్ళూరేయి. లోకమంతా చీకటైపోయినట్టనిపించింది. పగిలిన కళ్ళజోడు తీసి కళ్ళు ఒత్తుకుంది.

"అమ్మా, బాధపడకు" అంటూ అరుణ ఓదార్చబోయింది.

"బాధపడ్డానికేవుందమ్మా! రేపట్నుంచి కొత్త అల్లుడు ఇల్లరికం వత్తాడు. ఈ కుర్రాణ్ణి మా యెంకట్రావే పోషించాల. అరెకరం పొలంలో వ్యవసాయం రెక్కల కట్టం తప్ప నా కొడుక్కి మాత్రం ఏం మిగిలింది! ఈ వొయసులో కాటికి కాళ్ళు జాపుకున్న నన్ను కూడా సాకాలంటే, ఆడికీ కట్టమే మరీ!" అంది తులసమ్మ, గుండెలో రగులుతున్న అగ్నిపర్వతాన్ని అదిమిపెట్టుకుంటూ.

స్ట్రీట్‌లైట్ వెలుగు కాటేజీ వరండాపై పడుతోంది. అందరూ గాఢనిద్రలో ఉన్నారు. తులసమ్మ కళ్ళు పెద్దవి చేసుకుని చూస్తే, యెంకట్రావు గుర్రు పెట్టి నిద్రపోతూ ఆ గుంపులో కనిపించేడు.

అరుణకు ఆశ్చర్యమూ, బాధా కలిగాయి. కన్నతల్లి తప్పిపోతే, ఈ వయసులో పెద్దామె ఏం ఇబ్బందులు పడుతుందోనని, వెదకడం పోయి ఇంత హాయిగా ఆయనెలా నిద్రపోతున్నాడు? కుటుంబంలోని అందరూ అలానే ఉన్నారు. తులసమ్మ మొహంలోకి చూళ్ళేక తలదించుకుని "అమ్మా... ఏం చేద్దాం?" అనడిగింది.

తులసమ్మ ఓ నిర్ణయానికొచ్చినట్టు అరుణ చెయ్యి పట్టుకుంది. "సేయడానికేముందమ్మా, మనింటికే పోదాం పద. ఈ కుటుంబంలో అందరూ పెద్దోళ్ళయిపోయేరు. ఈళ్ళకి నా అవుసరం ఇంక లేదు. దేవుడు నీ కొడుకుని నాకింకో మనవడిగా ఇచ్చేడు. వాణ్ణి నేను పెంచి పెద్ద సేయద్దూ! పద... పద... పిల్లోడు మధ్యలో నిద్ర లేసేడంటే, భయపడతాడు" అంటూ తులసమ్మ ముందుకు నడిచింది.

రెండడుగులు వేసి, తులసమ్మ వెనక్కి తిరిగి కొడుకు వంక చూసింది. చలి ఎక్కువ కావడం మూలాన, వెంకట్రావు రొయ్యిలా ముడుచుకుని పడుకున్నాడు. తులసమ్మ వెనక్కి నడిచి, తన ఒంటిపై నున్న శాలువాని కొడుకు పైన పూర్తిగా కప్పి, వెనుతిరిగింది.

అమ్మ దొరికిన సంతోషంతో అరుణ మనసు ఆనందంతో పొంగిపోతోంది.

అరుణా, తులసమ్మా నెమ్మదిగా నడక ప్రారంభించారు.

"అమ్మా, నువ్వు స్వామి వారి దర్శనం చేసుకోలేదు కదా! ఉదయాన్నే నిన్ను గుళ్ళోకి తీసుకెడతాను" అంది అరుణ ఆప్యాయంగా.

"నిన్ను సూసేకా, దేవుణ్ణి సూడాలనిపించడం లేదమ్మా... పిల్లోడేం సేస్తన్నాడో, ఏమో పద, పద" అంటూ తులసమ్మ అరుణ చెయ్యి పట్టుకుని గబగబా నడవడం మొదలెట్టింది.

అంతలో ఏదో గుర్తుకు రావడంతో, బొడ్డులో దోపుకున్న కొంగును బయటకు లాగి, దానికి ముడివేసిన గాజును బయటికి తీసింది. "అమ్మా అరుణా, నేను నీకు బరువు కాకూడదు. నా దగ్గర ఈ బంగారు గాజు ఒకటే మిగిలింది. రేపు నువ్విది అమ్మేసి, డబ్బు తెత్తే కొద్ది రోజులు గడిసిపోతాయి. తర్వాత సంగతి ఆ యెంకన్నబాబే సూసుకుంటాడు" అంటూ తులసమ్మ ఆ గాజును అరుణకు అందించింది.

"నువ్వు నాకు బరువేమిటమ్మా! దేవుడిచ్చిన అమ్మవి నువ్వు" అంటూ అరుణ గాజును వెనక్కి ఇచ్చేసింది.

తులసమ్మ ఆ గాజుని మళ్ళీ బలవంతంగా అరుణ చేతిలో పెట్టింది. స్ట్రీట్‌లైట్ వెలుగులో ఆ గాజును చూసి అరుణ అవాక్కయింది. అది రోల్డ్ గోల్డ్ గాజు. 'ఈ పెద్దామెకు ఎవరో మోసం చేశారన్నమాట!' అని అరుణ మనసులోనే అనుకుని, పైకి మాత్రం 'చాలమ్మా, దీన్ని అమ్మగా వచ్చిన సొమ్ముతో మనిద్దరం, పిల్లాడూ హాయిగా కాలం వెళ్ళదీయవచ్చు" అంది.

ఇంటికి చేరుకుని తాళం తెరిచేసరికి, ఆ శబ్దానికి పిల్లాడు లేచి, భయంభయంగా చూసేడు. తులసమ్మ గబగబా లోపలికి వెళ్ళి, పిల్లాడిని చంకన వేసుకుంది. వెంటనే వాడు తులసమ్మని వాటేసుకున్నాడు.

తులసమ్మకు తన చంకలో ఉన్న పిల్లాడిని చూస్తుంటే, జీవితం పైన కొత్త ఆశ చిగురించింది. వీణ్ణి పెంచి పెద్ద చేయాల్సిన బాధ్యత తన మీద ఉందనిపించింది.

ఇంతవరకూ తన వాళ్ళ కోసం చేసింది 'చాకిరీ'గానూ, ఇప్పుడు కుటుంబ పరిధి దాటి, ఇతరుల కోసం చేసేది 'సేవ' గానూ తులసమ్మకి అనిపిస్తోంది. 'ముసిలి ముండకింకా సావురాసి పెట్టేదు కాదురా బొగవంతుడా!' అన్న ఈసడింపులిక్కడ ఉండవు కాబట్టి బతుకు ఇప్పుడే మొదలయినట్లుగా అనిపిస్తోంది ఆమెకు.

*

# సమకాలీన కవితా శిల్పంపై విస్తృత పరిశోధన




**పరిశోధకుడు లంకా వెంకటేశ్వర్లు కవిత్వం వెనుక దాగిన నిర్మూలకాంశాల్ని చాలా చక్కనైన రీతిలో విశ్లేషించారు. ఆధునికతకు, ఆధునిక కవిత్వంలో వచ్చిన విభిన్న ధోరణుల్లో వివిధ రకాలైన కవులు ఏ విధంగా తమ కవితా ఖండికల్లో భావచిత్రాలు ప్రతీకలు ఎట్లా పేర్చబడి కవితాత్మకతను కవిత్వంలోని అనుభూతి గాఢతనను నింపుకొన్నాయో చాలా లోతుగా చెప్పారు.**

**సిహెచ్. ఆంజనేయులు**

సమకాలీన కవిత్వంలో వచ్చిన 'ప్రతీకలు - భావచిత్రాలు' అనే ఎంఫిల్ సిద్ధాంత గ్రంథాన్ని పరిశీలించినప్పుడు ఆశ్చర్యానందానికి గురయినాను. పేరుకు అకడమిక్ పరిశోధనాంశమైన అందులో విస్తృత కృషి కన్పించింది.

పూర్వ కవిత్వంలో రసం, ధ్వని, అలంకార వైచిత్రల పరమైన అంశాలు పూర్వ కావ్యాల్లో ఎంతటి ప్రాధాన్యతను సంతరించుకున్నాయో తెలియంది కాదు. పూర్వ అలంకారికులు, విమర్శకులు ఏ విధంగా వాటిని వివేచించారో సహృదయ పాఠకులకు తెలియజేసేవారో ప్రాచీన ప్రక్రియలైన శతకం కావ్యం, మహాకావ్యం, ప్రబంధ ఇతిహాసాలపై చక్కటి టీకా తాత్పర్య సహిత విశ్లేషణ, వ్యాఖ్యానం గావించారో అసలు కవిత్వంలో శిల్పం అంటే ఏమిటి? కవితను చెప్పదల్చుకున్న తీరుతెన్నులే శిల్పంగా పెద్దలు చెప్పారు. దానిలో అభివ్యక్తీకరణం అంటే చెప్పే విధానం మొదలగునవి వుండవచ్చు. ఈ శిల్పంలో ఆధునికత భావనతో ప్రతీక గాని, భావచిత్రంగాని కవిత్వంలో సామాజిక వస్తువు కేంద్రస్థానంలోకి వచ్చిన తర్వాత రసావిష్కరణంలో తథాభాగంగా కావ్య ఆనందం, రసానందం మొదలగు ప్రధానమైన పూర్వపు అలంకార వినియోగానికి వాడటానికి కాలం చెల్లింది. ఈనాడు వస్తువు సమాజ సాహిత్యంలో ప్రముఖ స్థానాన్ని అలంకరించుకుంది. సామాజిక భావనని శక్తిమంతంగా వ్యక్తం చేయడానికి కవిత్వ నిర్మాణంలో వీటి ప్రతీక భావచిత్రాల స్థానం చాలా ప్రాధాన్యత సంతరించుకొని వున్నదనే విషయాన్ని పరిశోధకులు లంకా వేంకటేశ్వర్లు పేర్కొన్నారు. కవిత్వంలో ఈ వైవిధ్య పూరితమైన, విభిన్న రకాలైన అభివ్యక్తి, వైచిత్రిలకు, అభివ్యక్తికి శిల్పమే మూలమైనదని చెప్పవచ్చునని నిరూపించారు పరిశోధకులు.

"శిల్పం అంటే ఒక వస్తువుని పాఠకుని మనస్సు మీద గాఢంగా ముద్ర వేయడానికి అవసరమైన నిర్మాణపరమైన అంశాల సమాహారం అంటారు. ఆయన దీనిలో ప్రతీకలు, భావచిత్రాల పరిణితిని, 90ల తర్వాత వివిధ కవిత్వ ధోరణులలో పెరిగిన శిల్ప స్పృహను, సమీక్షించడం, చదువరిలో పెరిగిన పరిణామాన్ని గూర్చి వివరిస్తున్నారు. 1990ల తర్వాత శిల్పంలో భాగంగా చెబుతున్న ప్రతీక, భావిచిత్రాలు ఎలాంటి ప్రయోజనాన్ని సాధిస్తున్నామో పరిశోధకులు వేంకటేశ్వర్లు అనుభూతివాదం నుండి అస్తిత్వ వాదాల దాకా అన్నింటిని పరామర్శించారు.

నిజానికి మాతృభాష సంస్కరింపబడక సంస్కృతీకరింపబడిన తీరుతెన్నులను మూలధాతువైన తల్లి భాష, ప్రజల శ్వాస నుండి వేరవుతున్న స్థితిని నేటివిటీని దేశీయమైన - ప్రాంతీయతా, స్థానికతా ముద్రను వేసుకొని, అక్కడి నుడికారాలు, పలుకుబడులు, సామెతలు, జాతీయాలతో ఏ విధంగా తమ సహజ భావాల గుభాళింపును భాష పెంపొందించుకొందో తెలియజేస్తారు. నిరక్షరాస్యులే మాతృ భాషను రక్షిస్తున్నారని అంటారు పరిశోధకుడు.

ఒక్కసారి ఈ పరిశోధకుడు వివిధ అధ్యాయాలలో పరిశీలించిన అంశాలను గురించి చెబుతూ "వస్తు శిల్ప పరిణామం విప్లవ కవిత్వం దాకా" ఎలా స్థాన పరిణతిని పొందిందో చెబుతూ...

వస్తువు - శిల్పం (Contentanttown) కవిత్వంలో వుండే రెండు అనివార్య భాగాలు. కవితా వస్తువు అంటే కవిత్వంలో వినియోగించుకోవడానికి కవి గ్రహించే ఒక పదార్థం, ఒక భావం, ఒక సమస్య, ఒక సందర్భం, ఒక ఆశ్రయం, ఒక సిద్ధాంతం, ఒక్క మాటలో మనిషి లోపలా, బయటా ఆవరించివున్న సమాజాన్ని కళాత్మకంగా అన్ని కోణాలలో ఆలోచించేలా ఆవిష్కరించటం, కవిత్వంలో వస్తువవుతుంది. మనిషిలోని వస్తు సంఘర్షణ, వైవిధ్యం కవిత్వంలో వస్తువు సమగ్రంగా పరిష్టినొందుతుందని అంటారు.

కవితా వస్తువు, అనుభూతి, ఆలోచన, ఆవేశం వంటి భావావేశం మొత్తం భావావేశాల మొత్తంగా (emotionately) కవితా వస్తువు చైతన్యమై విప్పారిన కన్నవుతుందని అంటారు.

భారతీయమైన అత్యున్నత కావ్య నిర్మాణ ప్రతిభలో రసము, ధ్వని, చాలా ప్రధానమైనవి. ఏ వస్తువైన రసంలో పరిపుష్టమైనపుడు ఆ వస్తువు హృదయాన్ని కదిలిస్తుంది. "If man is social by nature, he will develop his true nature, only in society and the powr of his nature be measured not by the power of separate individual, but by the power of the society." ఎందుకంటే సమాజం లేకుండా వస్తువుని అస్తిత్వం లేనపుడు రూపాన్ని ఊహించలేం. కాబట్టి సమాజాన్ని ఆధారం చేసుకొనే వ్యక్తికి వ్యక్తిత్వం సిద్ధిస్తుందని అంటారు.

ఆధునికత అంటే ఏమిటో నిర్వచిస్తూ "సాహిత్యంలో ఆధునికతని సామాజిక పరిణామ కోణం నుంచి పరిశీలించి 19 - 20 శతాబ్దంలో పాశ్చాత్య సంస్కృతి మన జీవన విధానం మీద చూపిన ప్రభావం సంక్షోభానికి దారి తీస్తుందంటారు. గురజాడ రాకతో తెలుగు సాహిత్యంలో ఆధునీకత

ఆరంభమైందని చెప్పాలంటారు. వేగవంతంగా మారుతున్న క్రమంలో హేతుభావనలు, సంస్కరణ దృక్పథాలు, ఇక్కడి సంస్కృతి కనుగుణంగా, జాతి పునరుజ్జీవనంలో గాని, సాహిత్య పునరుజ్జీవనంలో గాని వచ్చిన మార్పులను సామాజిక చైతన్యాన్ని అందించేదంటారు. ఆ నవ్య ప్రగతినే గురజాడ అందించారంటారు.

భావకవిత్వంలోని అనుభూతి స్వేచ్ఛ శిల్ప సౌందర్యానికి ప్రాణధాతువైంది. అలానే భూస్వామ్య సంస్కృతికై కళాపరమైన వ్యక్తీకరణమే భావకవిత్వమని, వాస్తవికతా దృక్పథంలో, అభ్యుదయ, విప్లవ ఉద్యమాలకు నేపథ్యంగా కాల్పనికత, తదనంతర కాలంలో నవ్య సాంప్రదాయ, అనుభూతివాద ధోరణులకు దారివేసింది.

అభ్యుదయ కవిత్వం మార్క్సిజమే సామాజిక సిద్ధాంతంగా సాహిత్యంలో ఏ ఉద్యమాలు ఉవ్వెత్తుగా లేచిన దానికి గొప్ప నేపథ్యముంది. ఇది ప్రధానంగా రాజకీయాలు కవితా వస్తువైనా, శిల్పం సొగసు దేరింది. శ్రమైక జీవన సౌందర్యం ప్రధాన కవితా వస్తువుగా మారి సామాజిక స్పృహతో చైతన్యాన్ని పెంపొందించుకుంది. ఈ కాలంలో వచ్చిన శ్రీశ్రీ, మహాప్రస్థానం, అనిసెట్టి - అగ్నివీణ, ఆరుద్ర - త్వమేవాహం, కె.వి.ఆర్., సోమసుందర్ - వజ్రాయుధం, గంగినేని - ఉదయిని, నారపరెడ్డి - అశ్రుమాల, రెంటాల - సర్పయాగం, శ్రీరంగం నారాయణబాబు - రుధిరజ్యోతి మొదలగు సంపుటాలతో, ఉద్యమ తీవ్రతతో శిల్ప శక్తిని పొందింది.

అయితే ఉద్యమ విరామం - తరువాత శిల్ప ప్రాధాన్యం పెరిగింది. మానవతా ధోరణిలో తిలక్ కవితా శిల్పం రాణించింది. ఈ కాలంలో రూప పరిణామం పెంపొందిందని అంటారు. వచన కవితా రూప పరిణామంలో పద్యం, గేయం, వచన కవిత్వం వేరు వేరు ప్రక్రియలకు, కథా కావ్యం, దీర్ఘకావ్యాలు, మిని, కవితా ప్రక్రియలుగా రూప విప్లవాన్ని తీసుకొచ్చాయని బైరాగి, అజంతా కాళోజీ మొదలగువారు ఈ పరిణామ క్రమానికి మొదటి వరుసలో నిలిచారు.

దిగంబర కవిత్వం అభ్యుదయా నంతర ధోరణుల్లో ముఖ్యమైంది. స్తబ్ధత ఆవహించిన సమాజాన్ని షాక్ ట్రీట్‌మెంట్ ద్వారా గొప్ప కుదుపుకి, సంచలనానికి, చైతన్యానికి గురిచేసింది. వీరిలోని నిజాయితీ,

——————* * *——————

**తాత్వికంగా చూస్తే సృష్టిలోని ప్రతి వస్తువూ ప్రతీకాత్మకమే. కవిని ఒక వస్తువును అనుభూతి చెందడం ద్వారా ఆ అనుభూతిని ఉన్నదున్నట్లుగా చెప్పటానికి ప్రతీక కంటే అనువైన సాధనం లేదంటారు. ప్రతి వస్తువు, వ్యక్తిలోని అనేకమైన అనుభూతుల్ని అంతరంగంలో అత్యంత సంకీర్ణంగా రగిలిస్తుందంటారు.**

——————* * *——————

ధర్మక్రోధం, గొప్ప ప్రతిభ, సంపన్నత్వం కలిగిన కవులూ వున్నారు. దీనిని కొందరు ఆస్వాదించ లేక పోయారు. వీరిలో చెరబండ రాజు, నగ్ను ముని, మహాస్వప్న మొదలగు వారిలో గొప్ప కవితా శిల్పం వుందనడంలో సందేహం లేదు.

విప్లవ కవిత్వం - మార్క్సిజం నేపథ్యంగా వచ్చిన కవిత్వంలో విప్లవ కవిత్వం ప్రధానంగా మార్క్సిజం - లెనినిజం - మావో ఆలోచనా విధానం వెలుగులో కాగా, విస్తృతి నినదించింది. విప్లవ కవులకు అంతర్జాతీయ అంశాలు, విదేశాల్లోని విముక్తి పోరాటాలు, సామాజిక సంఘర్షణలు రాజ్యాంగ హింస మీదా, ప్రజా కవుల పోరాటం మీద, అనేక సూక్ష్మ దోపిడీ రూపాల మీదా, స్త్రీ పురుష సంబంధాల మీదా కవిత్వం రాశారు. స్త్రీ పురుష సంబంధాలు, కార్మిక వర్గ దృష్టి వచ్చిన కవులలో శివసాగర్, కె. శివారెడ్డి, వరవరరావు, అద్దేపల్లి రామ్మోహనరావు, శేషేంద్రశర్మ, నగ్నముని తదితరులు తమ శక్తివంతమైన పాత్ర నిర్వహించారు.

మినీ కవిత్వం వచన కవిత్వంలో ఒక ప్రక్రియ భేదంగా వచ్చిన కవితా ఉద్యమం. ఇలాంటి కవితా ధోరణిపై అద్దేపల్లి, రావి రంగారావు జింబో, ముదిగొండ వీరభద్రయ్య, నల్లా నరసింహమూర్తి దీని గొప్పతనాన్ని వ్యాఖ్యానించారు.

అసలు ప్రతీకంటే ఏమిటో, ఈ కవిత్వ నిర్మాణ పద్ధతుల్లో వీటి ప్రాధాన్యత పాత్ర ఏమిటి అనే దానిని పరిశోధకులయిన వీరు ఇలా చెబుతారు.

తాత్వికంగా చూస్తే సృష్టిలోని ప్రతి వస్తువూ ప్రతీకాత్మకమే. కవిని ఒక వస్తువును అనుభూతి చెందడం ద్వారా ఆ అనుభూతిని ఉన్నదున్నట్లుగా చెప్పటానికి ప్రతీక కంటే అనువైన సాధనం లేదంటారు. ప్రతి వస్తువు, వ్యక్తిలోని అనేకమైన అనుభూతుల్ని అంతరంగంలో అత్యంత సంకీర్ణంగా రగిలిస్తుందంటారు. కవి ప్రయోగించిన ప్రతీక. అనుభూతి కేంద్రమైన మరో వస్తువును చెప్పడం ద్వారా అసలు వస్తువుని స్ఫురింప జేయడం ప్రతీక వినియోగమవు తుందంటారు. ఇదే కప్పి చెప్పేది కవిత్వం. విప్పి చెప్పేది విమర్శగా పేర్కొన్నారు విమర్శకులు.

శ్రీశ్రీ మహాప్రస్థానంలోని పురాణ ప్రతీకల వినియోగ విశ్లేషణలు. శ్రీరంగం నారాయణ గద్దిపరక, రుధిరజ్యోతిలోని అంశాలను, ఆరుద్ర త్వమేవాహంలో కాలానికి గడియారం ప్రతీకగా, ఇసుక గడియారం, నిమిషాలు, గంటలు, సెకన్లు, స్టాప్‌వాచ్ మొదలగు ప్రతీకల నిర్వహణను చూడవచ్చు. శేషేంద్ర నా దేశం - నా ప్రజలులోను, ఆధునిక మహాభారతంలోను, నగ్నముని కొయ్యగుర్రంలోను, కె. శివారెడ్డి ఆసుపత్రి గీతం, డాక్టర్ సి. నారాయణరెడ్డి మట్టిమనిషి ఆకాశంలో, వరవరరావు సముద్రంలో, అద్దేపల్లి మెరుపు పువ్వులోనూ ఈ ప్రతీకాత్మకత నిర్వహించిన తీరు వివరించారు.

భావచిత్రం మరొక అంశం. ఈ భావచిత్రంలో తన భావధారతో పఠితను ముంచెత్తే స్థితిలో అలంకారం ఆకారాన్నిస్తుంది. అనుభూతి జీవశక్తినిస్తుంది. కవిత్వాభివ్యక్తి భావచిత్రమవుతుంది. అంటే ఒక పదార్థానికి సంబంధించిన పోలికను చెప్పటంలో ఆ పదార్థ సౌందర్యం దగ్గరే ఆగిపోకుండా అనేక అంశాల సమ్మేళనం లోని నవ్యత వలన సందర్భానికి తగిన ఒక భావనని, ఒక అవస్థని ప్రతిబింబించి నట్లయితే అది కేవలం చిత్రం కాకుండా భావచిత్రమవుతుందంటారు పరిశోధకులు.

భావచిత్రాల్లాంటి రూపకాది అలంకారాల వల్ల అనుభూతిని అందించే అభివ్యక్తిలో సమగ్రత గోచరించదు.

ఎజ్రాపౌండ్ Imagision అనే భావచిత్రవాదాన్ని ప్రారంభకుడుగా కనిపిస్తారు. భావచిత్రవాదం రాను రాను అతి విస్తృతమై అనేకమైన అంశాలతో ఆధునిక కవిత్వాన్ని పరిపుష్టం చేసింది. డాక్టర్ ధర్మశీల ఇలా అంటారు. భావచిత్రం గురించి చెబుతూ భావచిత్రం రసం యొక్క వ్యక్తీకరణ, అలంకారానికి చెందిన శోభ, వ్యంజన యొక్క వక్రత, సంగీతం యొక్క ధ్వని సాధన, చిత్రలేఖనం యొక్క భావబోధన శక్తి, శైలి యొక్క వైయక్తిక శక్తి కలబోసిన సమగ్ర సమాహారం.

ముఖ్యంగా 19వ శతాబ్దంలో గురజాడ కవితల్లోను భావకవుల్లో గొప్ప కవిగా చెబుతున్న దేవులపల్లి కృష్ణశాస్త్రి రచనల్లో అలాగే, శ్రీరంగం నారాయణబాబు రుధిర జ్యోతి, అలాగ మహాకవి శ్రీశ్రీ మహాప్రస్థానం నిండా భావచిత్రాలే పర్చుకొన్నాయి.

భావచిత్ర నిర్మాణం తెలిసిన గొప్ప కవి తిలక్ రాత్రివేళ వినిపించే గానం చీకటి కాగితం మీద ప్లాటినం తీగలా ఉన్నదనటం ఒక గొప్ప భావచిత్రం. అజంతా పాశ్చాత్య కవిత్వ ప్రభావంతో భావచిత్రాల నిర్మాణం బాగా ప్రయోగించిన కవిత చెట్లు కూలుతున్న దృశ్యం అనే కవితను రాశాడు. నండూరి సుబ్బారావు, గుంటూరు శేషేంద్రశర్మ, అద్దేపల్లి రక్తసంధ్య (కవితా సంపుటి)లోను, ఇంద్రకంటి శ్రీకాంత శర్మ మొదలగు రచనల్లో ప్రయోగించిన తీరు కన్పిస్తుంది.

90ల తర్వాత కవిత్వంలో పెరిగిన శిల్ప స్పృహ బలంగా అభ్యుదయ, విప్లవ, దిగంబర కవిత్వంలో ఈ స్పృహ బలంగా కన్పిస్తుంది. దేవి ప్రియ, ఇస్మాయిల్, పాపినేని శివశంకర్ కొప్పర్తి, వేగుండి మోహన్‌ప్రసాద్, భగ్వాన్, తుమ్మల దేవరాల్ కచ్చూరంలోను, వఝల శివకుమార్, ఇటీవలి ఎస్.ఆర్. భల్లం మొదలగువారిలో కనిపిస్తాయి.

వివిధ అస్తిత్వవాదాల్లో ప్రతీకలు ఇటీవల కన్పిస్తాయి. ఆకెళ్ళ రవి ప్రకాష్, విన్నకోట రవిశంకర్, పెన్నా శివరామకృష్ణ మొదలగు వారిలోను, స్త్రీవాద కవిత్వంలో ప్రతీకలు, భావచిత్రాలు, స్త్రీవాద, దళితవాద కవిత్వంలో, బి.సి. వాద కవిత్వంలోను, మైనార్టీ వాద కవిత్వంలోను, ఆధునికాంత వాద కవిత్వం లోనూ షాజహానా 'మో' సుమనశ్రీ, సీతారాం, ఎం.ఎస్. నాయుడు, పులిపాటి గురుస్వామి, సిద్దార్థ దేశీయ అస్తిత్వ వాదంలో వచ్చిన కవిత్వంలో ఈ భావచిత్రాలు ప్రతీకలు ఏ విధంగా పర్చుకున్నాయో పరిశోధకులు బలంగా నిరూపించి తన పరిశోధన వ్యాసంగంలో మనల్ని వర్తమాన కావ్య ఘనతను తెలియచెప్పారు. దీనికి పర్యవేక్షకులుగా వ్యవహరించిన ప్రఖ్యాత కవి డాక్టర్ అద్దేపల్లి రామమోహనరావు ముందుమాటలో తెలియజేస్తూ "ఇదే వస్తువును తీసుకుని సోదాహరణంగా, సవ్యాఖ్యానంగా లంకా వేంకటేశ్వర్లు ఈ గ్రంథం రాయడం గొప్ప ప్రయత్నం. ఈ దిశగా జరగవలసిన విమర్శకు దారి దీపమవుతుందని" అనడంలో సత్యముంది. ఈ అంశంపై బలమైన, లోతైన విశ్లేషణ జరగవలసి వుంది. ఈ అంశాలు ప్రతీకలు, భావచిత్రాల విశేషాలను మరిన్ని చెప్పడానికి రానున్న కాలంలో ఇదొక మంచి సాధనమని చెప్పవచ్చు. పరిశోధకులు లంకా వేంకటేశ్వర్లు కృషి సార్ధకత వహించింది. వారికి ఈ గ్రంథం అందించినందుకు అభినందనలు తెలియజేస్తూ మరింత సాహితీ విమర్శలో కృషి చేయవలసిందిగా కోరుతున్నాము.

---



# ఏనుగంత దేశం

**తుల్లిమల్లి విల్సన్ సుధాకర్**

అడవి తోడేళ్ళు కాపలా ఉన్నట్లు
భయాన్ని అతికించుకున్న పాదాలు
అంగారక గ్రహం మీద నుంచి భూమికి దిగినట్లు
బెరుకుగా పొదలచాటుకు వెళ్తున్నాయి...
తలలు ఒంగిపోయి
హృదయాలు వేగంగా కొట్టుకుంటున్నాయి.
గాలిలోకి బాణం వదిలి
బాణం కింద పడ్డచోటే
ప్రకృతి పిలుపులకు సమాధానాలు...
కపాలం లోతులకు తవ్వి
కట్టడాలు కట్టేవాళ్ళకు టాయిలెట్ కట్టడాలైనా లేవు
మరుగే అందరి సమస్యానూ...
ఒడిస్సీ అన్వేషణే అందరిదీనూ...

ఒక్కరోజైనా కాలినడకన పేదల మధ్యకు వెళ్ళనోణ్ణి
చర్మాన్ని ఖడ్గ మృగమంత మందం చేసుకున్నోణ్ణి
ఇంట్లో టాయిలెట్ లేకపోయినా
లార్డ్‌మేయో అంత గొప్పోణ్ణి చేసి
స్థానిక ఎన్నికల్లో గెలిపించేస్తున్నాం...
ఇంట్లో మరుగులేనోడు దేశానికేమి చేస్తాడో...!!

వేలెడంతలేని నాయిపాల్
ఏనుగంత ఉపఖండాన్ని
ఏషియన్ సూపర్ పవర్ దేశాన్ని వేలెత్తి చూపుతున్నాడు
మానవచెత్తకు నిర్వచనంగా...

నృత్యాలూ... నాటకాలూ... పాటలూ... పద్యాలూ...
ఈ భౌతికకాయం చేసే నయనానందకర
సుందర విన్యాసాలెన్నని...!
ఏ అభినందనలూ పొందని విసర్జనావయవాల్ని
అనాటమీ చేసి తీసిపారేద్దామా...?
తిండి తగ్గిస్తూ ఇంద్రియాల్ని నిగ్రహించుకుందామా...!

జననేంద్రియాల విసర్జనేంద్రియాల దూరాన్ని
ఎలా లెఖ్ఖ కడదాం?
హిపోక్రసీకి - సంస్కృతికీ మధ్య దూరాన్ని
ఏ కొలబద్దతో కొలుద్దాం...?
మరుగుదొడ్లు లేని దేశంలో
మనుషుల్ని రోదసీకి పంపే ఆలోచనల్ని
ఎలా అర్థం చేసుకుందాం...?

హే ప్రభూ! గాజులకు ప్రకృతి పిలుపులు
ఒంటరి అనుభవాలెప్పుడౌతాయి...!
మరుగులేని మర్మావయవాల ఘోష ఎప్పుడాగుతుంది...!

ఇప్పుడు కలుషితం కానిదేదీ లేదు!
విలువలపై హిపోక్రసీలూ - భారతీయతపై అబద్ధాలూ
నీరూ - నిప్పూ - ఆహారం - పీల్చే గాలీ...
మానవ చెత్తలోంచి ఊపిరి పీల్చుకునే ఒక్క ఈగ చాలు
వంద పులులకంటే ప్రమాదం కావడానికి....
నిశ్శబ్దంలో మనం చేసే తప్పు చాలు
వేయి తుపాకుల మోత కంటే బలమైంది కావడానికి
సైలెంట్ ఎమర్జెన్సీ విధించడానికి...

# మాయాబజార్



డా॥ ఎం. హరికిషన్

"ఏమే... పేపరొచ్చిందా"

"అబ్బబ్బబ్బా.... ఇప్పటికి పదిసార్లడిగి వుంటావు. వచ్చిందా... వచ్చిందా అని. ఏం వస్తే దాచిపెట్టుకుంటామా... అయినా పొద్దున్నే కాలు మీద కాలేసుకొని తీరిగ్గా పేపరు చదివే బదులు కాస్త ఏదైనా సాయం చేయొచ్చు గదా... మన పక్కింటి వెంకట రాము లేదూ... అదే రాములమ్మ మొగుడు... పొద్దున లేసినప్పటి నుండీ ఏమే... ఏమే... అంటూ వంటింట్లోనే తిరుగుతా అవసరమైన పనులన్నీ చేస్తుంటా ఉంట... నువ్వున్నావెందుకు... కనీసం కాఫీకూడా లోపలికొచ్చి తీసకపోవు... ఖర్మ... ఖర్మ... పూర్వ జన్మలో ఏం పాపం చేసుకున్నానో ఏమో... అదే మా సుంకన్న చిన్నాయనయితే... వాళ్ళింట్లో....

వెంకటేశం అదిరిపడ్డాడు. ఆమె నోరు తెరిచిందా ఆగదు. ఎక్స్‌ప్రెస్ బండిలెక్క నాన్‌స్టాప్‌గా దూసుకుపోతూనే వుంటాది. గబగబా వరండాలోకొచ్చి.. కుర్చీలో కూచొని... అప్పటికే అక్కడ పెట్టేసిన కాఫీని తాగుతా మాటిమాటికీ ఏ చిన్న శబ్దమయినా గేటు వైపే చూడసాగాడు. పేపరు బాయేమోనని...

అంతలో 'పేపర్' అనే అరుపుతో బాటు వేగంగా ఒక పేపరు గాలిలో సర్రుమని దూసుకొనొచ్చి గోడకు కొట్టుకొని దభీమని కిందపడింది. కాఫీగ్లాసు పక్కనపెట్టి గబగబా వెళ్ళి పేపరు చేతిలోకి తీసుకున్నాడు.

వార్తలు, సినిమాలు, క్రీడలు, షేర్ మార్కెట్ ఏవీ పట్టిచ్చుకోకుండా గబగబా తిప్పసాగాడు. కళ్ళు పరుగులు తీస్తా వారఫలాలు అనే చోట ఆగిపోయాయి. ముఖమంతా టెన్షన్‌గా వుంది. గబగబా చదవసాగాడు.

మేషం (మార్చి 22 - ఏప్రిల్ 20) : (రాశ్యాధిపతి - బుధుడు) - కొత్త మిత్రులతో పరిచయాలు, ఆర్థిక లాభం వుంటాయి. అనుకోని సంఘటనలు జరుగుతాయి. శ్రమకు తగ్గ ఫలితం దక్కుతుంది. బంధువుల నుంచి శుభవార్తలు వింటారు. శని ప్రభావం కాస్త వుండటం చేత ఆఫీసులో ప్రశాంతంగా వున్నా ఇంట్లో మాత్రం చికాకులు తప్పవు. ఎర్రవత్తులు అష్ట మూలికా తైలంతో కలిపి దీపారాధన చేయడం వల్ల అన్ని కష్టాలు తొలగిపోతాయి.

రెండు, మూడుసార్లు చదువుకొన్నాడు. దాదాపు అంతా బాగానే వుంది. ఏదైనా వున్నా దీపారాధనతో పోతుంది కాబట్టి ఫరవాలేదు - ఇంట్లో చికాకులు ఎప్పుడూ వుండేవే. చచ్చేదాకా వదలవు అనుకున్నాడు.

పేపరు ముందు వైపుకి తిప్పి నింపాదిగా వార్తలు చదువుకోసాగాడు.

అంతలో...

"బావా..." అని ఒక పిలుపు వినపబడింది.

తలెత్తి చూస్తే ఎదురుగా చిన్న బావమరిది సుధాకర్. ఒక చేత్తో సూట్‌కేసూ, మరొక చేత్తో అరటిపండ్లు పట్టుకొని చిరునవ్వులు నవ్వుతా కనబడ్డాడు.

"ఏరోయ్... దారి తప్పి వచ్చినావా... ఇంత పొద్దున్నే... ఏంది సంగతి" అంటా పలకరిస్తా. "ఏమేవ్... మీ తమ్ముడొచ్చినాడు చూడు" అని అరచినాడు లోపలికి వినబడేటట్లుగా.

వంటగదిలోంచి మహాలక్ష్మి పరుగులాంటి నడకతో బైటకొచ్చి తమ్ముడు కనబడగానే చిరునవ్వులు చిందిస్తా "ఏరా... బాగున్నవా... ఎన్ని రోజులైంది నిన్ను చూసి... ఇంటికాడ అమ్మా నాన్నా అంతా బాగున్నారా... పిల్లలెట్లున్నారు... పెద్దదీ ఏదో

ఏడో తరగతి గదా... బాగా చదువుతుందా... అవునూ మన వెనకింటి సుబ్బమ్మకు..." మాటల మధ్యలో వెంకటేశం అడ్డుపడి.

'ఆగే... ఎందుకట్లా వాన్ని లోపలికి రానీయకుండా గుమ్మం కాణ్ణే నిలబెట్టి గుక్క తిప్పుకోకుండా మాట్లాడతావే. ముందు కడుక్కోవడానికి నీళ్ళిచ్చి... కాస్త కాఫీ ఇయ్యి. ప్రయాణం చేసి అలసిపోయుంటాడు" అన్నాడు.

సుధాకర్ లోపలికి పోగానే వెంకటేశం మళ్ళీ వార్తల్లో మునిగిపోయాడు. ఒక అరగంట తర్వాత "ఏం బావా... ఇంకా ఆఫీసుకు టైం కాలేదా" అంటూ కాఫీ గ్లాసుతో వచ్చిన పక్కన కూచున్నాడు సుధాకర్.

"ఇంకా టైముందిలే గానీ... ఏం ఇట్లా వచ్చినావ్... టౌన్లో ఏమయినా పనుందా."

"అవును బావా... మా స్నేహితుని పెండ్లి.. ఎట్లాగూ వచ్చినాను గదా... నిన్నూ అక్కనూ పిల్లలనూ చూసినట్లుంటాదని ఇట్లా వచ్చినా... ఇంకో గంటలో పోవాల.



"అవునూ... ఈ మధ్య నువ్వు యవసాయంగాక ఇంకా దేంట్లోనే చేరినావంటనే... మీ అక్క చెప్పింది."

"అదా... అదీ... మనీ సర్క్యులేషన్. స్కీమ్సున్నాయిగదా బావా... అట్లాంటిదే... కాకపోతే దీండ్లలో సభ్యులని చేర్పించడంతో బాటు కంపెనీ సరుకులు గూడా అమ్మాలంట. మనూర్లో చానా మంది చేరినారు. చానా చోట్ల లక్షలకు లక్షలు సంపాదిస్తున్నారంట. మనూరి పెద్ద డాక్టరు చెబితే నేను కూడా మొన్న మొన్నే చేరినా... చూడాలి ఎలా ఉంటుందో...

వెంకటేశం అప్పటి వరకు అట్లాంటివి ఏవీ వినలేదు. దాంతో పెద్దగా అర్థం కాలేదు. ఏదో అడుగుదామని నోరు తెరిచేంతలోగా... ఇంటిని పరిశీలనగా చూస్తున్న సుధాకర్ "బావా... ఇంట్లో ఏదో మార్పులు చేసినట్లున్నావే ఈశాన్యం వేపు" అనడిగాడు.

దానికి వెంకటేశం చిరునవ్వు నవ్వి "అవున్రా... వాస్తు బాగాలేక పోతేనేం... ఈ ఇంట్లో చేరినాకనే గదా మా నాయన గుండెనొప్పొచ్చి చచ్చిపోయింది. మన చిన్నోడు గూడా ఇక్కడ చేరినప్పటి నుంచే ఎంత కష్టపడి చదువుతున్నా పది తప్పుతూనే వున్నాడు. ఈ మధ్యనే మీ అక్క కూడా బాత్రూమ్‌లో కాలుజారి కీలు విరగ్గొట్టుకుంది... ఇలా ఒకదానిమీదొకటి జరుగుతా వుంటే అనుమానమొచ్చి శాస్త్రులు గారిని పిలిపించినా... ద్వారం ఉత్తర వాయువ్యంలో ఉండగూడదంట. దాన్ని తూర్పు ఈశాన్యం వైపు పెడితే కష్టాలు తొలుగుతాయి అన్నాడు. అలాగే ఈశాన్యంలో స్థలం ఎక్కువ వదులుతే వంశవృద్ధి, అత్యధిక భోగభాగ్య సంపదలు, గౌరవ మర్యాదలు కలుగుతాయంట. దాన్తో శాస్త్రులుగారు చెప్పినట్లే నలభైవేలు ఖర్చు పెట్టి ఈ మధ్యే మార్పులు చేయించినా అన్నాడు.

వాస్తు గురించి, దాని ప్రాముఖ్యం గురించి చెబ్తా వుంటే మాటల్లోనే వెంకటేశానికి ఆఫీసుకి టైమయింది. గబగబా స్నానం చేసి, టిఫిన్ తిని పోయొస్తానంటూ బామ్మర్దికి చెప్పి ఆఫీసుకి చేరుకున్నాడు.

ఆఫీసులో కూచున్న కాసేపటికే "బాస్ పిలుస్తున్నాడు రావాలంట' అనే పిలుపొచ్చింది.

బాసంటే అందరికీ హడల్. కరిచే కుక్కలాగా మొహం గంటుపెట్టుకుని వుంటాడు. ఏదయినా పొరపాటు జరిగిందా మీద పడి కొరుకుతాడు.

భయం భయంగానే తలుపు దగ్గరి కెళ్ళి 'మే ఐ కమిన్నా...." అన్నాడు వినయంగా.

"కమిన్... కమిన్..." అంటూ వినిపించింది.

తలుపు శబ్దం రాకుండా నెమ్మదిగా తీసుకొని లోపలికి పోయి వినయంగా ఒక పక్కకు ఒదిగి నిలబడ్డాడు.

"కూచో వెంకటేశం... అలా నిలబడ్డావేమి" చిరునవ్వుతో అన్నాడు. ఆ మాటలో అదునుకి వర్షం పడ్డ రాయలసీమ రైతులా వెంకటేశం పులకించిపోయాడు. ఎప్పుడు ఆఫీసుని గురించి మాత్రమే మాట్లాడే బాస్ ఆ రోజు ఇంటి గురించి, ఖర్చుల గురించి, పిల్లల గురించి, బాధల గురించి ఒక అరగంట సేపు మాట్లాడాడు వెంకటేశం బాధలన్నీ ఓపిగ్గా విని.

"అదిగాదు వెంకటేశం... ఇలా ఒక్క జీతంతో ఎంతకాలమని ఇలా బదుకుతావ్ చెప్పు. తక్కువ పెట్టుబడితో తక్కువ సమయంలో ఎక్కువ సంపాదించే పార్ట్ టైమ్ జాబేదైనా చేసుకోకూడదూ" సలహా ఇచ్చాడు.

"అంత డబ్బొచ్చేటివి ఏముంటాయి సా" అన్నాడు వెంకటేశం.

బాస్ చిరునవ్వు నవ్వుతా "చూడు వెంకటేశం... అన్ లిమిటెడ్ అని ఒక కొత్త కంపెనీ... చానా మంచి స్కీమొకటి ప్రవేశపెట్టింది. ఇందులో నెలనెలా టార్గెట్లు లేవు. కొత్త సభ్యులను పెద్దగా చేర్పించాల్సిన అవసరమూ లేదు. జస్ట్ ఇద్దరు చాలంతే. ఏబీ అని. వాళ్ళు మరో ఇద్దర్ని... ఆ నలుగురు మరో ఇద్దర్ని... ఆ ఎనిమిది మంది మరో ఇద్దర్ని... ఆ పదహారుమంది మరో ఇద్దర్ని... ఇట్లా చైన్ పెరుగుతున్న కొద్దీ మనకొచ్చే కమిషన్ కూడా వూహించనంతగా పెరిగిపోతుంది.

నేను కూడా మొదట నమ్మలేదు గానీ... విజయవాడలో ఉమామహేశ్వరరావు మా మిత్రుడు ఎమ్మార్వో ఎంత కాదన్నా నెలకు మూడు లక్షలకు పైనే కమిషన్ సంపాదిస్తా వున్నాడు. పెద్దగా కష్టపడిందీ లేదు... తిరిగిందీ లేదు... జస్ట్ 26వేలు కట్టినాడు...ఇద్దరిని చేర్పించినాడు. అంతే... ఇద్దరంటే ఎంతసేపు చెప్పు సాయంకాలం అలా ఒక రౌండేసొస్తే చాలు... చిక్కిపోతారు... మనకింద పదహారుమంది చేర్తేనే మన పెట్టుబడి మనకి తిరిగొచ్చేస్తాది. ఆ పైనంతా లాభమే. ఒక స్టేజ్ వరకు మనం కష్టపడితే ఆపైన డబ్బు దానంతటదే వళ్లోకొచ్చి వాల్తాది.

అంతకన్నా ముఖ్యమైన విషయం ఇంకోటుంది. మనం డబ్బు కడతాం గదా... అప్పుడు వాళ్ళు మనకొక పెయింటింగ్ ఇస్తారు. పెయింటింగ్ అంటే మామూలు అల్లాటప్పాది గాదు. ఇంటర్నేషనల్ ఫేమస్ ఆర్టిస్ట్ చేత గీయించి ఇస్తారు. ఇక్కడ మన దేశంలో వాటి విలువ ఎవరికీ పెద్దగా తెలీదు గానీ ఫారిన్ కంట్రీస్‌లో ఆర్ట్సంటే పడి చస్తారు. బొమ్మ పాతగవుతున్న కొద్దీ నగరం నడిబొడ్డులోని స్థలంలా దాని విలువ దిన దినానికి పెరిగిపోతా వుంటాది. దాన్ని మనమే పోయి అమ్ముకోవాల్సిన అవసరం కూడా లేదు. అన్నీ కంపెనీయే ఆన్‌లైన్‌లో ఒక వెబ్‌సైట్ ఓపెన్ చేసి పెట్టేస్తాది. ఆ పెయింటింగ్ నచ్చినవాళ్ళు స్వయంగా మనల్నే కాంటాక్ట్ చేస్తారు. రేటొచ్చినప్పుడు అమ్ముకోవచ్చు. ఇలా రెండు వైపులా లాభం... ఏమంటావ్" అన్నాడు.

వెంకటేశం ఆలోచనలో పడ్డాడు. ఎదురుగా వుండేది తన పై అధికారి. కాదంటే అవసరానికి పలుకుతాడో... పలకడో... ఎలాగబ్బా... అని మొహమాటంతో ఏమీ చెప్పలేక సతమతమవసాగాడు. అప్పటికీ తనతో, తన అధికారంతో అవసరం పడి వచ్చే అనేకమందిని అనేక స్కీముల్లో చేర్పిస్తూ రెండు చేతులతో సంపాదిస్తున్న బాస్ వెంకటేశం పరిస్థితిని గమనించి 'ఈరోజు సాయంత్రం మీటింగుంది... సునయనా ఆడిటోరియంలో... ఆఫీసవగానే పోదాం. రెడీగుండు' అన్నాడు.

వెంకటేశం అలాగేనని తలూపుతా బైటకొచ్చాడు. పొద్దేన్నే బావమరిది చెప్పిన విషయాలు గుర్తుకొచ్చాయి. పేపర్లో చదివిన రాశిఫలాలు కండ్ల ముందు కదులుతున్నాయి. శ్రమకు తగ్గ ఫలితం, ఆర్థికలాభం గుర్తుకొచ్చాయి. ఆలోచించసాగాడు. ఇద్దరిని చేర్పించడం ఏమంత కష్టం గాదు. అర్థమయ్యేటట్టు చెబితే ఎవరైనా ఇట్టే చేరిపోతారు. మాటల్తో కాస్త కన్విన్స్ చేయాలంతే. అంతలో 26వేలు కట్టాలని గుర్తుకొచ్చింది. అమౌంటెక్కువ. రిస్కవుతుందా అని సందేహమొచ్చింది. ఒకవైపు లక్షలు... మరొకవైపు వేలు... అటూ యిటూ లాగసాగాయి. పని చేయబుద్ధి కాలేదు. ఆలోచనల్లోనే సాయంత్రమయింది.



'ఏం వెంకటేశం... పనయిందా' అనే పిలుపు ఆప్యాయంగా వినబడింది. ఎదురుగా బాస్ చిరునవ్వుతో. "ఆ...ఆ... అంటూ అన్నీ కట్టేసి బాస్ వెంట బైలుదేరాడు. బాస్ ఆ కంపెనీ గురించి అనేక విశేషాలు వివరిస్తా... మధ్యలో ఒక ఖరీదైన హోటల్లో టిఫిన్ తినిపించి, ఆరున్నరకల్లా సునయనా ఆడిటోరియంకి తీసుకుపోయాడు.

అక్కడంతా హడావిడిగా వుంది. అనేకమంది సూటూ బూటూ వేసుకొని... టిప్‌టాప్‌గా... డాక్టర్లు... ఇంజనీర్లు, పెద్ద పెద్ద గెజిటెడ్ ఆఫీసర్లు, నగర ప్రముఖులు అటు ఇటూ తిరుగుతా కనిపించారు. వాళ్ళను చూసి ఆశ్చర్యపోయాడు. నెమ్మదిగా కంపెనీ మీద నమ్మకం కుదరసాగింది. కాసేపటికి సమావేశం ప్రారంభమైంది. చాలామంది ప్రముఖులు తక్కువ పెట్టుబడితో, తక్కువ సమయంలో, ఎలా అద్భుతమైన ఫలితాలు రాబట్టవచ్చో.. ఎక్కడెక్కడ ఎవరెవరు ఎంతెంత సంపాదించారో వివరించసాగారు. కాసేపటికి కంపెనీకి చెందినతను ప్రసంగం మొదలుపెట్టాడు.

"ముందుగా మీరు మీ మనసుల్లో నెగిటివ్ ఆలోచనలు పారద్రోలండి. మన అభివృద్ధికి ప్రధాన ఆటంకం అవే. పాజిటివ్‌గా ఆలోచించేవాళ్ళే విజయం సాధించగలరు. పెదాలపై చెరగని చిరునవ్వు... అవతలి వాళ్ళను సమ్మోహనపరిచే మాటకారితనం... కొత్త వాళ్ళ మధ్య చొరవగా చొచ్చుకుపోవడం... టార్గెట్లను జాగ్రత్తగా ఎన్నుకోవడం... ఛేదించడం... ఇవే మన విజయ రహస్యాలు. మొహమాటం, సిగ్గు, బిడియం వదిలేయండి. ఓటమిని స్పోర్టివ్‌గా తీసుకోండి. పడిలేచే కెరటాల్లా పరుగులెత్తండి. డబ్బును సంపాదించడం చాలా సులభం. కావలసింది కొంచెం పెట్టుబడి. కొంచెం తెలివితేటలు. కొండంత నమ్మకం మాత్రమే. అవి మీకుంటే మీరు అద్భుతాలు సాధించగలరు. నమ్మలేని విజయాలు సొంతం చేసుకోగలరు. మీ జీవితం ఒక్కసారిగా మారిపోతుంది. మీ కలలను నిజం చేసుకునే అరుదైన, అద్భుతమైన అవకాశమిది. జస్ట్ మీనిట్. ఒక్క విషయం గుర్తుంచుకోండి. తెలివైన వాడెప్పుడూ అందరిలా ఆలోచించడు." ఇలా ప్రసంగిస్తావుంటే...

వెంకటేశం నరనరాల్లో ఏదో అలజడి... ఏదో ఆవేశం... ఉరకలెత్తే ఉత్సాహం... కండ్ల ముందు ఏవేవో దృశ్యాలు... పెదాల పైకి మాటిమాటికి చిరునవ్వు దూసుకు రాసాగింది. ముఖం ఆనందంతో వెలిగిపోసాగింది. రాశిఫలాలు విజయోస్తు, విజయోస్తు' అని దీవించినట్టనిపించసాగింది.

మీటింగయిపోగానే "మంచిరోజు చూసుకుని చేరతా సార్" అన్నాడు.

'వేడిమీద ఉండగానే కొట్టాల' అనే సూత్రం బాగా తెలిసిన బాస్ "చూడు... రేపు... ఎల్లుండి... అంటూ వాయిదాలేస్తూ... వాన్నడిగి, వీన్నడిగి ఆలస్యం చేస్తూ వుంటే నువ్ చేరేనాటికే జరగాల్సిన నష్టం జరిగిపోతాది. ఇట్లాంటి వాటిల్లో వేగం ముఖ్యం. ముందు ఎవడు కాలుపెడతాడో వాడే విజేత. జాగ్రత్త. ఆలస్యం చేయకు' అని హెచ్చరించి కార్లో ఇంటి దగ్గర దింపి వెళ్ళిపోయాడు.

వెంకటేశం తలస్నానం చేసి ఎర్ర ఒత్తులు అష్టమూలికా తైలంలో అద్ది భగవంతునికి దీపారాధన చేసి అర్ధగంట సేపు అష్టోత్తరాలు చదివాడు.

నిర్మలమైన మనసుతో క్యాలెండర్ ముందు పెట్టుకుని మంచిరోజు కోసం చూశాడు. రేపు నవమి ఎల్లుండి దశమి.. యస్ దశమి దివ్యమైన ముహూర్తం. రాహుకాలం సాయంత్రం మూడుదాకా వుంది. నాలుగు గంటలకు చేరితే శుభం. ఎదురేవుండదు అనుకున్నాడు.

వాలుకుర్చీలో వాలిపోయి ఆలోచనలో పడ్డాడు. "తెలివైన వాడెప్పుడూ అందరిలా ఆలోచించడు" అనే మాట పదే పదే గుర్తుకు రాసాగింది. ఇద్దరేం ఖర్మ ఇరవై మందినైనా సులభంగా చేర్పించవచ్చు అనుకున్నాడు. అంతలో అలా చేర్పిస్తే అనవసరంగా వేరే వాళ్ళకి లాభం గదా... నాకేంటి... అనుకున్నాడు. అంతలో మనసులో ఒక ఆలోచన తటిల్లతలా మెరిసింది.

ఎస్ నా కింద నా ఇద్దరు పిల్లల పేర్లను ఎబీలుగా చేర్పించి మిగతావాళ్ళని వాళ్ళకింద చేర్పిస్తే... లెక్కలేసుకున్నాడు. లాభాలు కండ్ల ముందు చుక్కలు చూపించాయి. "ఎస్... తెలివైన వాడెప్పుడూ అందరికన్నా ఒకడుగు ముందే వుంటాడు. అనుకున్నాడు. తన తెలివితేటలకు మురిసిపోతా పాస్‌బుక్ తెరిచాడు. ఎనభైవేలు పెద్దోని ఇంజనీరింగ్ కోసం దాచిపెట్టినవి కనబడ్డాయి. ఎంతసేపు తిరిగి సంపాదించడం... ఒక వారం కష్టపడితే చాలు అనుకున్నాడు.

అన్నం తిని పడుకున్నాడు. రాత్రంతా ఒకటే కలలు. కార్లు, షికార్లు, ఫైవ్‌స్టార్ హోటళ్ళు, వెన్నెలలో డిన్నర్లు, కోట్లు, సూట్లు... ఖరీదైన కలలు కంటూ నిద్రలోనే చిరునవ్వులు చిందిస్తూ అలాగే నిద్రపోయాడు.

భార్యాపిల్లలకు ఎవరికీ ఒక్క మాట కూడా చెప్పకుండా తర్వాత రోజు సాయంత్రం నాలుగు గంటలకు తాను చేరుతా, తనకింద ఇద్దరు పిల్లల పేర్లు ఏబీలుగా రాపించి వాళ్ళక్కూడా డబ్బులు కట్టేశాడు. ఒక్క దెబ్బకు మూడు పిట్టలు పడేసరికి బాస్ ఆనందంతో వుబ్బితబ్బిబ్బవుతూ "శభాష్... వెంకటేశం... ఈ ఆలోచన నాకు కూడా రాలేదు... శభాష్...శభాష్... నువ్వు సామాన్యునివి గాదు... ఇంగ దూసుకుపో" అన్నాడు భుజం తడుతూ.

తర్వాత రోజు సాయంత్రానికి మూడు చిత్రాలు అందించాడు. వాటిని తెరచి చూశాడు. రంగు రంగుల గీతలతో... చిత్ర విచిత్రంగా... అక్కడొక కాలు, ఇక్కడొక చేయి, విరిగిన జెండా,

పగిలిన కుండా, ముక్కులేని మూతి, తోకలేని కోతి, తగలబడుతున్న శవం, పెరిగిపోతున్న వృక్షం – స్పష్టాస్పష్టంగా... ఒక దాంట్లోకి మరొకటి చొచ్చుకుపోయి... తలా తోక తెలీకుండా... అర్థమయ్యీ కాకుండా వున్నాయి... పదే పదే పట్టి పట్టి చూశాడు. ఎంత ఆలోచించినా ఏమీ అర్థం కాలేదు.

"అద్భుతంగా వున్నాయి గదూ... ఆ మొదటిది ఫ్రాన్స్‌కి చెందిన మైకేల్ మైసన్, రెండోది అమెరికాకు చెందిన జేమ్స్ టాయీ, మూడోది ఇంగ్లండ్‌కు చెందిన డేవిడ్ ట్రామ్స్‌నే వేశారు. వాళ్ళ గురించిన వివరాలు ఇంటర్‌నెట్లో వున్నాయి. చూసేటట్లయితే చెప్పు అడ్రసిస్తా' అన్నాడు.

అర్థంకాకపోయినా అర్థం కాలేదంటే తెలివితక్కువోని కింద జమ కడ్తారని భయపడి... వాళ్ళ పేర్లు కూడా ఎప్పుడూ వినకున్నా..." చాలా బాగున్నాయి సార్... సూపర్' అన్నాడు చిరునవ్వులు ఒలకబోస్తూ...

ఫ్రేము కట్టించిన ఆ బొమ్మలని తీసుకపోయి ఒక్కడే కూర్చుని పదే పదే చూశాడు. సందేహమొచ్చి తలకిందులుగా కూడా చూశాడు. ఏమీ అర్థం కాలేదు. కొంతమంది స్నేహితులకి కూడా చూపించాడు. ఎవరూ ఏమీ చెప్పలేకపోయారు. ఎవరికీ అర్థం కాలేదంటే ఇవి అల్లాటప్పా పెయింటింగ్స్ కాదనుకున్నాడు. ఎంతయినా తెల్లోని బుర్రే బుర్ర. అందరికీ అర్థమయితే ఏముందిందులో గొప్పతనం. అని సమాధానపడి వాటిని ఇంటికి తీసుకుపోయి గోడ మీద వేలాడదీయబోయాడు.




పెండ్లాం ఆ బొమ్మలను చూసి అడ్డంపడి... "ఏమయింది నీకు. నిన్నటి వరకూ బానే వుంటివే... ఏ రామునిదో... కృష్ణునిదో... లేకుంటే... ఏ సీనరీనో... అదీగాకుంటే తెలుగు సిన్మాల్లో నటిస్తున్న ఏ చక్కని బాంబే హీరోయిన్దో తగిలియ్యక... ఇవేం బొమ్మలు... ముక్కూ మొహం తెలీకుండా... దిష్టి చుక్కల్లెక్క... తియ్... తియ్... ఎవరైనా చూస్తే నవ్విపోతారు. నీలెక్కనే మా వూర్లో ఒకాయనున్నాడు.... నారాయణని... ముక్కూ మొహం కనబడకుండా మొగమంతా నల్లగా పూసేస్తా అవేందో గొప్ప గొప్ప బొమ్మలని దబాయిస్తా, ఫోజులిస్తా వుంటాడు... ఆయన్లెక్కనే నీకు కూడా తిక్కపట్టినట్లుంది... అసలు... మాటల మధ్యలోనే వెంకటేశం గబగబా అవన్నీ తెగేసి "ఈ దిష్టిచుక్కలే రేప్పొద్దున లక్ష్మీ దేవతలవుతాయి. అయినా చెప్పుదినే కుక్కకేం తెలుస్తుంది చెరుకుగడల తీపి" అనుకుంటా వాటన్నింటినీ అపురూపంగా తన గదిలో ట్రంకు పెట్టెలో భద్రపరచుకున్నాడు.

నెమ్మదిగా రోజులు గడవసాగాయి.

ప్రతిరోజూ ఆఫీసు నుండి రాగానే... స్కూటరేసుకుని తెలిసినోళ్ళ, స్నేహితుల ఇంట్లోకంతా పోవడం మొదలుపెట్టాడు.

రోడ్డు మీద కనబడ్డ ప్రతి స్నేహితున్నీ ఆప్యాయంగా పలకరిస్తా క్యాంటీన్ తీస్కపోయి కాఫీ, టీలు తాపిస్తా స్కీము గురించి వివరించసాగాడు.

రోజులు వారాలవుతున్నాయి. వారాలు నెలలవుతున్నాయి.

ఎవడూ చేరడం లేదు.

వెంకటేశం అక్కడ కనబడగానే జనాలు ఇక్కడ పారిపోవడం మొదలెట్టారు.

మొదట్లో తెలీక చిరునవ్వులు నవ్వుతా "అట్లనా... అట్లనా... అబ్బా... అంత లాభమా" అంటూ అంతా వినేటోళ్ళు.

"చూద్దాం"

"మా యింట్లో అడిగి చెబ్తా"

"జీతాలు రానీ"

"ఆలోచిస్తాం"

అంటూ ఏదో ఒకటి చెప్పి తప్పించుకునేటోళ్ళు.

మళ్ళీ... మళ్ళీ... కలుస్తా 'ఏం చేసినారు' అనడగడం మొదలుపెట్టేసరికి చానామంది 'హలో' అంటూ పలకరిస్తానే "కాస్త పనుంది... మళ్ళీ కలుద్దాం' అంటూ సీరియస్‌గా వెళ్ళిపోవడం, ఎదురుగా కనబడుతున్నా చూడనట్టే నటిస్తా తలలు తిప్పుకొని తప్పుకుపోవడం, ఇంట్లో వున్నా పెండ్లాల చేత లేడని చెప్పించడం, ఫోనులో గొంతు వినగానే కట్ చేయడం మొదలుపెట్టారు.

ఆఫీసులో... బయటా... పలకరించడం మానేశారు.

బంధువులు, స్నేహితులు ఇంటి వైపు రావడం మానుకున్నారు.

'జిడ్డుగాడు... తగులుకుంటే వదలడు' అని చాటుమాటున నవ్వుకోవటం, ఎగతాళి చేయటం మొదలుపెట్టారు.

దానికి తోడు వాళ్ళ బాస్ 'నువ్వేదో పెద్ద మొనగానివని... పొడి చేస్తావనీ... చించి ఆరేస్తావనీ... చేర్పిస్తే... ఇన్ని రోజులయినా ఒక్కన్ని కూడా చేర్పించుకోలేకపోయావే... నిన్ను అనవసరంగా నాకింద చేర్చుకోవడం వల్ల నాక్కూడా నష్టమొస్తా వుంది' అంటూ చిరాకుపడడం, నసగడం, కనబడ్డప్పుడల్లా ఎత్తిపొడవడం మొదలుపెట్టాడు.

అన్నిటికన్నా ముఖ్యమైన విషయమేమిటంటే కల్సిన వాళ్ళలో సగానికంటే ఎక్కువమంది 'మాది కూడా సేమ్‌టు సేమ్ అన్నా... కాకపోతే నీ దాంట్లో ఇద్దరిని చేర్పిస్తేనే లాభం... మా దాంట్లో చేర్పియ్యక పోయినా లాభమే. చేర్పిస్తే చైన్ వేగంగా పెరిగి ఆక్టివ్ జోన్లో లక్ష సంపాదిస్తారు. చేర్పించలేకపోయారనుకో ఒక అరవై రోజులు చూసి నాన్ ఆక్టివ్ జోన్లో వేసేస్తారు. అలా అక్కడ చానామంది ఒకరికింద ఒకరు ఆటోమేటిగ్గా పడిపోతుంటారు... ఆఖరులో పదివేల దాకా వస్తుంది. ప్రీమియం కూడా తక్కువే. జస్ట్ ఆరొందలంతే...' అంటూ ఒక్కొక్కడూ ఒక్కొక్క రకం స్కీము ఎదురు చెప్పడం మొదలుపెట్టారు.

రోజులు గడుస్తున్న కొద్దీ వెంకటేశంకు చిరునవ్వు పోయి భయం మొదలయింది.

తనకంటే తెలివైన వాళ్ళు లోకం నిండా చానామందున్నారని... ఇటువంటి రకరకాల స్కీములు ఆంధ్రదేశమంతా అనువణువూ పాకిపోయాయని అర్థమయింది.

"తన భార్యాపిల్లలకు ఇంకా విషయం తెలీదు. తెలిస్తే ఇంకేమన్నా వుందా..." అనుకున్నాడు.

శనికి శాంతులు చేపించాడు.

తిరుపతి వేంకటేశ్వర స్వామికి తలనీలాలిస్తానని మొక్కుకున్నాడు.

నవగ్రహాల చుట్టూ తిరిగాడు.

నాడీ జ్యోతిష్యం కూడా చెప్పిచ్చుకున్నాడు.

అయినా లాభం లేదు...

దిగులు... అశాంతి...

రాత్రి నిద్రపట్టడం లేదు...

ఏవేవో పిచ్చి పిచ్చి కలలు..

ఇంటర్‌నెట్లో ప్రతి సాయంత్రం వెళ్ళి చూడసాగాడు... చిత్రాలకు ఎటువంటి రేటు రాలేదు.

అన్నం సరిగా తినబుద్ది కావడం లేదు.

మాటిమాటికి తినీ తినక కష్టపడి కూడబెట్టిన డబ్బేవేలే కండ్ల ముందు కదలాడసాగాయి.

తన బాధను ఎవరికీ చెప్పుకోలేక, పంచుకోలేక లోలోపలే కుమిలి పోసాగాడు. అందరితో మాట్లాడ్డం మానివేశాడు.

పీక్కుపోయిన ముఖంతో, పెరిగిన గడ్డంతో, జీవంలేని చూపులతో రోజు రోజుకీ పిచ్చివానిలా మారిపోతున్న మొగున్ని చూసి మహాలక్ష్మి ఒకరోజు ఆపుకోలేక ఒంటరిగా వున్నప్పుడు "ఏందే... ఏమయింది... ఎందుకట్లా రోజురోజుకీ అందరికీ దూరమయిపోతావున్నావ్... ఏంది నీ బాధ" అనింది అనునయంగా కండ్ల నీళ్ళు బెట్టుకోని.

ఆమె అలా అడిగేసరికి వెంకటేశం కండ్ల నుండి నీళ్ళు గిర్రున కారిపోయాయి. కట్ట తెంచుకున్న వరదలా అన్ని రోజులుగా ఒక్కడే అనుభవిస్తా వున్న బాధనంతా ఒక్కసారిగా వెళ్ళగక్కాడు.

జరిగిందంతా విన్న ఆమె "ఏ పల్లెటూరోడో... చదువుకోనోడో మోసపోయినాడంటే అర్ధముందిగానీ... ఇంత చదువూ చదివి ఏం లాభం... అయినా కష్టాన్ని నమ్ముకోకుండా కలలను నమ్ముకుంటే ఇంతే తప్పదు. మా తమ్ముడు నీ లెక్కనే ఆశపడి ఏదో కంపెనీలో చేరినాడంట... వాళ్ళిచ్చే ఖరీదైన వస్తువులు అమ్మలేక... ఇంటింటికీ తిరుగుతా... నో అంటా వుంటే ఫీలవుతా... ఆఖరికి చేతులెత్తేసినాడంట... అంతెందుకు మన పక్క వీధి సుబ్బారావు లేదూ... అదే రెవెన్యూ డిపార్ట్‌మెంట్‌లో క్లర్క్‌గా పనిచేస్తాడు చూడూ..." అంటూ ఒక్కో కథా చెబ్తా వుంటే నోరు తెరుచుకొని ఆశ్చర్యంగా వింటూ వుండిపోయాడు.

"ఇట్లాంటి ఏ స్కీమయినా ఏదో ఒకచోట కొత్త సభ్యులు దొరక్క ఆగాల్సిందే గదా... సరిగ్గా అక్కడ మనలాంటోళ్ళుంటాం... సరెలే... ఐపోయిందేదో ఐపోయింది. ఇంగ దాన్ని మర్చిపో... బజారుకి పోయి కూరగాయలు తేపో... రేపు కూరకి లేవు" అంటూ సంచి చేతికిచ్చింది.

మార్కెట్లో కూరగాయలు కొనుక్కొని తిరిగి వస్తావుంటే దారిలో ఎవరో అపరిచితుడు చేతిలో ఒక పాంప్లెట్ పెట్టాడు. తెరచి చూస్తే.

'కలియుగమునందు శ్రీ షిర్డీ సాయిబాబా అద్భుత అవతారము" అనే హెడ్డింగ్ కనబడింది. చదవడం ప్రారంభించాడు.

భక్తులారా...

షిర్డీలో సాయిబాబా మందిరములో ఒక పూజారి పూజ చేయుచుండగా అకస్మాత్తుగా ఒక సర్పము వచ్చినది. దానిని చూసి పూజారి భయంతో వణికిపోయెను. అంతలోనది ఒక బ్రాహ్మణ రూపము దాల్చి "భయపడుకుము... కలియుగం అంతమయ్యే సమయం ఆసన్నమయినది. కొన్ని దినములలో నేను ఈ భూమిపై అవతరించెదను. మీరు పాప విముక్తులు అగుటకు ఈ విషయాన్ని తెలియజేస్తూ నా పేరు మీద ఇరవై నాలుగు రోజులలో మీకు చేతనయినన్ని పత్రికలు ముద్రించి పంపవలెను. అలా చేసిన వారికి వూహించని లాభాలు, చేయని వారికి అపారమైన కష్టాలు ప్రాప్తిస్తాయి" అని ఆ నాగసర్పము అక్కడ నుండి అదృశ్యమయినది.

ఈ విషయం తెలిసి రాజంపేట కోడూరులో రాజశేఖర్ అను వ్యక్తి ఐదువందల పత్రికలు పంచగా అతనికి ముప్పై లక్షల రూపాయలు లాటరీ తగిలినది. కర్నూలు జిల్లాలోని ఓర్వకల్ నివాసి గాదె లింగప్ప దీన్ని చదివి నవ్వి చించి పారవేయగా అతనికి వ్యాపారంలో నష్టం కలగడమే గాక భార్య కూడా మరణించినది.

కావున దీనిని చదివి హేళన చేయవద్దు. చించవద్దు. చేతనయినన్ని ముద్రించి అందరికీ పంచండి – అని వుంది.

ఆ కొత్త స్కీముని చదవగానే వెంకటేశానికి ఎక్కడలేని కోపం ముంచుకొచ్చింది.

వారఫలాలు...

పూజలు...

శాంతులు...

వాస్తులు...

జ్యోతిష్యాలు...

మొక్కులు...

అన్నీ... అన్నీ... గుర్తుకుసాగాయి.

'ఛూ... దీనమ్మ' అంటూ ఖాండ్రించి వుమ్మేస్తా దాన్ని పరపర చించి విసిరికొట్టాడు.

*

# ముట్టీమే...

### డాక్టర్ ఎం. విజయశ్రీ



వ్యాకరణం తెలీదని
వ్యధ చెందకు
సాహిత్యం నిన్ను
సేద తీరుస్తుంది

వేట వ్యసనమూ
కానే కాదు
అది భరతుని జన్మకెంతో
అవసరం

హరితవనంలోంచి పుట్టిన
ఆయుర్వేదం
చరిత్ర చెప్పిన
ప్రకృతి వైద్యం

వాత పిత్త కఫాలంటూ
ధన్వంతరి
మన్వంతరాల దాకా
మందులిచ్చిపోయాడు!!

దునియాల ముట్టీమే
కాదు అంబానీ
దుల్హన్ ఆయేతో
దునియా ముట్టీమే!

## నాది కాని ఉదయం నాకొద్దు

డాక్టర్ బండి సత్యనారాయణ

నిన్న ఆక్రమించిన రాజ్యాన్ని పెట్టుబడిపెట్టి
రేపటి రాజ్యాలతో నువ్వు మాయా జూదమాడతావు
నీ దృష్టిలో రేపు అంటే మరో కొత్త యుద్ధమే
మరో రాజ్యం నీకు దాసోహం అవడమే

నీ చరిత్ర మొత్తం రక్తం
నిన్నటి పచ్చిరక్తాన్ని అత్తరుగ పూసుకుని
రేపటి పావురం కోసం తుపాకీతో ఎదురుచూస్తున్నావు

నా ఊహలతీరాన్ని ఎడారిచేసి
నా రేపటి కలల్ని శిథిలం చేసి
నా ప్రతీ ఉదయాన్నీ రక్తసిక్తం చేస్తున్నావు

నిన్నటి రక్తపు మట్టిలోంచి
నేటి గాయాల హృదయంలోంచి మొలకెత్తే నా ఉషోదయం
కొత్త వసంతాన్ని తెచ్చి నా మెళ్ళో వేస్తుందని
ఆనందభాష్పాల్ని తెచ్చి నా కళ్ళకి అలంకరిస్తుందని
నేను రాత్రంతా కలగంటాను

ఎంత మోసం ఎంత కుట్ర
నేను భయపడినట్టుగానే ప్రతీ ఉదయం నన్ను మోసం చేస్తుంది
నా హృదయాన్ని చీల్చి
నా సర్వస్వాన్ని కాల్చి వెళ్ళిపోతుంది
నువ్వు ప్రతీ ఉదయాన్ని ఆక్రమించినట్టు
ప్రతీ ఉదయం నన్ను వంచించి వెళ్ళిపోతుంది
ప్రాంసరీ నోటుకి వేలాడదీసిన జీవితం
రేపటి ఒడ్డు మీద భద్రంగానే ఉందనుకుంటాను
నిద్రలేవగానే వెలుతురు చెంప ఛెళ్ళుమనిపిస్తుంది
నిన్న అందంగానే చిత్రించుకున్న నేడు భళ్ళున పగిలిపోతుంది
నిన్నయింతే
మొన్నా యింతే
గతమంతా యింతే
నువ్వు ఆజ్ఞాపిస్తున్న ప్రతీ ఉదయమూ యింతే
నన్ను చీకటిలో ముంచేస్తుంది
నా సగటు జీవితాన్ని మరింత వెగటు చేస్తుంది
అందుకే ఇప్పుడు నేడు ఉదయం కోసం ఆరాటపడటం లేదు
నీ అస్తమయం కోసంఎదురు చూస్తున్నాను

## అంటరాని కోకిల



జి. లెనిన్ శ్రీనివాస్

అంతరిక్షం హద్దులు దాటి
ఆకాశపు అంచులపై తూనీగల్లా తాకి.....
ప్రకృతి ప్రళయాలను జయించి,
సముద్రపు లోతులను అంతుచూచిన మనిషి
అంటరానితనపు హద్దులు గీచి
మానవత్వాన్ని కట్టడి చేస్తూ...
అస్పృశ్యులని అలవిగాని పనులతో
అర్థం లేని వాక్చల్యంతో నిలువరించడం
అగ్రవర్ణాల హంభావపు వారచూపులు
ఇంకా మారని వింత జనం మధ్య
వివక్షతా చట్రాలలో నలుగుతూ... నలుపుతూ..
విచ్చుకత్తులకు చితై పోతున్నా
ప్రాణకోటి కంతటికి ఆయువులూదే
పంచభూతాలను పంచుకుంటూనే
పాలేర్లుగా తోటమాలిగా, చావుకాడి పరిచర్యలు సహా
శరీర మలినపు శుభ్రతలోనూ
కాలు జోళ్ళు, ఖార్ఖానాలల్లో మన కోసం
అంతరంగపు పొరల మధ్య
అజ్ఞానపు ముసుగులో
తన్నుకు చచ్చే కుతంత్రం
దైవ దర్శనానికి అనర్హువై
దేవాలయ ప్రవేశానికి శంకితువై
ఊరుబయట ఒంటరి శిలువలుగా
విలువల వలువలు వలిచే సంస్కారం కాదా?
కుంగిపోతున్న కడలి అల
చిక్కి శిధిలమై శల్య దశపు బ్రతుకులలో
పల్లెల్లో ప్రశాంతతకు చిచ్చులై
అంటుకున్న రావణ లంకలా జ్వాలవై ఎగిసి పడుతూ
నాటి నుండి నేటి వరకు తీరని శోకపు సాగరం
తరగని కన్నీళ్ళు ఆక్రోశం
ఎదుగుదలకు నోచుకోని జీవితాలు కన్నీళ్ళవుతున్నాయి!
ఉద్వేగభరిత పోకడలతో
కొట్టుమిట్టాడే దీన అంటరాని జనుల ఆక్రందనలను
వెనుకబాటుతనం చెరిపేద్దాం! చైతన్యంతో తరిమేద్దాం!!
మళ్ళీ మహాత్ముడు, అంబేద్కర్, సుందరయ్యలు
మన మధ్యన పుట్టాలనే దళితుల కోర్కెను ఆహ్వానిద్దాం!!

## పుష్పకం



డాక్టర్ బండారు సుజాత శేఖర్

రత్నగర్భ
ప్రశంస బాగానే వుంది
మరి
ఎండుతున్న కడుపులూ!

రెక్కలూడిన పక్షి
సగటు మనసు
విహంగమా!
విహారం చాలిక

చెమట ఎప్పుడూ
సూర్యుడే
మరి నిరాశ!
అమావాస్య చంద్రుడు

నేడు రూపాయికి
ముఖాలెన్నో!
పంచభూతాల
అడ్రస్ మారింది కదా!

పుష్పక విమానాలు
లేవంటారా?
మా దేవరకొండ
ఆటోలు చూడండి

# దళిత కవిత్వంలో పురాణ ప్రతీకలు



**తమ ఆనందాల్ని, విషాదాల్ని, బలమూ బలహీనతల్ని కలిగిన ప్రతి సమాజం వాటిని అధిగమించే ప్రయత్నం కల్పనలతో చేస్తుంది. నిర్దిష్ట జనసమూహ భౌతిక, చారిత్రక వాస్తవిక పునాదిపై కల్పన చేసిన గాథలే పురాణాలు. కనుక పురాణాలు సాంస్కృతిక నిర్మాణాలు. స్పష్టంగా చెప్పాలంటే పురాణం సమాజ భాషణం లేదా వాగ్వ్యవహారం. కనుక సమాజం శాస్త్రీయజ్ఞానం పొందిన కొద్ది పురాణగాథలు, పాత్రలు హేతుబద్ధ పరీక్షల ముందు నిలబడాల్సి వస్తుంది. పురాణ పాత్రలను విశ్వజనీన సత్యాలుగా స్థిరీకరించే ఉద్దేశిత చర్యలను పురోగామి భావజాలం వ్యతిరేకిస్తుంది. ఈ కృషే దళిత కవిత్వం చేసింది.**

## పోనుగోటి రవికుమార్

ప్రతీకలను అర్థం చేసుకోవడానికి భాషా శాస్త్రం ప్రయత్నించింది. సాహిత్యంలో ప్రతీకల అర్థం గ్రహించడానికి ఫార్మాలిస్టులు దారి చూపారు. వక్త - శ్రోత మధ్య సంభాషణ సందర్భాధారంగా (కాంటెక్స్ట్) జరుగుతుంది. ఇది సాపేక్షమైనది. దీనిని బట్టి అర్థం గ్రహించవచ్చు. ఇక్కడ వక్త అంటే కవి. శ్రోత అంటే పాఠకుడు. దళిత కవిత్వంలో ప్రతీకలను అర్థం చేసుకోవాలంటే కవి అందజేస్తున్న దళితుల బాధలు, విముక్తి అనే సందేశాన్ని అర్థం చేసుకోవాలి. దళిత అస్థిత్వోద్యమ నేపథ్యం, కుల నిర్మూలన పోరాటం, రాజ్యాధికారం అనేవి సందర్భమందించిన మార్గాలు. ఇలా చూసినపుడు మారిన సాహిత్య సందర్భంలో పురాణ ప్రతీకల అర్థం ప్రాచీన మైనది కాదని, సమకాలీన సమాజ వాస్తవి కతను ప్రకటిస్తున్నాయని గ్రహిస్తే దళిత కవిత్వ ప్రతీకలను అర్థం చేసుకోవడం సులభం.

'దళిత సాహిత్యం - తాత్విక దృక్పథంలో' జి. లక్ష్మీనరసయ్య 'దళిత సాహిత్యతత్వం'లో శిఖామణి పురాణ ప్రతీకలను విశ్లేషించారు. కందుకూరి 'సరస్వతి నారద విలాపం' నుండి మొదలై మైనార్టీ కవిత్వానంతర ధోరణిలలో కూడా వీటి ప్రయోగం కనిపిస్తుంది. ఇది ప్రతి కవిత్వ ధోరణి ఒక వాదంగా స్థిరపడే క్రమంలో తన కవిత్వ అర్థ నిర్మాణావసరాన్ని గుర్తించిన ఫలితంగా ప్రయోగించారు. అంబేద్కర్ హిందూ మత గ్రంథాలను క్షుణ్ణంగా పరిశీలించి వాటి కులాధిక్య భావజాలాన్ని బట్టబయలు చేశారు. అందులో భాగంగానే దళిత కవిత్వం వేదాలు, ఉపనిషత్తులు, పురాణ, ఇతిహాస, హిందూ ధర్మశాస్త్రాల, భగవద్గీత పట్ల సమాజంలో గల భ్రమలను బద్దలు చేసింది. దీన్ని జ్యోతిభాపులే ఆరంభిస్తే పెరియార్ రామస్వామి, అంబేద్కర్ కొనసాగించారు. దీన్నే దళిత కవిత్వం అందిపుచ్చుకొని రాముడు, కృష్ణుడు, మనువు, ద్రోణుడు లాంటి ఇతిహాస పాత్రల చీకటి కోణాలను వెలికితీసింది. అంతేగాక వాలి, శంభూక, తాటకి, శూర్పణఖ, అరుంధతి, ఏకలవ్యుడు వంటి దళిత పాత్రల ప్రాచీన నేపథ్యాన్ని విరూపం చేసి సమకాలీన సమాజ పరిస్థితులకు సమన్వయం చేసింది.

'పురాణాలు బ్రాహ్మణుల అధీనంలో ఉండటంతో చరిత్రను తెలుసుకొనే అవకాశం లేకుండా అనేక వక్రీకరణలు చేసి తమ ప్రయోజనాలకు అనుగుణంగా వారి ఆధిపత్య భావజాలాన్ని గాథలకు జోడించి ప్రజల మీద రుద్దారని డి.డి. కోశాంబి 'భగవద్గీత చారిత్రక పరిణామం'లో అభిప్రాయపడ్డారు.

దళిత కవిత్వం ఉద్యమంగా నిలదొక్కుకునే క్రమంలో పురాణ ప్రతీకలను విరూపం చేసింది. ఇవి కవితకు సొగసు తీసుకువచ్చి అభివ్యక్తి గాఢతకు దోహదపడటం కవిత వ్యవస్థకు చేసిన మేలుగా గుర్తించాలి. కనుక పౌరాణిక ప్రతీకలను కళాత్మక అభివ్యక్తిలో భాగంగా చూడటం అవసరం. ప్రతి కవిత వెనుక ఉన్న అర్థ నిర్మాణాన్ని తెలియజేసే సంజ్ఞ ప్రతీక. వాటి అర్థాలు సమాజం నిర్మించుకున్న సాంస్కృతికాంశం. కనుక పురాణ ప్రతీకల వెనకున్న అర్థ నిర్మాణాన్ని విశ్లేషించి, సాంస్కృతిక మూలాన్ని విచ్ఛేదన చేయడం వల్ల గూఢార్థం గ్రహించవచ్చు. పురాణ ప్రతీకలను చారిత్రక, సాంస్కృతిక కోణంలో పరిశీలించాలి. అప్పుడే వాస్తవికార్థం బయటకొస్తుంది. వాస్తవానికి వీటిని దళిత కవిత్వం వినిర్మాణం (Deconstraction) చేసింది. అంటే వాటి అంతస్సారాన్ని లేదా కనిపించని సత్యాన్ని పూర్తిగా స్పష్టపరిచింది.

వేదాలు ఈ దేశ సాంస్కృతిక సంపదగా అగ్రకులాలు కీర్తించి, వాటి ప్రామాణికతకు తిరుగులేదని ప్రచారం చేస్తాయి. వేదాల్ని దేవుడే సృష్టించాడని, కనుక వాటిని ప్రశ్నించే హక్కు సామాన్య మానవమాత్రులకు లేదని వాటిని చదివే హక్కు బ్రాహ్మణులదేనని సొంతం చేసుకున్నారు. వాటి ఆధారంగా ఆధ్యాత్మికత సాధనంగా ప్రత్యేక సామాజిక హోదాతో తిరుగులేని ఆధిక్యాన్ని పొందారు. శూద్రులు వేదాలు చదవకుండా, వినకుండా కట్టుదిట్టం చేసి అనేక రకాలుగా అణచివేశారు. ఇదే మనుస్మృతి కాలం నాటికి కులాధిపత్య చట్టాలుగా సామాజికామోదం పొందించారు. ఇలా కొన్నివేల సంవత్సరాలుగా కొనసాగుతున్న దోపిడీకి అప్పుడప్పుడు వ్యతిరేకత ఎదురవుతూనే వుంది. ఆధునిక కాలంలో వీటి ప్రామాణ్యాన్ని ప్రశ్నించిన కవితోద్యమం లేదు. అయితే దళిత కవిత్వం వేదాల, స్మృతుల అమానీయ పునాదుల్ని ప్రశ్నించి, వాటిని హక్కుల దోపిడీకి ప్రతీకలుగా భావించింది. "వేదాలు, ఉపనిషత్తులు, పురాణాలు, ప్రబంధాలు / నీ నుదుటిపై అపభ్రంశపు రాతలు రాసి.../ .... వెలివేసి / కర్మ సిద్ధాంతాలు వల్లె వేసినంత కాలం / ఈ వ్యవస్థ ప్రశాంతంగానే పయనించింది" (ఎస్వీ 'కార్చిచ్చుపై కన్నీటి గీతం. దండోర). గత జన్మ పావం వల్ల అంటరానివాళ్ళుగా పుట్టారని, నిమ్నజాతులు తిరుగుబాటు చేయకుండా కర్మ సిద్ధాంతాన్ని ముందుకు తెచ్చారు. కర్మ సిద్ధాంతాన్ని హేతువులతో ప్రశ్నించినప్పుడే ఈ వ్యవస్థని ఇంకా అశాంతికి గురిచేశారనే చారిత్రక వాస్తవాన్ని దళిత కవిత్వం చెబుతుంది.

సింధు నాగరికత అసమానతలు, వర్ణభేధాలు లేని ఆదిమ సోషలిస్టు సమాజముగా సామాజిక చరిత్రలో ప్రతీకగా నిలిచింది. దీన్నే ప్రతీకగా తీసుకొని చారిత్రక విశేషాన్ని కవిత్వంలో ధృవీకరించింది. **"మీ మనువు పుట్టకముందే / సంస్కృతికి కీర్తి సౌధాన్ని నిర్మించిన వాళ్ళం / ఋగ్వేద అంకురమైన కనిపించకముందే/... అన్ని మండలాల్లోను వ్యాపించి ఉన్నాము / నిదర్శనాలు అడుగుతావా.../ పచ్చిక బయళ్ళపై వెలసిన**

**మమ్మల్ని సాక్ష్యం చూపుతాయి"** (బన్న అయిలయ్య : నిప్పు కణిక), మూలజాతివాసుల సంపదను, గొప్పదనాన్ని, 'పచ్చిక బయళ్ళ'తో సూచిస్తూ నాగజాతిపై (సింధు ప్రజలపై) ఆర్యుల దాడులను ప్రతీకరించింది. వేదాల ప్రామాణికతను నిరసించి వాటిపై సైద్ధాంతిక దాడి చేశారు. **"... నాలుకను తెగ్గోసిన నాలుగు వేదాలను / నాలుగు భుజాలకెత్తుకొని... / ... చౌరాస్త సమాధుల వద్దకు లాగుతున్నారు/ ...నడి రోడ్డు మీదకు తన్నుకుంటూ ఈడ్చుకొస్తున్నారు"** (జి. గౌతమ్ : నాలుగు దిక్కుల నుండి రండి. పదునెక్కిన పాట). దళిత చైతన్యం వేదాలకు చౌరాస్తలలో పంచాయతీ పెట్టి వాటి అసలు రూపాన్ని బట్టబయలు చేయడంతో అవి మృతప్రాయంగా మారాయని వాటిని పూడ్చి పెట్టడమే తరువాయని హెచ్చరించింది.

పురుష సూక్తం (చాతుర్వర్ణాల పుట్టుక బీజం) జన్మ రహస్యాలను పవిత్ర మైనవిగా చెప్పే మంత్రంగా అగ్రకులాలతో కొనియాడబడుతూనే ఉంది. ఇది మానవ జన్మ రహస్యాన్ని అధి భౌతిక సిద్ధాంతంగా స్థిర పరి చింది. దళితవాదం ఆ మంత్ర సహేతుకతను ప్రశ్నించి, నిరాకరించడమే కాక తనదైన భాషతో తూలనాడింది. **"వొకడ్ని మొకంలోంచి / ... సంకల్లోంచి / ... గజ్జల్లోంచి / ...పాదాల్లోంచి / పురుడు పోసి పుట్టించిన / ఈ చరిత్ర మంత్రసాని మాటలు / నిజమేనా?"** (మద్దూరి నగేష్‌బాబు, రచ్చబండ) అని సందేహం వ్యక్తం చేసింది. **"నిజం చెప్పొద్దూ... / దేవుడి నాలుగు శరీర మర్మాలూ / అశ్లీల భావచిత్రాల్లా కనిపించేవి.../ ఏకలవ్యుడు ముమ్మాటికీ తల్లికే పుట్టాడు"** (సతీష్ చందర్ : పంచమ వేదం). పురుష సూక్తాన్ని పురాణ ప్రతీకగా స్వీకరించిన దాని ఆధిపత్య స్థానాన్ని భౌతికవాదంతో తోసిపుచ్చింది.

దళిత కవిత్వం మనువుని విమర్శించినంతగా మరెవర్ని విమర్శించలేదు. మనుస్మృతి ఆధునిక కాలంలో తీవ్ర విమర్శలకు గురైంది. అందుకు ముఖ్యమైన కారణాలు బ్రాహ్మణులను దైవం తరువాతి స్థానంలో నిలబెట్టడం, కింది కులాలను అన్ని రకాలుగా వెలివేయడం, స్త్రీలను ఎందుకు పనికిరాని వారిగా భావించి, పితృస్వామ్య భావజాలంతో అణచివేయడం. ఆధునిక కాలంలో కూడా మనువు రాజ్యమేలుతున్న తీరుపై యుద్ధం ప్రకటించి, ఇప్పుడెంతో సామాజిక మార్పు వచ్చిందనే వాదనను తిరస్కరించింది. **"నిన్నటికీ ఇవ్వాళ్టికి / నోటికి ముంతా/ ముడ్డికి ఆణ... / నా చూపుకీ, నా దేహానికి సంకెళ్ళు తెగిపోయాయని / ఇక నేను నమ్మలేను మనువు"** (రాం : నేటికి లేని స్వేచ్ఛ కోసం. పదునెక్కిన పాట). తరతరాల అణచివేతలు ఇంకా కనిపించని రూపంలో వెంటాడుతూనే వున్నాయని, వాటిని దైనందిన జీవితానుభవ నేపథ్యంతో తిరస్కరిస్తూ అగ్రకులాల తప్పుడు ప్రచారాన్ని తిప్పికొట్టింది. ప్రతిభ గురించి చర్చ జరిగిన ప్రతిసారి మనువుని విమర్శించింది. **"... ఆటవిక, ఆధునిక మనువుల్ని / పారద్రోలేందుకు సిద్ధమై/... బలహీన ప్రతిభలేని పామర పేద కులన్నుడిని"** (శంబుక. దళిత గర్జన. పోయేదేమీలేనోళ్ళం). ఆటవిక, ఆధునిక అనేవి గత, వర్తమాన మనువాదులకు ప్రతీక.

దళిత కవిత్వం మనువుని తీవ్ర స్వరంతో దూషించి భౌతిక దాడిని ప్రకటించింది. **"మనువు మక్కిలిరిచే వాణ్ణి / రంగులను ఉరితీసేవాణ్ణి / ఈ దేవుళ్ళ చర్మం**



**ఒలిచేవాణ్ణి"** (వరదయ్య. ఇద్దరం కలిసే. చిక్కనవుతున్న పాట). వర్ణ వ్యవస్థను రంగులతో సంకేతించి, తులనాడటానికి మనువుని ప్రతీకగా ప్రయోగించింది. అంతేగాక మనువాదం అన్ని రంగాలలో విస్తరించిన విషయాన్ని గుర్తించింది. **"నేను మనువును / మానవత్వం నా శత్రువు /... నేను వ్యక్తిని గాను / వాదాన్ని... / నేనిప్పుడు రూపం మార్చుకున్నాను... / నీవు నన్ను గుర్తిస్తే నశిస్తా / నన్ను బ్రాహ్మణుడిగా ద్వేషిస్తే / నీది బ్రాహ్మణవాదమే / నా మూలం హైందవం / దాన్ని కూలిస్తే నేను మరణిస్తా"** (కత్తి పద్మారావు. నీలో నేను. నల్లకలువ) అని మనువాద మూలలను స్పష్టంగా అర్థం చేసుకొని మనువుని ప్రాచీన ప్రతీకగాక కులాధిపత్య భావజాలానికి చిహ్నంగా గుర్తించింది. ఇంకా స్పష్టంగా చెప్పాలంటే మనువును దళిత కవిత్వం సామాజిక ఉద్యమ నేపథ్యంలో కుల అణచివేతకు, దోపిడీకి ప్రతినిధిగా, మనుస్మృతిని సాంస్కృతిక ఆధిపత్యాన్ని వ్యవస్థీకృతం చేసిన ఒకానొక పౌరాణిక గ్రంధార్థానికి ప్రతీకగా తీసుకొంది.

**"మరో క్రూర గద్ద / గొద్దల్ని చేతబూనిమన రాజ్యాలపై / ఇరవై వొక్కసార్లుకసిదీరా దాడి చేసింది"** (రమేష్ సుంకర : తల్లి కోడి హెచ్చరిక)

దశావతారాన్ని పురాణా ప్రతీకలు గాక ఈ దేశాన్ని ఆర్యులు ఆక్రమించుకున్న తీరును చెప్పడానికి, దళితులపై దాడికి చిహ్నాలుగా స్వీకరించింది.

రాముడనే పురాణ పాత్ర సచ్ఛీలుడు, ధర్మబద్ధుడనే అర్థ నిర్మాణాన్ని కలిగి వుంది. అయితే దళిత కవిత్వమా పురాణార్థాన్ని వినిర్మాణం చేసింది. వ్యక్తిగా, రాజుగా రాముడి శీలం గొప్పదేం కాదని అతని పురుషాధిపత్య అగ్రకులతత్వాన్ని నిరూపించేందుకు తాటకి వధ, శూర్పణక మీద దుశ్చర్య, వాలి, శంభూకవధ, సీతకు చేసిన అన్యాయాలను ప్రతీకలుగా ప్రయోగించింది. ఈ క్రమంలో రాముణ్ణి తమ దేవుడిగా అంగీకరించక హంతకుడిగా ప్రకటించింది. **"రాముడు నా రక్షకుడు కాదు. హంతకుడు"** (ఎండ్లూరి సుధాకర్ : నిమ్నలిపి. నల్లద్రాక్ష పందిరి). అంతేగాక వాలి హత్యను ఆధునిక నేపథ్యంలో ఆవిష్కరించింది. **"వాలి వీపులో దిగిన... / బాణం... / ఒకో రకం ఎన్‌కౌంటర్"** (జూలూరి గౌరీశంకర్ : సిలబస్‌లో లేని పాఠం) అని నిజ నిర్ధారణ చేసి అగ్ర కుల వ్యవస్థ వలన పురాతన చరిత్రలో నమోదైన మొదటి ఎన్‌కౌంటర్‌గా వాలి హత్యను ప్రకటించింది.

వాలిని చెట్టుచాటు నుండి చంప డానికి కారణం అతనికి ఎదురుగా నిలబడి ఎవరు చంపలేరనే అర్థ నిర్మాణం చేసి తమ తప్పుని కప్పిపుచ్చుకోవాలని చూశారు. అయితే అగ్ర కుల పాలకుల నీతిని చెప్పడానికి రాముడి అవినీతిని ప్రతీకగా ప్రయోగించడం దళిత కవిత్వం సాధించిన నూతన అభివ్యక్తి. **"వెనుక నుంచి పొంచి బాణంతో కొట్టిన / ఉత్తమ పురుషుడు చేసిన హత్యను / కళ్ళారా చూశాక / పాలకుల్ని, రక్షకుల్ని ఎవరు నమ్మారు"** (జూలూరి గౌరీశంకర్ : దళిత మేనిఫెస్టో). గతంలో రాముడు చేసిన ఘాతుకాన్ని వర్తమాన రాజ్య స్వభావానికి ఆపాదించడంతో పౌరాణిక ప్రతీకైన రాముడు పథకం ప్రకారం వాలిని హత్య చేశాడని విరూపణ చేయబడ్డాడు. ఈ విధంగా విరోధాభాస (పారడాక్స్)ను కవిత్వంలో గాఢంగా ప్రయోగించింది కూడా దళిత కవిత్వమే.

రాముడు రాజుగా ఉన్న సమయంలో శూద్రుల్ని అణచివేశాడు. అందుకు శంభూక వధే ప్రత్యక్ష ఉదాహరణ. రాముడు తన దినచర్యలో భాగంగా మద్యం, మాంసం, అంతఃపుర కాంతలతో, విదూషకులతో గడిపేవాడని వాల్మీకి రామాయణం (బాలకాండ. సర్గ-43. శ్లో 1,

27)లో తెలియజేశాడు. ఈ చర్యలన్ని క్షత్రియుల సహజ లక్షణాలే. అయితే రాముడి పాత్రను అందుకు భిన్నంగా బ్రాహ్మణులు కల్పించి ప్రచారం చేశారు. వాలి హత్యలా శంభూకుడి హత్యను కూడా ఎన్‌కౌంటర్‌గా ప్రకటించింది. శూద్రులు తపస్సు చేయకూడదనేది శంభూకుడి పాత్ర అర్ధ నిర్మాణం. అయితే సామాన్యుడు సైతం దేవలోకానికి తపస్సు చేసి వెళ్ళవచ్చని నిరూపించే ప్రయత్నం చేసి బ్రాహ్మణీయ ఆధిపత్యంపై తిరుగుబాటు చేసిన చైతన్యానికి ప్రతీకగా శంభూకుణ్ణి చెప్పుకోవచ్చు. అందుకే రాముడు ఆదర్శ పురుషుడనే భ్రమను తిరస్కరించి, శంభూకుణ్ణి ఆదర్శ వ్యక్తిగా దళిత కవిత్వం ప్రకటించింది. **"అక్కడో ఇక్కడో కొన్ని గ్రామాలకు గ్రామాలు / శంభూకుని తలలై రాల్తుంటై"** (జూలూరి గౌరీశంకర్ : పాదముద్ర, దళిత మేనిఫెస్టో). దళితులు ఆత్మగౌరవంతో జీవించాలని ఆరాటపడ్డా ప్రతిసారి వారిపై దాడులు, ఊచకోతలు జరుగుతున్నాయి. ఈ ఊచకోతలను శంభూకుని తలతో పోల్చి వర్తమాన కాలంలో దళిత హత్యలకు ఆపాదించింది. **"ధర్మం నాలుగు పాదాల మీద నడవడం కాదు / కుంటిన వైనం కావాలిప్పుడు / ... ఒకే ఒక ఖడ్గ చాలనంతో తెగిపడిన / శంభూకుడి శిరస్సు సాక్ష్యం చెబుతుందేమో చూద్దాం! / తవ్వాలి... బాగా తవ్వాలి / సహస్రాబ్దాన్ని పొరలు పొరలుగా తవ్విపోయాలి"** (ప్రేమ్‌చంద్ : సర్ప పంజరం, చిక్కనవుతున్న పాట). చరిత్రలో జరిగిన దురన్యాయానికి శంభూకుడు ప్రతీక. చరిత్రను మార్క్సిస్టు, రైటిస్ట్ కోణం నుండి అధ్యయనం చేశారు. కులం, వర్గం కలసి ఉన్న భారతీయ సమాజాన్ని దళిత కోణం నుండి అధ్యయనం చేయాలని సమాజ పరిణామ క్రమాన్ని, చారిత్రక దోపిడీ శంభూకుడి పాత్రతో అభివ్యక్తీకరించింది. దీంతో నిర్దిష్ట రాజకీయ, సామాజిక, సాహిత్య సందర్భాల్లో శంభూక పాత్ర కొత్త అర్ధాల్ని పొందింది.

రాముణ్ణి ఏకపత్నీవ్రతుడిగా కీర్తిస్తారు. ఒకే బాణం, ఒకే భార్యని బాణానికి, సీతకి మధ్య సమాన స్థాయిని కల్పించారు. కానీ స్త్రీల పట్ల రాముడు అతి క్రూరంగా ప్రవర్తించాడు. అందుకే అతడి దుశ్చర్యలకు బలైన వారి పక్షాన నిలబడి వాస్తవిక విశ్లేషణతో ఖండించింది. రాముడు సీతను అనేకసార్లు అవమానించి అనుమానించాడు. కనుకే సీత ఆత్మహత్య చేసుకుందనేది దళిత కవిత్వం ఆవిష్కరించిన కొత్త కోణం. అయితే సీత స్వచ్ఛందంగా భూదేవి ఒడిలోకి పోయిందని చెప్పడం ఒక మేలిముసుగు మాత్రమేనని వినిర్మాణం చేసి రాముడు చేసిన హత్యగా ప్రకటించింది. **"సీత భూమితో కలిసి పోయిందంటే / దాన్ని హత్యని ఎవరంటారు? / రాముడికి ఉరిశిక్ష ఎవరేస్తున్నారు"** (కత్తి పద్మారావు : అస్మిత, నీలికేక). ఆత్మహత్య చేసుకునేలా పరిస్థితులు కల్పించడం కూడా హత్యే అవుతుందని గుర్తించి, రాముణ్ణి హంతకుడిగా ప్రకటించింది. **"మొన్న శ్రీరాముడి ఆనతి మేరకు / ముక్కు సెవులు కోయించుకున్నాను / ... అవును ఆలీసమ్మనే మాట్లాడుతున్నాను"** (మద్దూరి విజయశ్రీ : ఆలీసమ్మ శాపం, పదునెక్కిన పాట). ఆధునిక దళిత స్త్రీల పరిస్థితి శూర్పణఖలో ఆరోపించ డంతో సరికొత్త కోణం ఆవిష్కరించబడింది.

అగ్రవర్ణ పితృస్వామ్య భావజాలాన్ని తాటకి ద్వారా ప్రయోగించింది. **"పిల్లోడు పాలు తాగాక / విరిగిందని గుర్తొచ్చిన ఈతముల్లు / తాటకి వెన్నులో దిగిన ఆర్యబాణం"** (కత్తి పద్మారావు : నల్లవాగు, నల్ల కలువ). దళిత స్త్రీ మాతృస్వామ్యానికి, శ్రామిక జీవనానికి ప్రతీక. ఆర్యులు పితృస్వామ్యానికి, దోపిడి, అణచివేతలకు ప్రతీక. తాటకి, ఆర్యబాణమనే ప్రతీకలతో ప్రస్తుత సమాజ సంఘటనలను నేపథ్యం చేయడంతో అణచివేతలను బలంగా చిత్రించే అవకాశం ఏర్పడింది. **"పితృవాక్య పరిపాలన వల్ల / హింసకు ప్రతీక అయిన రామచరిత / తల్లి హృదయం లేక అరాచక మయింది"** (కత్తి పద్మారావు : యుగధర్మం, నల్లకలువ). పితృస్వామ్య కుటుంబ జీవనం నుండి వచ్చిన రాముడు ఆ విలువలకు భిన్నంగా ఉండే అవకాశం లేదు. రాముడికి తల్లి హృదయం లోపించడం వల్లే క్రూరంగా ప్రవర్తించాడని సామాజిక మనోవిశ్లేషణతో నిజ నిర్ధారణ చేసింది. అందుకే రాముడిలో పాజిటివ్ వయొలెంట్ సైకాలజీ కనిపిస్తోందని నూతన పార్శ్వాన్ని ఆవిష్కరించింది.



దళిత కవిత్వం భారతంలోని పాత్రలను పురాణార్థంలో స్వీకరించడం లేదు. తన అభివ్యక్తితో ఉద్దేశితాంశాన్ని ప్రభావవంతంగా చెప్పడానికి ప్రయోగించింది. **"కౌరవ సంతతి పరిరక్షణకై / ద్రౌపది వస్త్రాపహరణం జరుగుతూనే వుంది/... వివస్త్రుల్ని చేసి మమ్ము తరుముతావు / పట్టు వస్త్రాలను పట్టుకొని వెంటబడతావు / కప్పడానికన్నట్లు అందరూ భ్రమించాలి"** (ఆదిగోపుల వెంకటరత్నం : ఇంద్ర ధనుస్సు ఏడో రంగు, చిక్కనవుతున్న పాట), దళిత స్త్రీలను వివస్త్రలను చేసి ఊరేగించిన ఘటనల నేపథ్యంలో 'వస్త్రాపహరణం' కొత్త సామాజిక సందర్భానికి ప్రతీకగా నిలిచింది. కురుక్షేత్ర యుద్ధంలో కుట్రపూరితమైన పద్మవ్యూహం ఛేదించడం తెలియని అభిమన్యుడు మరణించాడు. **"గత చరిత్ర చేసిన కుట్రలు పద్మ వ్యూహంలో / ఇప్పటికి బయట పడలేక పోతున్న అభిమన్యుడ్ని"** (జావెద్ : ఎందుకు పుట్టానిక్కడ, పదునెక్కిన పాట). కులం పద్మవ్యూహంగా మారిన చోట దాని బాధితు లందరూ అభిమన్యుడిలా బలి అవు తున్నారని ప్రకటించింది. **"కురుత్రయం మసై నప్పుడు / లక్షా గృహంలో పంచపుత్రుల స్మృతిలో / దళిత స్త్రీ నవ్వింది"** (కత్తి పద్మారావు: దళితమ్మ, నల్లకలువ). అరణ్యవాసంలో లక్క గృహాన్ని కౌరవులు తగలబెట్టినప్పుడు కుంతి, పాండవు లకు బదులుగా దళితమ్మ తన అయిదు గురు కుమారులతో తగలబడి మరణించిందనే చారిత్రక వాస్తవాన్ని ఆవిష్క రించడంతో దళిత చరిత్రకు కొత్త విలువ ఏర్పడింది.

కర్ణుడు కుంతిదేవికి సూర్యుడి వల్ల పెళ్ళికి ముందు పుట్టిన సంతానం. అందుకే కుంతి సమాజానికి భయపడి కర్ణుణ్ణి పురిటిలోనే పడేస్తే అతడు సూతపుత్రుడుగా పెరిగాడు. కనుకే కర్ణుడికి దానవీరశూర లక్షణాలు దళితుల పెంపకంతో వచ్చాయని అతడ్ని తమ ప్రతినిధిగా ప్రకటించింది. **"మేం దానకర్ణుల మని మీరే అంటిరి / గీ భూదేవి - కుంతి / మముల గని బల్లక పారేశినట్టుంది"** (దేవరాజు మహారాజు : బయిరూపులోల్లం, దళిత మేనిఫెస్టో), దళితుల స్థితి, కర్ణుడి పరిస్థితికి తేడా లేదని దానశీలత కలిగిన నిమ్న జాతులు కుల వ్యవస్థతో కర్ణుడిలాగే అన్యాయానికి గురయ్యారని తెలియజేసి అగ్రవర్ణాల కుట్రలకి బలైన వారి పక్షాన దళిత కవిత్వం నిలబడింది.

కృష్ణుడు క్షత్రియ వంశంలో పుట్టాడు. యాదవ కులంలో పెరిగాడు. అదేవిధంగా పెరిగిన కర్ణుణ్ణి శూద్రుడిగా నీచంగా చూసిన అగ్రకులాలు కృష్ణుణ్ణి తమ నాయకుడిగా, దేవుడిగా కీర్తించాయి. దీనిని దళిత బహుజనుల నుండి నాయకుడ్ని ఎదగకుండా చేయాలనే కుట్రగా దళితవాదం ప్రకటించింది. కనుకే కృష్ణుణ్ణి భగవద్గీత సృష్టికర్తగా భావించి శత్రు శిబిరంలో చేర్చింది. అతడ్ని అణచివేతలకు తాత్విక బలాన్నిచ్చిన ఒకానొక ఆధిపత్య చిహ్నంగా భావించింది. **"ప్రతి హత్యకు ముందే / భారతంలో కథ పుడుతుంది / భగవద్గీత**

ధర్మమవుతుంది" (కత్తి పద్మారావు – అస్మిత, నీలికేక). చాతుర్వర్ణ్యం మాయా సృష్టియని, చంపేది, చచ్చేది నేనేనని కృష్ణుడు బోధించిన ఫలితంగా ప్రతి హత్యకు ముందే చట్టబద్ధత కల్పించిన అతడి చర్యలను నెగటివ్ కోణంలో చూడటంతో కొత్త భావనలు ఏర్పడ్డాయి. అంతేగాక భగవద్గీతను తిరస్కరించి" ఎగబడుతున్న నా జాతి మాటే / కాబోయే గీత" (రాజ సమ్మయ్య : కాబోయే గీత, చిక్కనవుతున్న పాట). అగ్రకులాల దాడులన్నీ కృష్ణగీత ప్రేరణతో జరిగినవన వచ్చు. కనుకే గీతను తిరస్కరించి, సమత రాజ్యం స్థాపించి, అందరికి సమన్వయం అందించడమే దళిత గీతగా ప్రకటించింది.

మనుధర్మం కింది కులాలకు విద్య నిషిద్ధమని చెబుతుంది. అయితే ఏకలవ్యుడు స్వశక్తితో విలువిద్య నేర్చుకొని తిరుగులేని వీరుడయ్యాడు. నేర్పించని విద్యకు కుట్రతో గురుదక్షిణ పొంది ద్రోణుడు గురుస్థానానికి మాయని మచ్చగా మిగిలాడు. **"స్మృతులు శాస్త్రాల్ని పఠించి / ఏకలవ్యుల్ని సృష్టించింది / అదే రాజ్యం / ద్రోణుడై, గురుస్థానమై / ... హక్కుల వేళ్ళు నరికే చట్టమైంది"** (జూలూరి గౌరీశంకర్ : పాదముద్ర, దళిత మేనిఫెస్టో). దళితుల శ్రమను దోచుకొని ఏకలవ్యుల్ని సృష్టించిన ద్రోణుణ్ణి రాజ్యంగా భావించింది. అనేక రూపాల్లో నిమ్న జాతులను అణచివేసి పవిత్ర గ్రంథాల ఆధారంగా రాజ్యం పేరుతో అగ్రకులాల చట్టబద్ధత కల్పించుకున్నాయి. అయితే దళితులను దొంగలనే తరతరాల ప్రచారాన్ని తిరస్కరించి **"సెటిమెటెరికలోన్ని / ... దొంగనా? మరి మా ముత్తాత / ఏలు దోచుకుంది / ఎవరు?"** (జి.వి. రత్నాకర్ : ఎలికలోన్ని, మట్టిపలక). అని ప్రశ్నించి అసలు దొంగలు అగ్రకులాలేనంది.

శివుడు ఈ దేశ మూలజాతి దేవుడు. దళిత కవిత్వం కోపాన్ని, ఆవేశాన్ని ప్రకటించడానికి శివుణ్ణి ప్రతీకగా తీసుకుంది. **"మీ పెళ్ళిళ్ళకీ, చావుకీ / దప్పుని ఢమరుకం చేస్తున్నాం / ... సుఖాన్ని మరచి... / శివుళ్ళం కాలేకపోయాం/శివతాండవం చేయలేక పోయాం / కంఠంలోంచి గరళం మీపై కక్కలేకపోయాం"** (రెడ్డిపల్లి వెంకటేశం : దప్పుచప్పుడు, పదునెక్కిన పాట).

హిందూ దేవుళ్ళు విశ్వరూప దర్శనంలో అనేక రకాల ఆయుధాలు ధరించి నట్టు వర్ణిస్తారు. దీనికి కారణం 'ప్రజలు తమ పట్టు తప్పుతున్నప్పుడు వారిని అణచి వేయడానికని' దళితవాదం ప్రకటించింది. **"మీ దగ్గర బ్రహ్మాస్త్రం.... /...పాశుపతాస్త్రం... ఉంటే ఉండనివ్వండి.../ నా దగ్గర మాత్రం ఏకలవ్యుని ఎడమచేతి బొటనవేలు / ఇంకా మిగిలే ఉంది"** (సూర్యవంశి : యెన్నుంటేనేం?, పదునెక్కిన పాట) అగ్రకులాల ఆయుధాలన్ని అవినీతికి ప్రతీకలని, అవి దళితుల ఎడమ చేతి బొటన వేలితో సాటిరావని ఆత్మవిశ్వాసాన్ని వ్యక్తీకరించింది.

పితృస్వామ్య భావజాలంతో అణగదొక్కబడిన స్త్రీ పురాణ ప్రతీకలను దళిత కవిత్వం సందర్భానుగుణంగా ప్రయోగించింది. **"అరుంధతి నీ యింటి కోడలైన రోజే / వరసలు కలుపుకన్న వాళ్ళమైతే... కంచికచర్ల కోటేశెవరు?"** (పగడాల నాగేంద్రర్, నీ బాధలో నిజం లేదు, పదునెక్కిన పాట) వశిష్టుడు వివాహమాడిన మాదిగ స్త్రీ అరుంధతి. ఆమె దళిత స్త్రీలకి ప్రతీక. ఈ కవిత చారిత్రక నేపథ్య కులాంతర వివాహాలతో



జరిగిన రక్తమార్పిడిని సూచిస్తూ ప్రస్తుత స్థితికి ముడిపెట్టింది. దళితుల పట్ల కపట ప్రేమను కనబరిచేవారిచే ప్రేమించబడినందుకు కోటేసును హత్య చేసిన సమాజాన్ని పూర్వ సంఘటనలతో నిలదీసింది. దళిత దేవతలు ప్రత్యేకంగా ఉన్నారని కంచ ఐలయ్య 'నేను హిందువునెట్లయిత?'లో నిరూపించారు. దళిత స్త్రీల పరిస్థితులను కవిత్వీకరిస్తూ వారి దేవతలను ఉపమానాలుగా వాడడం కనిపిస్తోంది. "వాళ్ళమ్మ రేణుక దేవిలా వెంట నడుస్తుంటే..." (ఎండ్లూరి సుధాకర్, దక్కలిపిల్ల) అని **"తండ్రెవరో తెలియని / నీటి పిందెలాంటి నీ రూపం / నాలో కదలాడు తుంటే / ఎల్లమ్మ జాతరే గుర్తుకొచ్చింది"** (మద్దెల శాంతయ్య : తండ్రి లేని కులం, ఓసి క్రీస్తు). అని కొత్త సంకేతాలిచ్చింది. రేణుకకు మరో పేరు ఎల్లమ్మ. ఆత్మాభిమానానికి, ఆవేశానికి ఎల్లమ్మ ప్రతీక. దళిత బాలిక కష్టాన్ని ఎల్లమ్మ జాతరతో పోల్చడం సరికొత్త అభివ్యక్తి. అగ్రకుల దేవత స్త్రీ సరస్వతి చదువుల తల్లిగా కొనియాడబడుతున్నది. అయితే ఆమె పక్షపాత ధోరణిని ఎండగడుతూ... **"ఎల్లభాషలకు తల్లయిన పెద్దమ్మ / ఎల్లిగాడికి మాత్రమే సవతి తల్లెందుకయిందో కదా!"** (మద్దూరి నగేష్‌బాబు : సంస్కృతం, పదునెక్కిన పాట) అని ప్రశ్నించింది. **"కడుపు పండించడం తరతరాల మావెలి విద్య / ఇప్పుడు సరస్వతి / శాశ్వతంగా మా ఇంటి కోడలయింది"** (ఎండ్లూరి సుధాకర్ : నిమ్నలిపి, నల్లద్రాక్షపందిరి). మారిన సామాజిక సాహిత్యోద్యమ పరిస్థితులలో అగ్ర కులాల యింటా పుట్టిందంటున్న సరస్వతి శాశ్వతంగా వెలివాడ సొంతమయిందని వ్యంగ్య ప్రధానంగా వ్యక్తీకరించింది.

దళితవాదం కవిత్వం ద్వారా తమ అజెండాను ప్రకటించింది. **"మనిషి మా గమ్యం /... కులాలు లేని దేశం... / వర్గాలు లేని రాజ్యం కోసం / ధిక్కారం మా ఆయుధం"** (మద్దూరి నగేష్‌బాబు : రచ్చబండ). అని మనువాదాన్ని ప్రశ్నించి, ప్రతిఘటించి వాటిని ధిక్కారమనే ఆయుధంతో మానవతా వాదాన్ని నెలకొల్పుతామని ప్రకటించింది.

సమకాలీన దళిత జీవితాన్ని కవిత్వంలో అన్వయించే ప్రయత్నంలో పురాణ ప్రతీకలు విశేషంగా చోటుచేసుకున్నాయి. పూర్వ సాహిత్య వాసనలకు భిన్నంగా దళిత తాత్వికుల సైద్ధాంతిక బలంతో పురాణ ప్రతీకలు శక్తివంతంగా వాడబడ్డాయి. అయితే వాటిని యథాతథంగా తీసుకోకుండా వాటి నేపథ్యాన్ని, అర్థస్ఫూర్తిని గ్రహించి వాటి వెనకున్న అర్థ నిర్మాణాన్ని దళిత జ్ఞాన దృష్టితో విశదీకరించి గుణాత్మక అభివ్యక్తిని సాధించింది. వీటిని ప్రయోగించే క్రమంలో కవులు కొన్నిసార్లు ఆవేశాన్ని అతిగా ప్రదర్శించ డంతో గాఢతకు బదులు పెలుసుదనం చోటు చేసుకొని కవిత్వం అదుపు తప్పింది. క్రైస్తవ, ముస్లిం సంస్కృతితో దళితులకు దగ్గర సంబంధముంది. ఆ మైథాలజీ ప్రతీకలను దళిత కవిత్వం పాజిటివ్ కోణం నుండి ప్రయోగించింది.

దళిత కవిత్వంలోని పురాణ ప్రతీకలు మానవత, హేతువాద, శాస్త్రీయ దృక్పథంతో మనిషి కేంద్రంగా ముందుకు వెళ్ళాలని తెలియజేస్తున్నాయి. మొత్తంగా చూసినప్పుడు ప్రతీక తన అర్థాన్ని విస్తృతం చేసుకోవడం. బహుముఖ అర్థ ప్రధానంగా కాక చారిత్రక అవగాహనతో సమకాలీన పరిస్థితిని అనుభవ నేపథ్యంతో ప్రకటించ డంతో దళితకవి ప్రయోగంలో గందరగోళం లేదు. కనుకే పాఠకులలో సరైన సాహిత్య స్పర్శ, స్పృహని కలిగించాయి. 'కులానికి దైవిక ప్రాతిపదిక ఆపాదిస్తారు. కులాన్ని నిర్మూలించా లంటే దానికి ఆధారంగా కల్పించబడిన శాస్త్రాల, వేదాల అధికారికతను నిర్మూలించాలి అనే అంబేద్కర్ వ్యాఖ్యలను ఆచరణలో పెట్టే కృషి పురాణ ప్రతీకల ప్రయోగంలో కనిపిస్తోంది. •




రైతుకు రెండు కండ్లవుతాయి ఎడ్లు
కల్ప వృక్షాలై అన్నీ సమకూర్చుతాయి
నాగలిని మెళ్లకు తగిలించినపుడు
ఎండిపోయిన రైతు జీవితం
పచ్చని చివురులు తొడగాలని
కష్టాలను చీల్చి పారేస్తోన్న
గాథానుభూతితో దున్నుతాయి
రైతు బ్రతుకు బండికి
మేమే ఆధారమంటూ
కచ్చురాన్ని మెడల కతికించుకొని
అడవి కెళ్లి
కట్టెల మోపులై వస్తాయి
తమ అడుగుల మడుగుల్లో
ధాన్యంగా ఆవిష్కరించుకొన్న
రైతు స్వేదబిందువులను
ఇంటిదాకా మోసుకొస్తాయి
కాలం వెక్కిరింపుల్తో
దిగాలుగా రైతు
చేతులను తలకతికించుక్కూర్చున్నప్పుడు
గుండెను చెరువు చేసుకుని
కన్నీటి చుక్కలుగా రాలుస్తాయి
తమ విసర్జకంతో
పైరు బిడ్డలకు పుష్టిని కలిగిస్తానంటాయి
తమ బ్రతుకంతా
రైతు కోసమేనంటాయి
ఇంత గడ్డేసి
కుడితి పోస్తే చాలంటాయి.

ధనలీలా విలాసంలో
దరిద్రపు దారులంట
పరుగెత్తీ పరుగెత్తీ
తెల్లారిపోయిన బతుకులు
నమ్ముకున్న నీవే నట్టేట ముంచితే
అప్పులు తీరక ఆకలి చావక
చావుని అన్వేషించుకుంటున్న దృశ్యాలు
స్వేచ్ఛా విహాయసంలో
హాయిగా ఎగిరే కపోతాన్ని
పసిడి పంజరంలో బందీ చేసి
అవినీతి అందలంపై
అందంగా అమర్చుకుంటున్న వైనాలు
హవాలా వ్రణాలు, స్కాంల చీము
తెల్గీల తెగుళ్ళు
హోకర్స్ భోఫోర్స్ వీక్నెస్‌లు
టెండర్ల కండరాల వ్యాధి
ముడుపుల మూల్గులు
నయవంచనకే నరాల జబ్బు
ఇన్ని వ్యాధులతో
ముడుచుకుపోయిన ఈ స్త్రీని
కాళ్ళొకరు, రొమ్ములొకరు
చొప్పున ఆక్రమించుకుని
నిలువెల్లా కుళ్ళిన ఆమె శరీరాన్నుంచీ
కారుతున్న రసినే రుచిగా చప్పరిస్తూ
చేస్తున్న హంగ్ రేపింగ్ చిత్రాలు
ఓ గౌతముని తల్లి, నాగార్జునుని అమ్మ
రుద్రమదేవీ ఝాన్సీరాణీ
ఓ గాంధీని కన్న తల్లి
ప్రియదర్శినీ, సరోజినీ
అశ్వినీ ఉషా శకుంతలా
మల్లేశ్వరి హంపీ ఓ సానియా
ఎవరైనా ఈ దేశంలో ఆడదే....
అక్కల రెక్కలు పట్టి చూసే వాళ్ళు



## మనిషి జాడ

**డా॥ వి.ఆర్. రాసాని**

చెల్లెళ్ళ శీలాలకు శూలాలు దించే వాళ్ళు
క్లాసుమేట్లను క్లాసుల్లోనే కడతేర్చేవాళ్ళు
అమ్మ రొమ్మునే అమ్మ జూసే వాళ్ళు
మిస్సమ్మలకు తమ అంతేవాసుల
నుంచే ముప్పు
ఆకలి కూపాలలో
తమ శరీరాలనే శరతల్పాలుగా మార్చి
కామాంధుల కౌగిళ్ళలో కాలిపోతున్న
అభాగినుల ఆర్తనాదాలే
వినిపిస్తున్న ఆరో వేదం
ఆచారాల శేషతల్పంపైన శయనిస్తూ
అడుగువేసిన చోటే ఆగిపోతున్న
ఆకాశంలో సగానికి కమ్మిన చీకట్లు
అడుగడుగునా కనిపించే చిత్రవిచిత్రాలు
బతుకు సంతలో
కానీకీ చెల్లని ప్రతివాడూ
తమ పేగుల్ని జతచేసిన వాళ్ళు
రక్తం పీల్చి మశకమైపోతున్న నైపుణ్యాలు
అగ్రవాదం దేశాల్ని మింగే తిమింగలమైతే
ఉగ్రవాదం మనుషుల్ని
నమిలే వృకమైపోయింది
పడమటి విషగాలులకు ప్రతి మనిషీ
సరికొత్త జీవపరిణామం
అందమైన ఈ చిత్రపటంపైన
ఎంత వెదికినా కనిపించనిది ఒక్కటే
మనిషి జాడ
ఈ లోకం నుంచీ
మనిషి పారిపోయి
చాలా ఏళ్ళే అయిపోయింది.



## భరోసాగానే

**వేము**

జీవితమంటే
సమాధానం లేని
ప్రశ్నవుతున్నప్పుడు
తడారని జవాబుకోసం
సామూహిక స్వప్నాన్ని
ప్రసవించాల్సి వస్తుంది
ఒకానొక సందిగ్ధావస్థ నుండి
దారి మళ్ళిన గొర్రెపిల్లకు
సానుభూతి కాక
సమాధానమే సంతృప్తినిస్తుంది

కాదని వెళ్ళిన మిమ్మల్ని
మళ్ళీ మళ్ళీ పిలిచిన పిలుపు
కల చెదిరిన కలత నిద్రే
ఎంతకీ ఆగని పాటై
దేశాన్ని చుట్టి వస్తున్న
దళిత స్వాప్నికుని నినాదం 'వర్గీకరణం'

తెగిన గాలిపటం కోసం
మళ్ళీ వెతుకులాట
మొదలయ్యింది. పోగొట్టుకున్న ప్లేస్ నుండే
చేజారిన ఆత్మకోసం
ఆర్తిగా మరోమారు
బతుకుపోరు
కడుపు కాలిన పోరు
బక్క చిక్కిన దేహాల్తో
భరోసాగానే.....

(ఎండ్లూరికి ఆప్యాయంగా)

# ఆధునిక తెలుగు కవిత్వంలో 'మా ఊరు' భావన



'మాఊరు' అనే ఈ భావనను విస్తృతార్థంలో గమనించాలి. ఇక్కడ ఊరు అంటే ఏదో ఒక పల్లె అనో లేక గ్రామమనో అర్థం కాదు. ఊరు అంటే వ్యక్తి యొక్క పుట్టి పెరిగిన ప్రదేశం. అది పల్లె అయినా కావచ్చు లేదా పట్టణమయినా కావచ్చు. కాబట్టి ఆ ప్రదేశంలో జన్మించిన వారికది వారి యొక్క సొంత ఊరుగానే పరిగణింపబడుతుంది. అయితే ఈ కవితా సంకలనంలోని కవులు ఎక్కువ మంది పల్లె/గ్రామీణ నేపథ్యం నుంచి వచ్చిన వారు కావడం చేత వీటికి సంబంధించిన కవితలు ఎక్కువగా దీనిలో చోటు చేసుకోవడం గమనించదగినది.

**జె. సుబ్బారావు**

"రెండు చేతులు రాపిడి చేస్తే రాలేది మట్టి. ఇదే మట్టికీ మనిషికీ వున్న సంబంధం. ఈ సంబంధమే పుట్టిన ఊరుతోనూ వుంటుంది"
('మాఊరు' కవితా సంకలనం సంపాదకీయం)

మట్టికీ మనిషికీ తరతరాల అనుబంధం. "ఊరు" అనేది మనిషి ఊపిరితో పెనవేసుకుపోయిన సంబంధం. ప్రతీ వ్యక్తి ఏదో ఒక ఊరిలో పుట్టకా తప్పదు, పెరగకా తప్పదు. ఈ క్రమంలో తన చుట్టూ వున్న వారితో బంధాలూ, అనుబంధాలూ తప్పవు, ఘర్షణలూ తప్పవు, కనుక ఊరు అనేది ప్రకృతి సోయగాల్ని మన కళ్ళ ముందుంచే ఒక అందమయిన, రమణీయ దృశ్యం.

మనిషి కేరింతలతో భూమి మీద పడినప్పుడే ఊరితో అతనికి సంబంధం ఏర్పడుతుంది. కొన ఊపిరి పోయేంతవరకు ఆ ఊరితో అతనికి అనుబంధం కొనసాగుతూనే వుంటుంది. అమ్మఒడి, చదువుకున్న బడి, ఊరిలోని గుడి అన్నీ అతని జీవితంలో కలకాలం జ్ఞాపకాలుగా నిలిచిపోతాయి. అవసరాల కొద్దీ మనిషి ఎంత దూరం వెళ్ళినా మనసెప్పుడూ అమ్మవైపు, ఊరివైపు లాగుతూనే వుంటుంది. స్వచ్ఛమైన ఆ ఊరిగాలి పీల్చాలని, కమ్మనైన అమ్మ ప్రేమ పొందాలనీ, బాల్యమిత్రులను కలుసుకోవాలనీ మనసుపడే ఆరాటాన్ని చెప్పడానికి మాటలు చాలవు. ఇదే ఆ ఊరికీ ఆ ఊరిలోని వ్యక్తులకూ వుండే సంబంధం.

పల్లెటూళ్ళు భారతదేశానికి గుండెకాయ, పల్లెటూళ్ళలోనే అచ్చమైన భారతీయ సమాజం ప్రతిబింబిస్తుంది. ప్రతీవ్యక్తి జీవితంలోనూ ఊరు అనే భావనకు అత్యంత ప్రాధాన్యత వుంటుందని చెప్పడం అతిశయోక్తి కాదు. వ్యక్తికి అస్తిత్వాన్ని, వ్యక్తిత్వాన్ని నేర్పి జీవితానికి బాటలు వేయడం, వ్యక్తి తన ఉనికికి ఒక ఆకృతిని పొందడం ఊరిలోనే ప్రారంభమవుతుంది, ఊరు అనేది సహజ సౌందర్యానికి, స్వచ్ఛతకీ నిలయం. మంచి మనుషులు, ప్రేమలు, ఆప్యాయతలు, అమాయకత్వాలు ఇలా అన్నింటికీ ఊరు అచ్చమయిన పర్యాయపదంలా నిలుస్తుంది.

ఏదయిన ఒక వస్తువు విలువ అది దూరమయినపుడే తెలుస్తుంది. అలాగే సొంత వూరికి కూడా దూరంగా వున్నప్పుడే ఊరిని గూర్చిన భావనలు మనిషిని వెంటాడుతుంటాయి. సాధారణంగా ఎంతో మంది విద్యార్జన కోసం, ఉద్యోగాల నిమిత్తం ఉన్న వూరు వదిలి పట్టణాలకు వలస వచ్చి బతుకు తెరువు కోసం ఇక్కడ స్థిరపడడం జరుగుతుంది. ఇటువంటి సందర్భాలలో పట్టణ పరిస్థితులలో ఇమడలేక, ఉన్న ఊరుకు తిరిగి వెళ్ళలేక నలిగిపోతుంటారు. కన్నతల్లి లాంటి ఉన్న ఊరు జ్ఞాపకాలను మర్చిపోలేక మళ్ళీ ఆ అనుభూతులను, అనుబంధాలనూ తిరిగి పొందాలని పరితపించిపోవడం సహజం. ఈ క్రమంలో ఆ ఆవేదనకు కవులు ఇచ్చిన అక్షర రూపమే 'మాఊరు' కవితా సంకలనం. ఇందులో మొత్తం 160 హృదయస్పందనలు ఆవిష్కరించబడ్డాయి.

అభివ్యక్తిలో వైవిధ్యం వున్నా ఒకే వస్తువును ఆధారంగా చేసుకుని వచ్చిన కవితలను ఒక చోటికి చేర్చి 'మాఊరు' కవితా సంకలనం వెలువరించడం 'రంజని సాహితి సమితి' విశిష్టతగా చెప్పవచ్చు. ఇదే తరహాలో ఇంతకు ముందు 'అమ్మ' కవితా సంకలనాన్ని ప్రచురించిన 'రంజని సాహితీ సమితి' 'మాఊరు' కవితా సంకలనాన్ని ప్రచురించి మరోసారి తన విశిష్టతను చాటుకుంది. ఇందులోని కవితలు ఈ సంకలనం కోసం ప్రత్యేకంగా రాయబడినవి కాదు. ఆయా సందర్భాలలో, ఆయా కవులు సొంతవూరిపై మమకారంతో రాసుకున్న కవితలు వివిధ పత్రికలలో, కవితా సంకలనాలలో ఇంతకుముందే ప్రచురించబడ్డాయి.

ఈ సందర్భంలో 'మాఊరు' అనే ఈ భావనను విస్తృతార్థంలో గమనించాలి. ఇక్కడ ఊరు అంటే ఏదో ఒక పల్లె అనో లేక గ్రామమనో అర్థం కాదు. ఊరు అంటే వ్యక్తి యొక్క పుట్టి పెరిగిన ప్రదేశం. అది పల్లె అయినా కావచ్చు లేదా పట్టణమయినా కావచ్చు. కాబట్టి ఆ ప్రదేశంలో జన్మించిన వారికది వారి యొక్క సొంత ఊరుగానే పరిగణింపబడుతుంది. అయితే ఈ కవితా సంకలనంలోని కవులు ఎక్కువ మంది పల్లె/గ్రామీణ నేపథ్యం నుంచి వచ్చిన వారు కావడం చేత వీటికి సంబంధించిన కవితలు ఎక్కువగా దీనిలో చోటు చేసుకోవడం గమనించదగినది.

మనిషిని కేంద్రంగా చేసుకుని రాసేది కవిత్వం. ఏ కవిత్వ ధోరణి అయినా ముందు కవిత్వరూపంలోనే వ్యక్తమవుతుంది. ప్రాచీన కావ్యాలు ప్రజల సంప్రదాయాలు, ఆచారాలు, ప్రజాజీవనం, విందులు, వినోదాలు మొదలయిన వాటిని ప్రతిబింబించినంతగా ప్రజాజీవితంలోని సంఘర్షణని, ఒడిదుడుకుల్ని ఎక్కడో తప్ప వివరించలేదు. అయితే ఆధునిక కవిత్వంలో ఈ ధోరణి మారిపోయింది.

ఆలోచనలలో సాధించిన పరిణతి ఆధునికతకు బాటలు వేసింది. సాంఘిక జీవితాన్ని, అందులోని ఒడిదుడుకుల్ని ప్రతిబింబించడం ఆధునిక కవిత్వ లక్షణంగా మారింది. మారుతున్న కాలం, వాటితోపాటు మారుతున్న సమాజ పరిస్థితులకు ఆధునిక కవులు ప్రాధాన్యమిచ్చారు. అప్పటి వరకు పల్లెల్లో, పుట్టిన ఊళ్ళల్లో ప్రశాంత జీవనం గడిపివచ్చిన వాళ్ళకు పట్టణ పోకడలు రుచించలేదు. అందువలన పల్లె ప్రకృతిని, పట్టణ పరిస్థితిని పోల్చి తమ జీవితాల్ని అంచనా

వేసుకుంటే పొందిన దానికంటే పోగొట్టుకున్నదే ఎక్కువనిపించింది.

భారతదేశాన్ని ఆంగ్లేయులు సుమారు మూడు వందల యాభై సంవత్సరాలకు పైగా పాలించారు. ఆ కాలంలో వారు అనుసరించిన వలస విధానం, ఆర్థిక విధానం మొదలుగునవి దేశంలో ముఖ్యంగా గ్రామీణ జీవనంలో ఎన్నో మార్పుల్ని తీసుకొచ్చాయి. ఈ మార్పులన్నీ 'మాఊరు' కవితా సంకలనంలోని కవితల ద్వారా మనం గమనించవచ్చు. వీటిని ఒక వరుస క్రమంలో మనం పరిశీలిస్తే :

1. పల్లె సహజ ప్రకృతి దృశ్యాలు కనుమరుగు కావడం.
2. చిన్నప్పటి ఆప్యాయతలు, అనుబంధాలు లేకపోవడం.
3. స్నేహం, కుటుంబ సంబంధాల స్థానంలో డబ్బు పాత్ర అధికం కావడం.
4. పల్లె జీవితంలో కూడా ప్రశాంతత కరువవడం.
5. ఆధునికత పేరుతో వస్తున్న సౌకర్యాలు మనిషికీ - మనిషికీ మధ్య సంబంధాల్ని విచ్ఛిన్నం చేయడం.
6. ప్రభుత్వ విధానాలు పల్లెల ప్రగతిని ఇతర దేశాలకు తాకట్టు పెట్టడం.
7. ప్రపంచీకరణ పేరుతో ధనిక దేశాలు పల్లె సంపదను దోచుకోవడం.
8. మానవులలో నానాటికీ పెరిగిపోతున్న స్వార్థం.

ప్రధానంగా పైకి కనిపించే మార్పులు అవే అయినప్పటికి ఇందులో అనేక అంతర్గత విషయాలు మిళితమైవున్నాయి. పల్లె నేపథ్యానికి చెందిన కవులు ఎక్కువ మంది కావడం, ప్రతీ వ్యక్తి తను పుట్టిన ఊరిపై మమకారంతో ఏదో ఒక సందర్భంలో కవిత్వం రాయడం వల్ల పల్లెటూర్లో లభించే ప్రశాంతతలు మొదలుకొని ఈనాటి ప్రపంచీకరణ ప్రభావంతో పల్లెటూర్లలో వున్న కాస్త ప్రశాంతత కూడా లోపించడం కూడా ఆయా కవితలలో మనకు గోచరిస్తుంది. అయితే కవితలను విషయ విస్తృతి వల్ల ఆయా విభాగాల కిందకు చేర్చి పరిశీలిస్తే ప్రధానంగా ఈ క్రింది వర్గీకరణ మనకు అవగతమవుతుంది. 'మాఊరు' కవితా సంకలనానికి ముందుమాట రాస్తూ చీకోలు. సుందరయ్యగారు ఈ వర్గీకరణ చేయడం జరిగింది.

1. స్వీయానుభూతి - సానుభూతి కవిత్వం
2. విప్లవ కవిత్వం
3. స్త్రీవాద కవిత్వం
4. దళితవాద కవిత్వం
5. ముస్లింవాద కవిత్వం

'మాఊరు' కవితా సంకలనంలో కవులు తమ సొంత అనుభూతులను వ్యక్తం చేయడానికి అధిక ప్రాధాన్యతనిచ్చారని చెప్ప వచ్చు. ఊరినీ, ఊరిలోని పరిసరాలనూ, కలిసి తిరిగిన వ్యక్తులనూ, స్నేహితులనూ, సన్నిహితు లనూ, గుడినీ, బడినీ... ఇలా ఊరిలోని ప్రతి అణువుతో తమకున్న అనుబంధాన్ని, అవి మిగిల్చిన అనుభూతుల్ని కవిత్వీకరించారు. ఒక్కొక్కసారి కొన్ని కవితలలో ఊహశక్తి పాలు అధికంగా అనిపించినా, పుట్టి పెరిగిన ఊళ్ళతో వారికున్న మమకారం వల్ల అది ఆయా కవితలలో ప్రతిబింబించిందని చెప్పవచ్చు.

ఈనాడు కవి మేధావిగా, నాగరికుడిగా ఎంత ఎదిగినా బలీయమయిన స్మృతులు అతని మదిలో కదలకమానవు. ఆయా సందర్భాలలో ఊరిపట్ల, ఊరిలోని ప్రకృతి దృశ్యాలపట్ల మమకారం పొంగినపుడు ఆ స్మృతులన్నీ కవిత్వంగా వెలువడతాయి. అప్పుడు తన ఊరు ఒక విశ్వరూపంతో దర్శనమిస్తుంది. ఆ ఊరిలోని పిట్టలు, గువ్వలు, అమాయక ప్రజలు మొదలగు ప్రతీ అంశం తన అణువణువునూ పులకింపచేస్తుంది. ఆ ఊపులోనే సహజత్వం, కమ్మదనం రూపుదిద్దు కుంటాయి.

కవులు ఆయా కవితలలో వ్యక్తీకరించిన స్వీయానుభూతులు కొంత మంది జీవితాలలో మాత్రమే అనుభూతిని మిగిల్చి, ఎంతో మంది జీవితాలలో ఆవేదననూ, అసంతృప్తిని రగిల్చాయి. ఊరంటే ప్రకృతి సోయగాల్ని కళ్ళముందుంచే భావన మాత్రమే కాదు, కళ్ళల్లో నిరంతరం కదలాడే అవమానాల, ఘోరకృత్యాల తాలూకా విషాదనీడలుగా కొద్ది మంది కవులు భావించారు. ఆ నేపథ్యంలోంచి పుట్టిన కవిత్వాన్ని ఒక క్రమంలో పరిశీలిస్తే పై వర్గీకరణ రూపం మనకు స్పష్టంగా గోచరిస్తుంది.

కాబట్టి అసలు 'ఊరు' అనే భావన మనిషికి అవసరమా? అని ప్రశ్నించుకుంటే సమాధానం చెప్పడం కష్టమే. ఎందుకంటే ఊరిలో ఎన్ని చేదు అనుభవాలు ఎదురయినా, ఆ ఊరిలో ఎన్ని కష్టాలు అనుభవించినా మనిషి తాను పుట్టిన ఊరిలో వుండడానికి ఇష్టపడుతున్నాడేగానీ విడిచిపెట్టి వెళ్ళలేక పోతున్నాడు. దీన్నిబట్టి చూస్తే ఊరు భావన అనేది మనిషి మనసుపై వేసిన గాఢమయిన ముద్ర అని చెప్పక తప్పదు. కాబట్టి స్వీయాను భూతితో మొదలయిన కవితలు సానుభూతితో ముగియడం, చివరికి అవి విప్లవ, దళిత, స్త్రీవాద, ముస్లింవాద కవిత్వంగా మారిన తీరును వివరించడం ఈ వ్యాసం యొక్క ప్రధాన వుద్దేశం.

**1. స్వీయానుభూతి - సానుభూతి కవిత్వం :**

ఊరిపట్ల, ఊరిలోని వ్యక్తులు - పరిసరాలపట్ల కవికి కలిగిన అనుభూతి స్వీయానుభూతి రూపంలో ఈ సంకలనంలో చోటు చేసుకుంది. ఇందులో కేవలం కవికి కలిగిన అనుభూతే ప్రధాన వస్తువు. మనిషి నేటి యాంత్రిక జీవితంలో కోల్పోతున్న ఆనందాన్నీ, అనుభూతినీ అందించడమే దీని ప్రయోజనంగా చెప్పవచ్చు. అయితే స్వీయానుభూతిలో ఆయా కవుల ప్రకృతి అనుభూతులతోపాటు ఆ పరిస్థితులన్నీ మారిపోయాయనే ఆవేదన సానుభూతి కవిత్వంగా మారింది.

**'భూమ్మీద చందమామ మాఊరు**
**నక్షత్రాలు ఇళ్ళు మేఘాల గుడిసెలు**
**అదో చంద్రమండలం'**

(చంద్రమండలం-శ్రీరాములు కందుకూరి -పు:63)

అత్యంత భావుకత్వంతో నిండి, స్వీయానుభూతి తారాస్థాయికి చేరి అతి పెద్ద ప్రశ్నను మన కళ్ళముందుంచే కవిత ఇది. ఇళ్ళు నక్షత్రాలు, మేఘాలు గుడిసెలు అని జీవితంలో అనుభవించిన వాటిని తన కవితాశక్తి చేత పొందుతున్నాడు కవి. ఈనాటి ఇళ్ళు, ఇటువంటి ఊళ్ళు మనకు నిజజీవితంలో కనిపించవుగానీ దానిని చంద్రమండలంగా ఊహించుకుని కవి స్వీయానుభూతి పొందుతున్నాడు.

**'ఊరంటే అమ్మ చెంగుతో**
**ముఖం తుడుచుకున్నంత ఊరట!**
**ఊరంటే అమ్మ వెచ్చటి ముద్దు-**
**ఊరంటే నాన్న చేయి పట్టుకుని**
**అందరివైపు ధీమాగా చూస్తూ**
**ముందుకు నడిచిపోవడం'**

(ఊరమ్మ - చందనరావు వి.పి.-పు:107)

జన్మనిచ్చిన అమ్మ, నడిపించిన నాన్న, పుట్టిన ఊరు, తిరిగిన ప్రదేశాలు అన్నీ మనిషి జీవితంలో మరపురాని జ్ఞాపకాలు. ఎందుకంటే చిన్నతనంలో అమ్మానాన్న చేయిపట్టి నడిపిస్తే ఎదిగే కొద్దీ ఆ భావనలు మనిషిని నిరంతరం వెన్నంటి వుండి ముందుకు నడిపిస్తాయనడం అతిశయోక్తి కాదు.

**'మాఊళ్ళో ఆకాశం విశాలంగా వుంది**
**అడవి ఒడిలో సెలయేళ్ళ పడితో**
**వెన్నెల రుచిమరిగిన పిల్లగాలితో మాఊరు**
**కోయిల పాట వింటూ**
**తనకు తెలియకుండానే వికసించి**
**సిగ్గుపడిపోయే ఆకుమాటు పువ్వులా వుంది'**

(పొగచూరిన ఆకాశం-వేణుగోపాల్ అమ్మంగి-పు:37)

పల్లె ప్రజల జీవితం ప్రకృతితో ఎంత ముడివేసుకుని వుంటుందో మనం

గమనించవచ్చు. సెలయేళ్ళు... పిల్లగాలులు... వెన్నెల... ఊరికే కొత్త శోభను తెచ్చే కోయిలపాట... ఆకుమాటు పువ్వు... ఇవన్నీ కలిసి ఊరి ప్రకృతి శోభను ఇనుమడింప చేస్తాయి. కనుక పల్లె ప్రజల ఊహలు, ఆలోచనలు అన్నీ ప్రకృతితో ముడివడి వుంటాయి.

**'ఊరు అంటే పదిలం**
**ఊరు అంటే ఆత్మీయుల పొదరిల్లు**
**కల్లాకపటం ఎరుగని అనురాగమాల**
**సహస్రవృత్తుల కర్షకకార్మిక ఇంద్రజాలం'**

(పరికిణి - ప్రభాకర్ కె - పు:180)

పల్లె ప్రజల మనస్తత్వానికి అద్దం పట్టే కవిత ఇది. ఊర్లన్నీ దాదాపుగా సహకారం అనే విధానంతో కొనసాగుతుండేవి ఒకప్పుడు. వీటిలో ఆచారబద్ధమయినటువంటి సామాజిక, ఆర్థిక పరస్పర సహకారం కనిపిస్తుంది. వృత్తులు అనేవి వ్యక్తుల మధ్య పరస్పర సహకారానికి ప్రాతినిధ్యాన్నిస్తాయి. పదిలం, పొదరిల్లు, కల్లాకపటం లేకపోవడం, అనురాగాన్ని పంచడం పల్లె ప్రజల మనస్తత్వానికి నిదర్శనం. అన్ని వృత్తులనూ కలబోసుకుని సహజీవనం చేయడం కూడా మనకు పల్లెల్లో కన్పించే సన్నివేశం.

అయితే ఈ పరిస్థితులన్నీ మారిపోయాయి. వ్యక్తిలో మార్పులు వస్తున్నాయి. తత్ఫలితంగా ఆయా మార్పులు సమాజంలో కూడా చోటు చేసుకుంటున్నాయి. ఆయా రచయితలు చిన్నతనంలో చూసినవి చూసినట్లు లేకపోవడం, ప్రకృతి దృశ్యాలు కనుమరుగవ్వడం, కొందరి బతుకులు ఛిద్రంకావడం కాలక్రమంలో జరిగిన మార్పులు.

**'ఇప్పుడు గల్లీకో కాన్వెంటు స్కూలు**
**ఆర్.ఎం.పి డాక్టర్లు**
**పంచాయితీ ఆఫీసు రేడియో గ్రామ సీమల్లేవు**
**టి.వి. యాంటినాలు డిష్ యాంటినాలు తప్ప'**

(ఊరమ్మ - చందనరావు వి.వి. - పు:108)

ఇప్పుడు పల్లెటూరి వర్ణచిత్రం మారిపోయింది. కొత్తరూపం పొందిన తీరుని మన కళ్ళముందుంచుతున్నాడు కవి. మార్పుల రూపంలో ఆధునిక సౌకర్యాలు పల్లెటూర్లలో ప్రవేశించే టీవీ యాంటీనాలు, డిష్ టీవీ, కేబుల్ వైర్ల రూపంలో దర్శనమివ్వడం మనం నిత్యజీవితంలో చూస్తున్నవే.

**'కరెంటు తీగలపై టెలిఫోన్ స్థంభాలపై**
**వేలాడుతున్న ప్రతీగాలిపటంకై**
**ఆశగా చూస్తున్న ప్రతి పిల్లవాడి**
**అంతరంగాన మెదిలే కోరికొక్కటే**
**నేనొక హీమ్యాన్నో స్పైడర్ మ్యాన్నో**
**అయితే బావుండని'**

(గుమ్మడితీగ - రాంబాయి తాళ్ళపల్లి - పు:128)

ఆధునిక సౌకర్యాలు గ్రామీణ జీవితంలోని చిన్న పిల్లలను కూడా ఎంతగా ప్రభావితం చేస్తుందో పై కవిత ద్వారా మనం గమనించవచ్చు. కోతికొమ్మచ్చి, చెడుగుడు మొదలగు ఆటలన్నీ ఆటకెక్కి మంత్రముగ్ధులై పిల్లలు టీవీల ముందు కూర్చుంటున్నారు. అందులోని దృశ్యాలు పిల్లల మనసులపై ఎంతగానో ప్రభావం చూపించి ఆ మైకంలో హీమ్యాన్నో, స్పైడర్ మ్యాన్నో అయితే బావుండనే కలల్లో తేలిపోవడం, చివరికి వారి ప్రాణాలకు ముప్పు ఏర్పడడం మనకు తెలిసిందే.

**'నాఊరు నన్ను కన్నది**
**దాన్ని ప్రేమించకుండా వుండలేను**
**ఇప్పుడు కొత్త వ్యవస్థని కంటోంది**
**కనుక ప్రణమిల్లకుండా వుండలేను'**

(నా ఊరి గురించి గీతం - చినవీరభద్రుడు - పు: 111)

మనం నివసిస్తున్న సమాజం నిరంతరం మారుతూ వుంది. మార్పు పురోభివృద్ధికి సూచిక. ఆనాటి నుండి ఈనాటి వరకు గమనిస్తే సమాజం ఎంతో నూతనత్వాన్ని పొందడం గమనించదగిన విషయం. ఏ మార్పూ లేకుండా వుండే సమాజం ఏనాటికీ అభివృద్ధి సాధించలేదు. మనిషిని కేంద్రంగా చేసుకుని ఏర్పడిన సమాజం కొత్త పోకడలను ఆహ్వానిస్తుంది. కాబట్టి మనిషి ఆ మార్పుల్ని అనుసరిస్తూ కొనసాగవలసిందే.

**2. విప్లవ కవిత్వం :**

ఊరు సహజంగా మానవునికి ఎన్నో తీయని అనుభూతుల్ని మిగుల్చుతుంది. అయితే తీయని ఆ అనుభూతుల వెనుక మానని గాయాలు కూడా వుంటాయి. అటువంటి వాటిలో నుండి పుట్టుకొచ్చిందే ఈ విప్లవం కవిత్వం. అసలు ఊరికి-విప్లవానికీ సంబంధం ఏమిటని ప్రశ్నించుకుంటే సమాధానం బోధపడుతుంది.

గ్రామం లేదా పల్లెల్లో అనుసరిస్తున్న వృత్తి విధానం, కుల విధానం, వెట్టి, ఆర్థిక పరమైన దోపిడి - ఇలాంటివన్నీ మానవులలో తీవ్రమైన ఆవేదననూ, అసంతృప్తినీ కలిగించాయి. భూస్వామ్య వ్యవస్థ, దొరతనం, ఆర్థికపరమైన అజమాయిషీలు సమాజంలో శ్రామిక వర్గానికి కంటకప్రాయంగా వుండేవి. రానురాను ఈ విధానాలవల్ల విసిగిపోయిన శ్రామికులు, కూలీలు తిరుగుబాటుదారులుగా మారారు.

సమాజంలో ఎక్కువ తక్కువలు అనే బేధం లేకుండా అందరూ సమానమేనంటూ, తిరుగుబాటు మాత్రమే సామాజిక మార్పుకు దోహదపడుతుందని నమ్మడం ద్వారా విప్లవ కవిత్వం పుట్టుకొచ్చింది. 'మాఊరు' కవితా సంకలనంలోని విప్లవ దృక్పథానికి సంబంధించిన కవితలను పరిశీలిస్తే ఈ కింది ముఖ్య విషయాలు గోచరిస్తాయి.

1. కష్టానికి తగిన ప్రతిఫలం అందకపోగా కామందులు చేసే దౌర్జన్యాలు
2. వెట్టిచాకిరి
3. కూలి నిర్ణయంలో అన్యాయం
4. రుణాల పేరుతో చేసుకునే ఆక్రమణలు
5. రాజకీయ ప్రయోజనాల కోసం బలిపశువులుగా వుపయోగించుకోవడం.

---

## శూన్య ఆకాశం

రేణుక అయోల

వ్యక్తి మరణం
శూన్య ఆకాశం
ఏది మిగల్చకుండా
గడచిన కాలాన్ని
పాము కుబుసంలా వదిలేస్తూ
పాకుతూ వెళ్ళిపోతుంది
నిద్రపట్టని రాత్రుళ్లు కన్నీటి ధారలు
మౌనాన్ని ఛేధించలేక
తపన పడతాయి
మృత్యువు ఇంటి పునాదులను
కూల్చేస్తుంది

కూలిన కష్టం కింద
నలిగిన జీవితాల కడుపులో శోకాలు
అగ్ని పర్వతాలు
ఎంత వద్దనుకొన్న
పాత జీవితం కళ్ల ముందు
కదలాడుతుంటే
మరచిపోలేక వ్యక్తిని వెదుకుతూ
ఆల్బంలను తిరగవేస్తూ

పలుకరిస్తే చాలు
కన్నీటి వర్షాలను రాల్చుకొంటూ
బతుకుని మోస్తాయి
అంగుళం కదల్చలేని పాదాలను
సవరించుకుంటూ
నడిచే నడకలు తడబడి కూలబడతాయి
వెళ్లిపోయిన వ్యక్తి చిరునామాలు
కళ్ళల్లో మిగిలిపోతాయి
మాటిమాటికి రెప్పలను ఒరుసుకుని
పారే నీటి తడిలో ఇంకిపోతాయి
ఎక్కడి మృత్యువైనా
శూన్య ఆకాశంలా అగుపడుతుంది...

# అమృతభాండం

## ఎస్. షంషీర్ అహ్మద్

నానా రుచిరార్థ సూక్తి నిధిరా స్నేహం
నిన్ను – నన్ను ప్రేమార్ద్రతల పలకరించు నేస్తంరా స్నేహం
అది భాషకందని భావము
భావాతీత భాష్య భరితము
మౌనీశ్వరుని తాదాత్మ్యతా ధ్యానము
అనగనగ రామమతిశయిల్లు స్నేహ సంగీతము
ఎన్నిమార్లు ఆలపించినా, ఆలకించినా
విసుగనిపించని విమల గాంధర్వము
తినగతినగ తియ్యందనములూరు
చేదు వేములోని పోలికరా స్నేహము
ఎంత రుచి చూసినా – వెగటు పుట్టని పాకము
చవులూరించే సుధా మధువొలుకు స్నేహము
పులి మేకల నొక కొయ్యకు గట్టి
పాము ముంగిసల నొకచోటకు జేర్చి
జన్మ వైరాన్ని జయించి
సరికొత్త స్నేహానికి జన్మనిచ్చే మైత్రిబంధం స్నేహము
సృష్టికి తెచ్చె తానొక వింత సోయగం
అందమైన గులాబీ బాలకు
రక్షా కవచపు మైత్రీ బంధన మల్లింది



ముళ్ళ తోటి ఒద్దికైన చెలిమి
పది నెలలు మోసి
తను ప్రసవించు ప్రాణ ప్రతిమను
ప్రేగు బంధంలో పరిపుష్టం చేసి
మాయాఛ్ఛాదిత మైత్రీ కవచంతో
పదిలపరచు, పరాత్పరునిబోలు
మాతా మమతానురక్తిని మించిన
మైత్రీ బంధన మేమున్నది జగతిని?
ఏ కులం మీదను ప్రశ్న వెలయించదు మైత్రి
కాదది మత ఛాందస మమతానురక్తి
కరుణ వర్షించి
వైరాల బీటి నేలను
స్నేహ సౌభాగ్య సస్యసంభరితం జేసే
సమ్మోహన శక్తి స్నేహం
తనను తాను త్యాగతర్పణం చేసుకున్న
శిలువపైని క్రీస్తుతత్వం స్నేహము
అహింసాయుధంతో
హింసాసురుణ్ణి సంస్కరించి
శాంతి ప్రబోధించిన గాంధీతత్వం స్నేహము
సహనం – సహానుభూతుల
దివ్య సమ్మేళనం స్నేహం
ఈర్ష్యాసూయలకు, రాగద్వేషాలకు
దివ్యమైన ఔషధం స్నేహం
అనశ్వరమైన శనీశ్వరపు యాత్రలో
అమరత్వపు సుఖ సంతోషాల నందించే
అమృతభాండం స్నేహం

---

# సవాలు

## పంతంగి

నీవు 'నా తోడుంటే
దేన్నైనా ఢీకొంటా
నీవు నా తోడుంటే
దేన్నైనా జయిస్తా

నీవు నా తోడుండగలవా?
అది ప్రకృతి విరుద్ధమని
వీడ్కోలు పలికింది యవ్వనం
పిలవని పేరంటానికి
విచ్చేసిన నడివయసు
కానుకగా...
అనారోగ్యాన్ని బహూకరించింది

నేను నిమిత్తమాత్రుణ్ణి
నేనూ మనిషినే అర్థం చేసుకోగలను
విలువలు, రాజకీయ విశ్వాసాలు వీడనందుకు
నిర్బంధ శిబిరం ఆవాసమయింది
దీర్ఘకాల జైలు జీవితం

విసిరే సవాళ్ళనూ స్వీకరించగలను
జీవిత ఖైదు నేర్పే కఠిన పాఠాలను
జీర్ణించుకోగలను
యవ్వనం కనే కలలను
తృణప్రాయంగా త్యజించగలను

కానీ...!
నేను నేనుగా జీవించి ఉండటం
నేను నేనుగా నిలిచి ఉండటం
నేను నేనుగా మిగిలి ఉండటం
నా ముందున్న అతి పెద్ద సవాలు!?

---



# చక్రభ్రమణం

## అడిగోపుల వెంకటరత్నమ్

నిస్వార్థ పాదాలు నింగిలో
వట వృక్షాలౌతాయి
పుష్పించని పాదాలు
క్షితిరేఖపై సంచరిస్తూ
ఈర్ష్యను రాశిపోస్తాయి
రెమ్మల్ని కొమ్మల్ని నరుకుతూ ఒకడు
చిగురుల్ని ఆకుల్ని రాల్చుతూ ఒకడు
అవి చూపులే
ఎంత ద్వేషం విరజిమ్ముతాయి
అవి మాటలే
ఎంత క్రౌర్యం కక్కుతాయి
అవి చేతలే
ఎంత అకృత్యం నెరపుతాయి!
ఒక పాదం వంద పాదాల్ని జతపరుస్తుంది

ఒక చేయి వేయి చేతుల్ని కూడగడుతుంది
ఒకటి ధృతరాష్ట్ర కౌగిలి
ఒకటి శకుని మాయోపాయం
భౌతిక రూపం మనోహరం
మనోరూపం కుటిలం!
స్వార్థానిదీ ఆశావాదమే
పథ నిర్దేశనమే
మాటకు తాళం జతకడుతుంది

పాటకు కోరస్ పాడుతుంది!
అంతర్వీక్షణం సారిస్తే
మనిషిలో దాగిన మనిషి
మూసిన తలుపులు తెరవనంటున్నాడు
కుడి ఎడమైతే పొరపాటే
జీవితకాలం శాపగ్రస్తం!
మనిషి విఘ్నకరుడు
విచక్షణుడు
సచేతనుడు
చరిత్రది చక్రభ్రమణం
మడమ తిప్పిన పాదాలు
ఒకానొక వర్తమానంలో
ముందు చూపు చూస్తాయని
నిరంతర నిరీక్షణ!

# కథా పురస్కారాలు



ఖమ్మంజిల్లా సాహితీ స్రవంతి గౌరవ సలహాదారులు ప్రముఖ కథా రచయిత జాతశ్రీకి, "చలివేంద్రం" కథా సంకలనం రమ్య సాహితీ, పెనుగొండ వారు నిర్వహించిన కథా సంపుటి పోటీలో అవార్డు పొందింది. ఉగాది సందర్భంగా ఏప్రిల్ 16న హైదరాబాద్‌లోని చిక్కడపల్లి నగర కేంద్ర గ్రంథాలయంలో ప్రముఖ కథా రచయిత్రి కేంద్ర సాహిత్య అకాడమీ అవార్డు గ్రహీత అబ్బూరి ఛాయాదేవి గారి చేతుల మీదుగా ఈ పురస్కారాన్ని జాతశ్రీ గారు అందుకున్నారు.



శ్రీ రావి కృష్ణమూర్తి స్మారక పురస్కారము 2006 విశాఖపట్టణం. వారు నిర్వహించిన కథల పోటీలో సాహితీ స్రవంతి ఖమ్మంజిల్లా సహాయ కార్యదర్శి శిరంసెట్టి కాంతారావు 'పోరువనం' కథకు ద్వితీయ బహుమతి వచ్చింది. ఈ కథ 'పోలవరం' నిర్వాసిత ప్రాంతాలు పర్యటించి వచ్చిన పిదప రాసిన కవితా కథా సంకలనం 'జీవన్మరణం'లోనిది.

# మలక్‌పేటలో సాహిత్య సౌరభాలు

ప్రఖ్యాత విద్యావేత్త, ప్రభుత్వ పాఠ్యాంశాలకు సంపాదకత్వం నెరపిన కవి, పండితులు, డాక్టర్ వి.వి.ఎల్. నరసింహారావుగారి అధ్యక్షతన ఏప్రిల్ 26న హైదరాబాద్ మలక్‌పేట సాహితీ స్రవంతి కావ్య స్థానమైన సంతోష్‌నగర్‌లో ఉగాది కవి సమ్మేళనం జరిగింది. డాక్టర్ తిరునగరి ముఖ్య అతిథిగా విచ్చేసి నాటి కవులు ఎలా ప్రజాపక్షాన నిలబడ్డారో వివరంగా మాట్లాడి స్వీయ కవితాగానం చేశారు. ఈ కవి సమ్మేళనంలో దాదాపు అంతా కవులే పాల్గొనుట మరో విశేషం. తంగిరాల చక్రవర్తి స్వాగతం పలుకగా రవికుమార్ వందన సమర్పణ చేశారు. ఎ. సత్యభాస్కర్ సాహితీ స్రవంతి లక్ష్యాలు, ఉగాదిపై స్వీయ కవిత చదివారు. ఈ కవి సమ్మేళనంలో గురజాడ అప్పారావు, గజవెల్లి దశరథ రామయ్య, తంగిరాల చక్రవర్తి, దాస్, ఆళహరి హన్మంతరావు, ఎ. రాధాకృష్ణ, జి. కృష్ణమూర్తి, గణేష్, కె.ఎల్. కామేశ్వరరావు, జి.ఎస్. రామకృష్ణ పాల్గొన్నారు.

మలక్‌పేట-సిఐటియు జోన్ కార్యాలయంలో ఎ. సత్యభాస్కర్ అధ్యక్షతన కవి గాయక మేడే సమ్మేళనం జరిగింది. పద్య కవి. కె. రాధాకృష్ణ, గేయ కవి ఎ. హనుమంతరావు, వచన కవి మోహన్‌రావు, గురజాడ అప్పారావు,




గజవెల్లి దశరథ రామయ్య, తంగిరాల చక్రవర్తి, బాలు, ఎ. సత్యభాస్కర్, భారత రక్షణ కర్మాగార కార్మికులు పాల్గొన్న ఈ 'మేడే' కవి సమ్మేళనం శ్రామిక వాణితో 'మేడే' ప్రాశస్త్యాన్ని మరోమారు చాటింది.

నేటి భారతదేశ రాజకీయాలు - శ్రామికవర్గ పాత్ర, నాటి చికాగోలో కార్మిక పోరాటం - 8 గం॥ల పని, నేటి ప్రైవేటీకరణ దిశగా పాలకుల అడుగులు... సంఘటిత పోరాటం ఆవశ్యకత - అసంఘటిత కార్మికుల ఐక్య పోరాటాల బలోపేతం మొదలగు కార్మిక లక్ష్యాన్ని "బాలు" వివరంగా మాట్లాడారు.

# "నేపథ్యం" ఆవిష్కరణ

ఇస్లాం అంటే ఒక మతం, విశ్వాసం మాత్రమేనని, దీన్ని జాతిగా భావించి అణచివేయడం తగదని పలువురు సాహితీవేత్తలు అభిప్రాయపడ్డారు. భారతీయ దళిత సాహిత్య అకాడమీ, 'స్పందన అనంత కవుల వేదిక' సంయుక్త ఆధ్వర్యంలో మే నెలలో అనంతపురం కొత్తూరు జూనియర్ కళాశాలలో పుస్తకావిష్కరణ సభ జరిగింది. ముఖ్య అతిథిగా హాజరైన కదలిక ఎడిటర్ ఇమాం, డాక్టర్ ఎస్. షమీవుల్లా రచించిన 'మైనారిటీ కవిత్వం - తాత్విక నేపథ్యం' అనే పుస్తకాన్ని ఆవిష్కరించారు. ఈ సభకు కవి వై. శ్రీరాములు అధ్యక్షత వహించారు. ఇస్లాంవాద కవి కరీముల్లా, ముస్లిం రచయితల సంఘం రాష్ట్ర అధ్యక్షుడు అజీద్, కవి చంద్రశేఖరశాస్త్రి ఈ కార్యక్రమానికి హాజరయ్యారు. ఈ సందర్భంగా వారు మాట్లాడుతూ ఏ కవిత్వానికైనా ఆవేశం ప్రధానం కాదని, సిద్ధాంత భావజాలమే ప్రాతిపదికగా ఉండాలని పేర్కొన్నారు. అనంతరం జరిగిన కవి సమ్మేళనంలో సమీవుల్లా, [illegible] కవితలు వినిపించారు.



తూర్పుగోదావరిజిల్లా కొత్తపేటలో కళాసాహితీ ఆధ్వర్యంలో వ్యయ ఉగాది కవి సమ్మేళనం, సాహిత్య సభ జరిగింది. ఈ సందర్భంగా కవి, విమర్శకుడు డాక్టర్ అద్దేపల్లి రామమోహనరావు, సప్తతి సంబరాలు జరిపారు. అద్దేపల్లి కవిత్వంపై డాక్టర్ రెంటాల శ్రీ వెంకటేశ్వరరావు కీలకోపన్యాసం చేస్తున్న దృశ్యం. చిత్రంలో డాక్టర్ అద్దేపల్లి, కళాసాహితీ గౌరవాధ్యక్షులు కె. కాత్యాయనశర్మ,ఆత్మీయ అతిథి రెడ్డి సుబ్రహ్మణ్యం వున్నారు.



మే 1న డాక్టర్ కాసర్ల రంగారావును కళాలయ సాంస్కృతిక సంస్థ పాలకొల్లువారు సత్కరించిన దృశ్యం

# కవిత్వ ప్రతిభకు మూలాలు




బిఎంఎస్ కుమార్ "నిద్ర తలుపు అను పొడవైన గది వేళ్ళు" ఆవిష్కరిస్తున్న డాక్టర్ అద్దేపల్లి రామమోహనరావు, దాట్ల దేవదానం రాజు, జి. సుబ్బారావు, సోమయాజులు, దత్తు పాల్గొన్నారు.

కవి ప్రతిభ వ్యక్తీకరించిన భావసామర్థ్యం కవుల శైలికి గుర్తింపునిస్తాయి. కవిగా బి.ఎం.ఎస్. కుమార్ ప్రత్యేక ముద్ర - సమగ్ర కవిత్వాన్ని, కవిత్వపు అభివ్యక్తిని పాఠకులకు అందిస్తాయని డాక్టర్ అద్దేపల్లి రామమోహనరావు అన్నారు. మే 2న కాకినాడ యు.టి.ఎఫ్. హాలులో సాహితీ స్రవంతి నిర్వహణలో జరిగిన "నిద్ర తలుపు అను పొడవైన గది వేళ్ళు" కవితా సంపుటిని ఆవిష్కరించారు. సమాజపరమైన వస్తువులను ఎంచుకోవడంతో మరిన్ని సమకాలీన రచనలు చేయాలని సూచించారు. 'నిద్ర తలుపు' గ్రంథ సమీక్షకులు దాట్ల దేవదానం రాజు (యానాం), జి. సుబ్బారావు (కొత్తపేట), వి.ఎస్.ఆర్.ఎస్. సోమయాజులు (కాకినాడ)లు మాట్లాడుతూ కవిత్వ ప్రయోజనం నెరవేర్చుకోవడానికి కుమార్ ప్రయోగశీల కవితల్ని, అనుభూతి అధివాస్తవాలుగా ప్రకటించారని అభిప్రాయపడ్డారు.

సాహితీ స్రవంతి తరఫున కవి కుమార్‌ను శాలువా జ్ఞాపికలతో వేదికపైనున్న సభ్యులు పాల్గొని సన్మానించారు. తనకు జరిగిన సన్మానానికి కృతజ్ఞతగా కవికుమార్ మాట్లాడుతూ మౌనధ్యానంలోని స్వీయ అనుభూతుల్ని ఎవరి భావజాలానికి లొంగని రీతిలో తన కవితల్లో చెప్పడం జరిగిందని, ప్రాకృతికతలోని సహజత్వమే ప్రేరణ అని తెలిపారు.

ఈ సమావేశం అనంతరం వి.ఎస్.ఆర్.ఎస్. సోమయాజులు నిర్వహణలో కవి సమ్మేళనం జరిగింది, శ్రీ పాద సూర్యప్రకాశరావు, అద్దేపల్లి జ్యోతి, సౌభాగ్యలక్ష్మి, అద్దేపల్లి ప్రభాకర్, కృష్ణశ్రీ, గరికపాటి మాస్టారు, దత్తు, పెండ్యాల సుబ్బారావు, డొక్కా జగన్నాథశర్మ, కొణతాల హనుమాన్‌రెడ్డి తదితరులు సామాజిక అంశాలను కవితలుగా విన్పించారు.

తొలుత సాహితీ స్రవంతి కన్వీనర్, నందూరి దత్తు స్వాగతం పలుకగా, కృష్ణశ్రీ వందన సమర్పణ చేశారు.

# శిలాలోలిత రచనల ఆవిష్కరణ

సాహితీ స్రవంతి ఆధ్వర్యంలో 'శిలాలోలిత' రచనల ఆవిష్కరణ సభ జూన్ 17న హైదరాబాద్ సుందరయ్య విజ్ఞాన కేంద్రంలో జరిగింది. గోరటి వెంకన్న అధ్యక్షతన జరిగిన ఈ సభలో 'నారి సారించి' సాహిత్య వ్యాసాలను ప్రముఖ కవి కె. శివారెడ్డి, రచయిత్రి కొండవీటి సత్యవతి ఆవిష్కరించారు. 'కవయిత్రుల కవిత్వం - పరిశీలన' సిద్ధాంత గ్రంథాన్ని రచయిత్రి ఓల్గా, 'ఎంతెంత దూరం' కవితా సంపుటిని ప్రముఖ సాహితీవేత్త దేవిప్రియ ఆవిష్కరించారు. ఈ సందర్భంగా దేవిప్రియ మాట్లాడుతూ ఆమె పరిశోధనలలోనూ, విమర్శలోనూ స్త్రీ స్పృహ వెన్నంటి ఉంటున్నదని చెప్పారు. కె.శివారెడ్డి మాట్లాడుతూ, స్త్రీల సాహిత్య చరిత్ర నిర్మాణంలో ఆమె రాసిన గ్రంథాలు మైలురాయిగా నిలిచిపోతాయని చెప్పారు. జిలుకర శ్రీనివాస్ ప్రసంగంలో విశ్లేషించారు. కొండవీటి సత్యవతి మాట్లాడుతూ స్త్రీవాదం మీద ప్రేమ, స్త్రీల రచనల పట్ల అనురక్తి ఈ రచనల్లో అంతర్లీనంగా ప్రవహిస్తున్నాయని కొనియాడారు. ఓల్గా మాట్లాడుతూ వర్తమాన స్త్రీవాద సాహిత్యాన్ని స్పర్శించి, ఆ సాహిత్య పురోగమనానికి అవసరమైన అంశాలను రచయిత్రి గుర్తించే ప్రయత్నం చేసిందన్నారు. రచయిత్రి శిలాలోలిత మాట్లాడుతూ, తన పరిశోధన కూడా స్త్రీల రచనల మీదే కావడంతో ఆ దిశలో సాహిత్య కృషి కొనసాగించినట్లు చెప్పారు. యాకూబ్ స్వాగతం పలికారు.



హైదరాబాద్ లిటరరీ ఫోరం (హెచ్ఎల్ఎఫ్) ఆధ్వర్యంలో ఎన్. గోపి రచించిన ఉర్దూ అనువాద గ్రంథం "గోపీకీ సౌ నజ్మే" (గోపి నూరు కవితలు)ను ఉర్దూ భాషాభివృద్ధి జాతీయ మండలి వైస్-ఛైర్మన్ ప్రొఫెసర్ షంసూర్ రహమాన్ ఫారూఖీ ఆవిష్కరిస్తున్న దృశ్యం. చిత్రంలో అధ్యక్షుడు ప్రొ. బేగ్ ఎహసాస్, కృతి స్వీకర్త ప్రొ. మొగినీ తబస్సుమ్, కవి గోపి, అనువాదకుడు ప్రొ. గయాస్ మతీన్, నిర్వాహకుడు సాజిద్ అజమ్‌లు ఉన్నారు.




విశాఖజిల్లా యలమంచిలిలో డాక్టర్ కె.ఎస్. రామచంద్రమూర్తి నేతృత్వంలో ఏర్పాటైన 'తెలుగు వెలుగు' ప్రారంభ సభలో ప్రసంగిస్తున్న డా|| పిలకా శాంతమ్మ. వేదికపై శిష్లా వెంకట్రావు, డా|| ఉపాధ్యాయుల అప్పల నరసింహమూర్తి, డా|| కె.ఎస్. రామచంద్రమూర్తి, ఇంద్రకంటి రామచంద్రమూర్తి ఉన్నారు.

# 'ఖిబ్లా' ఆవిష్కరణ

జూన్ 4న హైదరాబాద్‌లోని బషీర్‌బాగ్ ప్రెస్‌క్లబ్‌లో ఇస్లాంవాద సాహిత్య సదస్సు జరిగింది. ఈ సదస్సుకు షేక్ కరీముల్లా అధ్యక్షత వహిస్తూ యూరప్ వలస విధానం పలు రూపాల్లో కొనసాగుతూ దేశాన్ని అస్థిరత్వం పాలుచేస్తుందని, ప్రపంచీకరణ దుష్ఫలితాన్ని అన్ని సమాజాలు అనుభవిస్తున్నాయని అన్నారు. ముస్లిం కవిత్వానికి స్థిరత్వం ఇచ్చేందుకు 'ఇస్లాం' సైద్ధాంతిక తాత్విక భూమికగా ఇస్లాం వాదం తెలుగు సాహిత్యంలో మొదలైందని తెలియపర్చారు.



ముఖ్య అతిథిగా డాక్టర్ అద్దేపల్లి రామమోహనరావు, ఇస్లాం వాద కవితా సంకలనం "ఖిబ్లా", "సాయిబు" ఆడియో సిడి ఆవిష్కరించారు. తదనంతరం ఆయన మాట్లాడుతూ ముస్లింలపై సాంస్కృతిక దాడి ఎక్కువైందని, అన్ని సమాజాలు ఈ పరిస్థితుల్ని ఎదుర్కొంటున్నాయని చెప్తూ హిందువులు, ముస్లింలు సమైక్యంగా ఈ సాంస్కృతిక దుష్ప్రచారాన్ని ఎదుర్కోవాలని పిలుపిచ్చారు. 'ఖిబ్లా'లోని కవులు ముస్లింల ఆవేదనను, కలిసిమెలిసి వుండాలన్న తమ ఆకాంక్షలను చాలా బలంగా ఆవిష్కరించారని ప్రశంసించారు. కవి డాక్టర్ ఇక్బాల్ చంద్ మాట్లాడుతూ ముస్లిం సమాజానికి సరియైన దిక్కును ఈ ఖిబ్లా సూచిస్తుందని, ఇందులో ముస్లింల కలలూ, కన్నీళ్ళూ, ఆకలి వెతలూ వున్నాయని చెప్పారు. లక్నో యూనివర్శిటీ ప్రొఫెసర్ మహబూబ్ బాషా మాట్లాడుతూ ఇస్లాంపై ముస్లిం సమాజంపై దుష్ప్రచారం చేసే శక్తులు ఎక్కువైనాయని ఈ సందర్భంలో కరీముల్లా వంటి వాళ్ళు చేస్తున్న ఈ కృషి ప్రశంసనీయమని తెలిపారు. కవయిత్రి ఖాలిదా పర్వీన్, ఎం.డి. ఉస్మాన్‌ఖాన్ మాట్లాడారు. అజాద్ ముస్లిం రచయితల సంఘం లక్ష్యాలను వివరించారు. మహమ్మద్ షఫీ అహ్మద్ ఆహ్వానం పలికిన ఈ సభకు సయ్యద్ మక్సూద్ వందన సమర్పణ చేశారు.

# నిబద్ధతకు నిదర్శనం 'అరుణోదయం'

కవి నిబద్ధతకు నిదర్శనంగా సామాజిక బాధ్యతకు ఉదాహరణగా 'అరుణోదయం'ను పేర్కొనవచ్చని, అరవై వసంతాల తరువాత 'ముసలివాణ్ణి కాదు అసలు వాణ్ణి" అని ఈ కవితా సంకలనాన్ని వెలువరించి కర్నాటి సత్యశ్రీ నిరూపించారని ఆవిష్కరణ సభలో వక్తలు కొనియాడారు. మే 20న మధిర ప్రభుత్వ ఉన్నత పాఠశాల ఆవరణలో సాహితీ స్రవంతి ఆధ్వర్యాన 'అరుణోదయం' కవితా సంకలన ఆవిష్కరణ సభ జరిగింది. జిల్లా కార్యదర్శి కె. ఆనందాచారి అధ్యక్షతన జరిగిన ఈ సభలో ముఖ్య అతిథిగా మధిర శాసనసభ్యులు కట్టా వెంకట నర్సయ్యగారు పాల్గొన్నారు. సంకలనాన్ని సాహితీ స్రవంతి రాష్ట్ర కన్వీనర్ తెలకపల్లి రవిగారు ఆవిష్కరించి నేటి సాహిత్య సాంస్కృతిక ప్రభావాలపై ప్రసంగించారు. పుస్తకాన్ని రౌతు రవి పరిచయం చేశారు. ఇంకా ఈ



సభలో డాక్టర్ వాసిరెడ్డి రామనాథం, రామిశెట్టి రోశయ్య, సత్యానందం, పుతుంబాక కృష్ణప్రసాద్, శశిశ్రీ మొదలైనవారు పాల్గొన్నారు. మీరాఖాన్ ఆహ్వానం పలుకగా రాజేశ్వరరావు వందన సమర్పణ చేశారు.

# 'నందివర్ధనాలు' ఆవిష్కరణ

ఇటీవల శ్రీమతి కందేపి రాణీప్రసాద్ రచించిన నందివర్ధనాలు (నానీలు) గ్రంథాన్ని జ్ఞానపీఠ అవార్డు గ్రహీత డా॥ సి. నారాయణరెడ్డి ఆవిష్కరించారు. ఈ కార్యక్రమం హైదరాబాద్ శ్రీ త్యాగరాయ గానసభలో 'కిన్నెర ఆర్ట్ థియేటర్స్' ఆధ్వర్యంలో జరిగింది. ముఖ్య అతిథి సినారె ప్రసంగిస్తూ "నానీలు" సరికొత్త ప్రయోగమనీ, ఇప్పటిదాకా 51 పుస్తకాలు వెలువడ్డాయని తెలుగు సాహిత్య చరిత్రలో నానీ రూప ప్రక్రియకు ఒక ప్రకరణం కేటాయించవలసి ఉంటుందని అన్నారు. డా॥ ఎన్. గోపి సభకు అధ్యక్షత వహించగా డా॥ ఎస్. రఘు నందివర్ధనాలను సాధికారికంగా సమీక్షిస్తూ సుదీర్ఘ ప్రసంగం చేశారు. రాణీప్రసాద్ తన గ్రంథాన్ని ప్రముఖ పిల్లల డాక్టరు ఆమె జీవిత భాగస్వామి అయిన డా॥ కె. ప్రసాదరావుకు అంకితమిచ్చారు. చివర్న కిన్నెర సభ్యులు శ్రీమతి ఎన్. అరుణ, తదితరులు కవయిత్రిని



సత్కరించారు. సభలో గానసభ అధ్యక్షులు కళా వెంకట దీక్షితులు, కిన్నెర కార్యదర్శి మద్దాలి రఘురాం, కన్వీనర్లు కె.వి. సుబ్బారావు, ద్వారకానాథ్, పి. సతీష్ తదితరులు పాల్గొన్నారు.

# శ్రీ శ్రీ వారసత్వం వర్ధిల్లాలి

సాహితీ స్రవంతి ఆధ్వర్యంలో శ్రీశ్రీ 23వ వర్ధంతిని పురస్కరించుకుని జూన్ 15న కవులు, రచయితలు, సాహిత్యకారులు హైదరాబాద్ ట్యాంక్‌బండ్‌పై ఉన్న శ్రీశ్రీ విగ్రహానికి పూలమాలలు వేసి ఘనంగా నివాళులర్పించారు. ఈ సందర్భంగా జరిగిన సభలో ప్రముఖ కవి జ్వాలాముఖి మాట్లాడుతూ శ్రీశ్రీ తెలుగుసాహిత్యంలో మరో ప్రపంచాన్ని సృష్టించాడని అన్నారు. ప్రగతి శీల సాహిత్యానికి దిక్సూచిగా నిలిచిన శ్రీశ్రీ ఎప్పటికీ స్ఫూర్తిగా నిలుస్తారని అన్నారు.

సాహితీ స్రవంతి రాష్ట్ర కన్వీనర్ తెలకపల్లి రవి మాట్లాడుతూ శ్రీశ్రీ కి ముందు సాహిత్యం వేరు శ్రీశ్రీ వచ్చినతర్వాత తెలుగు సాహిత్యం వేరు అన్నారు. శ్రీశ్రీ రాకతో తెలుగు సాహిత్యపు చూపు మారిందని అన్నారు. సామ్రాజ్యవాద ప్రపంచీకరణపై పోరాడే ప్రజాస్వామిక శక్తులు మరోప్రపంచకవిగా శ్రీశ్రీ సాహిత్యం నుండి స్ఫూర్తి పొందుతూనే వుంటారు. శ్రీశ్రీ భావాల స్ఫూర్తిని, సాహిత్య వారసత్వాన్ని మరింత ముందుకు తీసుకు వెళ్ళడానికి ప్రగతిశీల, లౌకిక దృక్పథం కలిగిన రచయితలను, కవులను, సాహిత్యకారులను అందరినీ కలుపుకొని కృషిచేస్తుందని అన్నారు.

విమర్శకులు, బహుగ్రంథకర్త ద్వానా శాస్త్రి ఉద్వేగంగా శ్రీశ్రీ గేయాలను ఆలపించి సభికులను ఆకట్టుకున్నారు. ఇంకా ఈ సభలో ప్రముఖ సాహిత్యకారులు అద్దేపల్లి రామ్మోహనరావు, హిమగిరి నిర్వాహకులు సత్యన్నారయణ, ఓల్గా, అక్కినేనికుటుంబరావు, నరహరి,అరిబండి ప్రసాద్, యాళ్ళ అచ్యుతరామయ్య, కె.ఆర్. చౌదరి, బండ్ల మాధవరావు, గేరా, కె.పి. అశోక్ కుమార్, సత్యభాస్కర్, తంగిళ్ళపల్లి కనాకాచారి, యాదగిరి రావు, పైడి సత్యవతి, మహాలక్ష్మి, నరేష్, శర్మ ఉదయ్‌శంకర్, వొరప్రసాద్, రవీంద్ర తదితరులు పాల్గొన్నారు. ఈ సందర్భంగా ప్రజానాట్యమండలి కళాకారులు గేయాలు ఆలపించారు.

### అద్దేపల్లికి శ్రీశ్రీ పురస్కారం

జూన్ 15న శ్రీ త్యాగరాయ గానసభలో హిమగిరి ఆర్ట్ థియేటర్స్ ఆధ్వర్యంలో మహాకవి శ్రీశ్రీ సంస్మరణ దినోత్సవం సందర్భంగా కవి, విమర్శకులు డాక్టర్ అద్దేపల్లి రామమోహనరావుకు శ్రీశ్రీ సాహితీ పురస్కార ప్రధానోత్సవం జరిగింది. ఈ కార్యక్రమానికి ముఖ్య అతిథిగా విచ్చేసిన సినారె మాట్లాడుతూ వస్తువు, శైలి, భావంలో అంతే వారసత్వాన్ని పుణికిపుచ్చుకున్న డాక్టర్ అద్దేపల్లి రామమోహనరావుకు శ్రీశ్రీ స్మారక అవార్డు సత్కార యోగ్యుడని అన్నారు. విమర్శకులు, రచయిత డాక్టర్ ద్వా.నా. శాస్త్రి సభాధ్యక్షత వహించిన ఈ కార్యక్రమంలో కె.పి. అశోక్‌కుమార్, పల్లా సత్యనారాయణ తదితరులు పాల్గొన్నారు.



సభలో ప్రసంగిస్తున్న మేడిపల్లి రవికుమార్, వేదికపై (ఎడమనుంచి) సత్యరంజన్, ఎస్. వెంకట్రావు, బొమ్మారెడ్డి, తెలకపల్లి రవి

## విజయవాడలో 'శ్రీశ్రీ' సభామందిరం ప్రారంభం

ఆధునిక తెలుగు సాహిత్యాన్ని అమితంగా ప్రభావితం చేసిన మహాకవి 'శ్రీశ్రీ' పేరుతో ప్రజాశక్తి భవనంలో ఏర్పాటు చేసిన 'శ్రీశ్రీ' మందిరాన్ని ప్రజాశక్తి దినపత్రిక పూర్వ సంపాదకులు వి.ఆర్. బొమ్మారెడ్డి జూన్ 17 సాయంత్రం ప్రారంభించారు. సాహితీ, సాంస్కృతిక రంగాలకు కేంద్రమైన విజయవాడలో సాహిత్యాభిరుచిని మరింత ప్రోత్సహించేందుకు పాలపర్తివారి వీధిలోని ప్రజాశక్తి భవనం మొదటి అంతస్తులో ఈ సభా మందిరాన్ని ప్రారంభించారు. ఈ సందర్భంగా బొమ్మారెడ్డి మాట్లాడుతూ కమ్యూనిజం భావాలను అందిపుచ్చుకొని కార్యాచరణలో కూడా చూపించిన అతి కొద్ది మంది కవుల్లో శ్రీశ్రీ గొప్పవారని చెప్పారు. అటువంటి విశిష్టమైన అభ్యుదయ కవి పేరుతో ఏర్పాటు చేసిన శ్రీశ్రీ సభా మందిరాన్ని తాను ప్రారంభించడం ఆనందంగా, గర్వంగా ఉందని చెప్పారు. నగరంలో సాహితీ వికాసానికి ఈ ప్రాంగణం కేంద్రంగా ఎదగాలని ఆకాంక్షను వ్యక్తం చేశారు. ప్రజాశక్తి దినపత్రిక సహాయ సంపాదకులు ఎస్. వెంకట్రావు సభా మందిరం గురించి పరిచయం చేస్తూ ప్రజాశక్తి దినపత్రికకు ఈ భవనం కేంద్రంగా పని చేసిం దన్నారు. ప్రధాన కేంద్రం హైదరాబాద్‌కు తరలివెళ్ళిన తరువాత తిరిగి పాత భవనంలోకి పత్రిక కార్యాలయాన్ని మార్పు చేశామని చెప్పారు. ఖాళీగా ఉన్న ఈ భవనం కింది భాగంలో ప్రజాశక్తి బుక్‌హౌస్ షోరూంను ప్రారంభించనున్నా మన్నారు.

### వర్ధంతిసభ

'శ్రీశ్రీ' సభా మందిరంలో సాహితీ స్రవంతి ఆధ్వర్యాన 'శ్రీశ్రీ' వర్ధంతి సభ సాయంత్రం జరిగింది. ప్రధాన వక్తగా విచ్చేసిన తిరుపతి శ్రీ వెంకటేశ్వర విశ్వవిద్యాలయం అసోసియేట్ ప్రొఫెసర్ మేడిపల్లి రవికుమార్ మాట్లాడుతూ ఆధునిక తెలుగు సాహిత్యంలో 1930 నుంచి 1950వ దశకం వరకూ మహాకవి శ్రీశ్రీ అద్భుతమైన సాహిత్యాన్ని తెలుగు జాతికి అందించారన్నారు. అప్పటి వరకూ ఆకాశంలో విహరిస్తున్న సంప్రదాయ కవిత్వాన్ని భూమార్గం పట్టించి భూకంపం సృష్టించారని చెప్పారు. అభ్యుదయ సిద్ధాంతాలకు శ్రీశ్రీ అక్షర రూపమిచ్చారని తెలకపల్లి రవి చెప్పారు. సాహిత్యంలో ఆయన చేసిన అనేక ప్రయోగాలు నేటి సాహిత్యంలో స్థిరపడ్డాయన్నారు. నిర్వచనాలు, నిర్మాణాలు, నమూనాలనేకం ఆయన కవిత్వంలో మనం చూడవచ్చని చెప్పారు. శ్రీశ్రీ సభా మందిరం గురించి ప్రజాశక్తి పత్రిక ప్రారంభంలో శ్రీశ్రీ 'రా ప్రజాశక్తీ... రా ప్రజాశక్తీ' అంటూ స్వాగతించారని గుర్తుచేశారు. ఈ ప్రాంగణం నగరంలో సాహితీ వికాసానికి కేంద్రంగా భాసిల్లాలని ఆకాంక్షను వ్యక్తం చేశారు. సభకు అధ్యక్షత వహించిన సాహితీ స్రవంతి నగర కన్వీనర్ సత్యనిరంజన్ మాట్లాడుతూ గడిచిన రెండు సంవత్సరాల కాలంలో తమ సంస్థ నిర్వహించిన సాహితీ సేవలను సభకు వివరించారు. సభకు విజయవాడ ఎడిషన్ న్యూస్ కో-ఆర్డినేటర్ యు. రామకృష్ణ స్వాగతం పలికారు. తొలుత ప్రజానాట్యమండలి కళాకారులు రాజేష్ బృందం ఆలపించిన పలు అభ్యుదయ గీతాలు ప్రేక్షకులను అలరించాయి.

## కరీంనగర్ వర్ధమాన రచయితల మహాసభలు

సమాజ మేలు కోరేదే ఉత్తమ సాహిత్యం అని అధికార భాషా సంఘం సభ్యులు డా॥ కాలువ మల్లయ్య అన్నారు. జూన్ 4న వాణీ నికేతన్ సెమినార్ హాలులో ఉదయ సాహితీ ఆధ్వర్యంలో కరీంనగర్ జిల్లా వర్ధమాన రచయితల మహాసభలలో ప్రారంభోపన్యాసం చేస్తూ సాహిత్యం వ్యక్తికి దిశా నిర్దేశనం చేస్తుందని, సమాజాన్ని మంచి వైపుకు తీసుకొని వెళుతుందని అన్నారు. కాకతీయ విశ్వవిద్యాలయం పాలక మండలి సభ్యులు చీటి అయోధ్య రామారావు మాట్లాడుతూ మానవీయ విలువలతో సమాజాన్ని కాపాడే వారే కవులని అన్నారు. పోలేపల్లి వెంకటరెడ్డి ముఖ్య అతిథిగా పాల్గొన్నారు. కార్యదర్శి వార్షిక నివేదికను సముద్రాల వేణుగోపాలాచార్యులు సమర్పించారు.

దాస్యం లక్ష్మయ్య సంపాదకత్వంలో ఆకాశంలో సగం, డా॥ టి. శ్రీరంగస్వామి సంపాదకత్వంలో సంగతి కథల సంపుటి, కూకట్ల తిరుపతి చదువులమ్మ శతకం, జమారా కవితాధార జగన్నాధవరావు గారి కవితా సంపుటిని ఆవిష్కరించినారు. ఈ ఆవిష్కరణ సభలో అనిశెట్టి రజిత, దాస్యం సేనాధిపతి, కె.ఎస్. అనంతాచార్య, డా॥ జి. లక్ష్మణరావు, మాడిశెట్టి గోపాల్ పాల్గొన్నారు.

మూడవ సభ (కవిత్వ సభ)లో కవిత్వం విస్తృతి కలదని, ఈ విస్తృతి చాల వేగంగా ముందుకు వెళుతుందని, సాహితీ ప్రక్రియలన్నింటిలోనూ మూల కేంద్రంగా కరీంనగర్ పనిచేస్తుందని డా॥ పత్తిపాక మోహన్ అన్నారు. అధిక్షేప కవిత్వంపై డా॥ డింగరి నరహరి ఆచార్య ప్రసంగించారు. కార్యక్రమంలో ఎన్నం సత్యం, ఏలేశ్వరం వెంకటేష్ తదితరులు ప్రసంగించారు. కథకు సంబంధించిన సెమినార్‌కు జూకంటి జగన్నాథం అధ్యక్షత వహించారు. కరీంనగర్ కథ – వలస బతుకులు అంశంపై పెద్దింటి అశోక్‌కుమార్, జిల్లా కథా సాహిత్యంపై బి.వి.ఎన్. స్వామి, తెలంగాణా కథా వస్తు వైవిధ్యంపై కర్ర ఎల్లారెడ్డి తదితరులు ప్రసంగించారు. వేణుశ్రీ అధ్యక్షత వహించిన భాషా సదస్సులో తెలంగాణా భాష గురించి అన్నవరం దేవేందర్ ప్రసంగించగా, చిన్న పత్రికల సాహిత్య సేవ గురించి దూడం మనోహర్ ప్రసంగించారు. ముగింపు సభకు కొండ్ల రామచంద్రం అధ్యక్షత వహించారు. ఈ కార్యక్రమంలో కరీంనగర్, వరంగల్, నిజామాబాద్, ఖమ్మం, మెదక్ జిల్లాల నుండి సుమారు 100 మంది కవులు పాల్గొన్నారు.

సభల ప్రారంభంలో పుస్తక ప్రదర్శనను సబ్బని లక్ష్మీనారాయణ, కవితా చిత్ర ప్రదర్శనను అన్నవరం శ్రీనివాస్ ప్రారంభించారు. గెంటాల రవీందర్, తిరుణహరి శ్రీకాంత్, వలువోజు భాస్కరాచారి, జయంత్ శర్మ, మహేందర్ రాజు, సాధనాల వెంకటస్వామినాయుడు, నడిమెట్ల రామయ్య, కె.వి. పుల్లయ్య తదితరుల కవితలు సభికులను ఆకట్టుకున్నాయి.

## ఫనాపై ఆంక్షలకు నిరసన

అమీర్‌ఖాన్ నటించిన ఫనా చిత్రం గుజరాత్‌లో విడుదల కానివ్వకుండా ఆటంకాలు కల్పించడం గర్హనీయమని సినీ ప్రముఖులు, రచయితలు, కళాకారులు ఖండించారు. రవీంద్రభారతి కాన్ఫరెన్స్ హాలులో ప్రజానాట్యమండలి ఈ విషయమై రౌండ్ టేబుల్ కాన్ఫరెన్స్ నిర్వహించింది. రాష్ట్ర ప్రభుత్వ పెట్టుబడుల సలహాదారు, చిత్ర నిర్మాత సిసిరెడ్డి, దర్శక నిర్మాత తమ్మారెడ్డి భరద్వాజ, దర్శకుడు ధవళ సత్యం, నటుడు జీవా, సాహితీ స్రవంతి రాష్ట్ర కన్వీనర్ తెలకపల్లి రవి, రచయితలు జ్వాలాముఖి, చంద్రశేఖర్ ఆజాద్, ఆవాజ్ రాష్ట్ర కార్యదర్శి అబ్బాస్ తదితరులు ఈ చర్చలో పాల్గొన్నారు, గుజరాత్‌లో నర్మదా ఆనకట్ట వల్ల నిర్వాసితులైన వారికి న్యాయం జరగాలని కోరిన నేరానికి అమీర్‌ఖాన్‌పై కత్తి కట్టడం అన్యాయమని పేర్కొన్నారు. వాస్తవానికి ఆయన మైనారిటీ కావడం, ఇటీవలి సంవత్సరాలలో గుజరాత్‌లో సాగుతున్న మత మారణహోమపు నేపథ్యం కూడా దీని వెనక వున్నాయని అభిప్రాయపడ్డారు. కళా సృష్టిలో భావ ప్రకటనా స్వేచ్ఛను, సామాజిక సమస్యలపై అభిప్రాయాల వ్యక్తీకరణను అడ్డుకునేట్టయితే ప్రజాస్వామ్యం అర్థ రహితమని పేర్కొన్నారు. డావిన్సికోడ్ చిత్ర విడుదలను నిలిపివేస్తూ కొన్ని రాష్ట్ర ప్రభుత్వాలు చేసిన నిర్ణయాన్ని కూడా వక్తలు విమర్శించారు. ప్రజానాట్యమండలి కార్యదర్శి రమేష్ ప్రవేశపెట్టిన తీర్మానాన్ని సమావేశం ఆమోదించింది. కార్యక్రమానికి మండలి ఉపాధ్యక్షులు జగ్గరాజు అధ్యక్షత వహించారు.




ఏప్రిల్ నెలలో హైదరాబాద్‌లో "జీవన రేఖలు" ఆవిష్కరణ సభలో అధ్యక్షోపన్యాసం చేస్తున్న ప్రముఖ పాత్రికేయులు జి.ఎస్. వరదాచారి. చిత్రంలో ఆర్.ఎన్. గణేశ్వరరావు, డాక్టర్ తిరుమల శ్రీనివాసాచార్య, గ్రంథకర్త కె.వి. రమణాచారి, బి. సుబ్బరాయన్, ఆర్.వి. రామారావు




ఆంధ్ర సారస్వత సమితి, మచిలీపట్నం ఆధ్వర్యంలో ఏప్రిల్ 23వ తేదీన గ్రంథావిష్కరణ కొట్టి రామారావు రచన లైట్‌హౌస్ కిరణాలు – నానీలు, జిసనారా రచన అక్షర క్షణాలు – నానీలు రెండింటిని గోపీ ఆవిష్కరించారు. లైట్‌హౌస్ కిరణాలు శ్రీమతి అరుణ సమీక్షించారు. గోపీకి 'నానీల నాన్న' అనే బిరుదును ఆంధ్ర సారస్వత సమితి ఇచ్చింది. ఈ సందర్భంగా 12 సాహిత్య ప్రక్రియల్లో 15 మంది కవులకు ఒక్కొక్కరికి రూ. 1,116/-లు ఆంధ్ర సారస్వత సమితి ఉగాది సాహిత్య పురస్కారాలిచ్చింది

# 'నాదాలు - నా పదాలు' ఆవిష్కరణ

నల్లగొండ విద్యావేత్త కె. చినవెంకటరెడ్డి ప్రతిభ కలిగిన బాలబాలికలకు చేయూతనివ్వాలనే ఉద్దేశ్యంతో కొండకింది చినవెంకటరెడ్డి తారకమ్మ ఫ్యామిలీ ట్రస్టు ఏర్పాటు చేశారు. ఆయన కుమారుడు డాక్టర్ కె. పూర్ణచంద్రారెడ్డి ఈ ట్రస్టుకు లైఫ్ ప్రెసిడెంట్‌గా కొనసాగుతున్నారు.

ట్రస్టు మూడవ కార్యక్రమంగా మే 28వ తేదీన కవి సమ్మేళనం, పుస్తకావిష్కరణలు, ప్రతిభా పోటీల బహుమతి ప్రదానం నిర్వహించారు.

జాతీయ సమైక్యత, మానవత విలువు, స్వభాషాభిమానం, నేటి యువత భవిత, పర్యావరణ పరిరక్షణ అనే అంశాలపై జిల్లాలో కవుల సమ్మేళనం జరిగింది.

పి. రామ్‌నారాయణ్, ఐ.పి.ఎస్. రచించిన "నాదాలు - నా పదాలు", "తీర్థం" పుస్తకాల ఆవిష్కరణలు, అంకితోత్సవం జరిగింది. ప్రముఖ రచయిత్రి డాక్టర్ ముదిగంటి సుజాతారెడ్డి అధ్యక్షతన రెండు పుస్తకాల ఆవిష్కరణలు జరిగాయి. ముఖ్య అతిథి డాక్టర్ ఎన్. గోపి సందేశం - సమీక్షణం చేశారు. విశిష్ట అతిథులు ఆచార్య రవ్వ శ్రీహరి, ఆచార్య డి. రామచంద్రం ముఖ్య సందేశాలు చేశారు. సినీ కవి సిరివెన్నెల సీతారామశాస్త్రి "తీర్థం" పుస్తకాన్ని ఆవిష్కరించి సమీక్షణం చేశారు. పి. రామ్‌నారాయణ్ రచించిన తీర్థం పుస్తకాన్ని కొండకింది చిన వెంకటరెడ్డి తారకమ్మ ఫ్యామిలీ ట్రస్టు చైర్మన్ కె. చినవెంకటరెడ్డికి కృతిగా అంకితం చేశారు.



'నాదాలు - నా పదాలు' కవితా సంపుటిని ఆవిష్కరిస్తున్న డాక్టర్ ఎన్. గోపి.

మే 14, 21 తేదీలలో చిన వెంకటరెడ్డి ఫంక్షన్ హాలులో నిర్వహించిన జిల్లా స్థాయి ప్రతిభా పోటీలలో గెలుపొందిన వారికి జ్ఞాపికలు, ప్రశంసాపత్రాలను ప్రముఖులు అందజేశారు. అనంతరం సాంస్కృతిక ప్రదర్శనలు జరిగాయి.

వంద పద్యాలను కంఠస్తం చేసిన వారికి వెయ్యి నూట పదహార్లు నగదు అందజేయటం, తెలుగు భాషా విశిష్టతను విద్యార్థి స్థాయి నుండి కళాశాల స్థాయి వరకు తెలియచెప్పటం ట్రస్టు కార్యక్రమాలలో ప్రధానంగా తీసుకుంటున్నారు.

ట్రస్టు చైర్మన్ కె. చినవెంకటరెడ్డి మాట్లాడుతూ ఆర్థికంగా వెనుకబడిన, ప్రతిభ చూపిన విద్యార్థులకు ప్రతి ఏటా ప్రతిభా పురస్కారాలు అందజేస్తామన్నారు.

# విరసం 20వ మహాసభలు

విప్లవ రచయితల సంఘం 20వ మహాసభలు జూన్10,11 తేదీలలో హైదరాబాద్‌లో జరిగాయి. మగ్దూమ్ ప్రాంగణం, పాణిగ్రాహి హాల్, చెరబండరాజు వేదికపై ప్రారంభ సభకు సంఘం అధ్యక్షుడు జి.కళ్యాణరావు అధ్యక్షత వహించారు. విరసంపై నిషేధాన్ని ఎత్తివేసినప్పటికి అనేక విధాలుగా ప్రభుత్వం దానికి సంబంధించిన వారిపై నిర్బంధం వేధింపులు కొనసాగిస్తున్నదని నాయకులు విమర్శించారు. ఎంటి ఖాన్ ప్రారంభోపన్యాసం చేయగా గద్దర్, ముదిగంటి సుజాతారెడ్డి మాట్లాడారు. ఈ సందర్భంగా రచయిత ప్రజల మనిషి అన్న అంశంపై గోష్టి జరిగింది. ఎస్వీ సత్యనారాయణ, తెలకపల్లి రవి, దివికుమార్, నందిని సిదారెడ్డి, వాసిరెడ్డి సీతాదేవి, సైబాబా తదితరులు మాట్లాడారు. రెండవ రోజున వరవరరావు జైలు రాతలు పుస్తకాన్ని శ్రీధర్ దేశ్‌పాండే, కళ్యాణరావు అమృత దంపతుల సంయుక్త రచన మా ఇద్దరి కవిత్వం జూలూరి గౌరీ శంకర్ ఆవిష్కరించారు. వివిధ అంశాలపై గోష్టులు జరిగాయి. కళారూపాలు ప్రదర్శించారు.

# 'డైరీ'పై సూచనలు

- ★ మరీ ఆలస్యమైనవి పంపవద్దు
- ★ సంక్షిప్తంగా పంపండి
- ★ విపరీత పొగడ్తలు, బిరుదులు, సుదీర్ఘ సమీక్షలు ప్రచురించలేము.
- ★ ఫొటోలు విభిన్నంగా వుంటే మంచిది.
- ★ దినపత్రికలకు పంపింది యథాతథంగా ఇవ్వకుండా ప్రస్థానంను దృష్టిలో వుంచుకుని క్లుప్తంగా తిరగరాయగలరు.
- ★ నేరుగా మాకు చేరిన వాటినే ప్రచురించగలము.

# "తెలంగాణా కవిత"కు వచన కవితలు

తెలంగాణా దశాబ్దాలుగా దోపిడీకి గురవుతున్నది. రాసేటోళ్ళు, పాడేటోళ్ళు, ఆడేటోళ్ళు అందరూ తెలంగాణపై ఆరివారం సూపుతున్నరు. గాళ్ళందరినీ ఒక దగ్గరికి తీసుకురావాలనే ప్రేమతో "తెలంగాణా కవిత" త్వరలో బయటికి రానున్నది. తెలంగాణాపై ఆరివారం ఉన్నోళ్లంతా తెలంగాణా సమస్యల గురించి, తెలంగాణ జనజీవన సంస్కృతిని గురించి, తమకు తెలిసినదంతా ఇరవైదు గీతలకు మించకుండా రాసి పంపుండ్రి.

అయితే, కవితలు మన తల్లి పాల లెక్కన అచ్చమైన తెలంగాణ మాండలికంలో కవితలు రాసి పంపుండ్రి. మీ కవితతో పాటు ఫొటో, చిరునామా కూడా పంపాలె. పురుడుపోసి బతికించండి. మీ వచన కవితలు పంపనీకె చివరి తేదీ జూన్ 30, 2006.


<u>వచన కవితలు పంపే చిరునామా</u>

భీంపల్లి శ్రీకాంత్, అధ్యక్షులు, పాలమూరు సాహితీ, ఇ.నెం. 8-5-10/12,,టీచర్స్ కాలనీ, పాలమూరు - 509 9001 ఫోన్ : 08542 - 270563




**కవుల పక్షం**
మాల్యశ్రీ, తాతోలు దుర్గాచారి
వెల : రు. 100




**అనగనగా కాలం**
అనిసెట్టి రజిత
వెల : రు. 50




**బతుకు పయనం**
బి.ఎస్. రాములు
వెల : రు. 45




**నాట్యశాస్త్ర మర్యాదలు**
నందవరం మృదుల
వెల : రు. 60




**పడవలో చిన్నదీపం**
రేణుక అయోల
వెల : రు. 50




**తెలంగాణా పోరాట కథలు**
సమ్మెట నాగమల్లీశ్వరరావు
వెల : రు. 60




**జాతర నవల సమగ్ర పరిశీలన**
ఎం. శ్రీరాములు
వెల : రు. 40




**విశాఖా... నా విశాఖా!**
విద్యాసాగర్
వెల : రు. 75




**వెయ్యి నూట పదహార్లు**
డా॥ రావి రంగారావు
వెల : రు. 116




**ఒక మానవతా వృక్షచ్ఛాయలో**
గన్ను కృష్ణమూర్తి
వెల : రు. 50




**ఉదాత్త చరితుడు గిడుగు**
గిడుగు రాజేశ్వరరావు
వెల : రు. 120



**నిద్ర తలుపు అను పొడవైన గదివేళ్ళు**
బి.యస్.యమ్. కుమార్
వెల : రు. 50

64

Printed, Published and owned by **V. Krishnaiah** 1-1-298/4, Street No-1, Ashoknagar, Hyderabad-20,
Printed at Prajashakti Daily Printing Press. 1-1-60/2, M.B. Bhavan, Musheerabad, Hyderabad,
Published at **Shaitya Prasthanam** 1-1-60/2, M.B. Bhavan, Musheerabad, Hyderabad-20. **Editor: T. Ravi**

ఆల్బం

# ఆరుద్ర

**(1925 - 1989)**





సుప్రసిద్ధ అభ్యుదయ కవి, రచయిత, పరిశోధకుడు, విమర్శకుడు, త్వమేవాహంతో తెలుగు కవిత్వంలో కొత్త ప్రయోగశైలి ప్రారంభించారు. అనేక కావ్యాలు, పరిశోధనా గ్రంథాలు రాశారు. సమగ్ర ఆంధ్ర సాహిత్యం 13 సంపుటాలు ఒక చేతి మీదుగా రచించి తెలుగు సాహిత్యానికి ఎనలేని సేవ చేశారు.

## ఉపాధ్యాయులు, తల్లితండ్రులు చదువవలసిన పుస్తకాల జాబితా

| క్ర.స | పుస్తకం పేరు | వెల |
|---|---|---|
| 1. | పిల్లలు నేర్చుకోవడంలో ఎలా వెనకబడతారు? | 60.00 |
| 2. | పిల్లలు ఎలా నేర్చుకుంటారు | 60.00 |
| 3. | టీచర్ | 40.00 |
| 4. | విముక్తి-విద్య | 40.00 |
| 5. | టీచర్లకు ఉత్తరం | 40.00 |
| 6. | మాస్టారూ...! | 10.00 |
| 7. | మీ ఒడిలో | 10.00 |
| 8. | కథలే పాఠాలు | 25.00 |
| 9. | బోధన-శోధన | 30.00 |
| 10. | విభిన్న విద్యా సంస్థలు | 25.00 |
| 11. | భాష-భావం | 20.00 |
| 12. | మీరు - మీ పిల్లలు | 15.00 |
| 13. | నల్లబల్ల వెనుక | 25.00 |
| 14. | చదువు సంధ్యలు | 25.00 |
| 15. | మహోజ్వల స్మృతులు | 35.00 |
| 16. | మనిషి కథ | 40.00 |
| 17. | చార్లీచాప్లిన్ | 25.00 |
| 18. | పరిణామక్రమంలో విద్యా వ్యవస్థ 1833-2003 | 15.00 |
| 19. | వేదభూమి | 10.00 |
| 20. | సమాజం-సైన్స్- సంప్రదాయం | 15.00 |
| 21. | సైన్సు చరిత్రలో సామాజికాంశాలు | 10.00 |
| 22. | పిల్లల అలవాట్లు | 25.00 |
| 23. | భారతదేశ చరిత్ర | 25.00 |
| 24 | పిల్లల భాష - ఉపాధ్యాయుడు | 25.00 |

## పిల్లలు చదివే పుస్తకాల జాబితా

| క్ర.స | పుస్తకం పేరు | వెల |
|---|---|---|
| 1. | మహావిశ్వం మన భూమి | 20.00 |
| 2. | ఆదర్శబాల్యం | 25.00 |
| 3. | విలియం షేక్స్పియర్ | 15.00 |
| 4. | హైడీ | 20.00 |
| 5. | విశ్వవిఖ్యాత శాస్త్రజ్ఞులు | 15.00 |
| 6. | విదేశీ కథలు | 15.00 |
| 7. | విజ్ఞాన శిఖరాలు | 15.00 |
| 8. | చైనా నీతి కథలు | 15.00 |
| 9. | భారతీయ శాస్త్రవేత్తలు | 15.00 |
| 10. | అందాల పార్కు | 15.00 |
| 11. | పిల్లల గణితం | 15.00 |
| 12. | పిల్లలు-పిడుగులు | 20.00 |
| 13. | సరదా సరదా చదువులు | 15.00 |
| 14. | తరగతిలో తమాషాలు | 15.00 |
| 15. | వానరుడు - నరావతరణ | 25.00 |
| 16. | చదువంటే మూడోకన్ను | 25.00 |
| 17. | పాడరా ఓ తెలుగువాడా | 15.00 |
| 18. | పిల్లల సంరక్షణ | 25.00 |
| 19. | అక్షరాలతో ఆటలు | 30.00 |
| 20. | నేర్చుకోడం మాకిష్టం | 20.00 |
| 21. | కథలంటే మాకిష్టం | 40.00 |
| 22. | ఆటలంటే మాకిష్టం | 30.00 |
| 23. | పాటలంటే మాకిష్టం | 20.00 |
| 24. | పాడుకొందాం | 25.00 |
| 25. | తేటతెలుగు-1 | 30.00 |
| 26. | తేటతెలుగు-2 | 30.00 |
| 27. | కొత్తబ్యాగ్ | 10.00 |
| 28. | బొటనవేలితోబొమ్మలు | 10.00 |
| 29. | పొడుపుకథలు-చింగ్‌చదువు | 15.00 |
| 30. | డంభాలమారి డాన్ క్విక్సాట్ | 25.00 |
| 31. | గణితసూత్రదీపిక | 20.00 |
| 32. | జంతువుల వింతభాష | 10.00 |
| 33. | జంతువుల వింతరుచులు | 10.00 |
| 34. | మూడు కథలు | 10.00 |
| 35. | నత్తగుల్ల స్వార్థం-బంగారుచేపగర్వం | 15.00 |
| 36. | అద్భుతాలనియం-నీరు | 10.00 |
| 37. | నోయా | 10.00 |
| 38. | బద్ధకం వదిలింది | 15.00 |
| 39. | బుడిబుడికథలు | 40.00 |
| 40. | పిల్లల ప్రశ్న-సైన్స్ జవాబు | 15.00 |
| 41. | మేమొచ్చేశాం | 20.00 |
| 42. | నిర్జీవం-జీవపరిణామం | 30.00 |
| 43. | సరదాసరదా లెక్కలు | 30.00 |
| 44. | విశ్వం-విజ్ఞానం | 25.00 |
| 45. | ప్రకృతిలో అద్భుతాలు-విజ్ఞానవిశేషాలు | 45.00 |
| 46. | కాలిక్యులేటర్ గేమ్స్ | 20.00 |
| 47. | అలెగ్జాండర్ గ్రాహంబెల్ | 10.00 |
| 48. | మేకపిల్ల మెడగంట-చిట్టెలుక కృతజ్ఞత | 15.00 |
| 49. | మంచిగా వుందాం | 30.00 |
| 50. | భలేకథలు | 10.00 |
| 51. | తోకతెగిన తోడేలు | 15.00 |
| 52. | బల్బు వెలిగింది | 20.00 |
| 53. | రవీంద్రనాథ్ ఠాగూర్ | 15.00 |
| 54. | వినయంలేని వీరుడు | 25.00 |
| 55. | బండి నుంచి మోటారుకు | 20.00 |
| 56. | చెట్టు | 15.00 |
| 57. | చిటపట చినుకులు | 20.00 |
| 58. | చిట్టిరాకుమారి-చందమామ | 10.00 |
| 59. | గుడ్డు నుంచి పిల్ల | 20.00 |
| 60. | కుకూ భూరీల కథ | 20.00 |
| 61. | మన కథ | 20.00 |
| 62. | నడిచేటి నావకథ | 20.00 |
| 63. | రహస్యం | 10.00 |
| 64. | ఎద్దు | 20.00 |
| 65. | మనమూ రాద్దామా? | 10.00 |
| 66. | బుచ్చిబాబు-బొమ్మకారు | 15.00 |
| 67. | యమునిదర్బారు | 10.00 |
| 68. | బంగారు జింక | 15.00 |
| 69. | మూడు ఏనుగులు | 15.00 |
| 70. | బొబక్ నేర్చిన పాఠం | 15.00 |
| 71. | పులి-తాబేలు | 10.00 |
| 72. | పింకి-పిల్లి | 10.00 |
| 73. | సైన్యాధిపతి గర్వభంగం | 15.00 |
| 74. | కుడి-ఎడమ | 10.00 |
| 75. | నాతప్పేమిటో! | 15.00 |
| 76. | నందువంట-నేస్తంతంటా | 10.00 |
| 77. | వంశీధర్ నిజాయితీ | 10.00 |
| 78. | జమిందారు వేట | 10.00 |
| 79. | అద్దంలో సింహం | 15.00 |
| 80. | సముద్ర నేస్తాలు | 15.00 |
| 81. | కప్పకల | 15.00 |
| 82. | కథలంటే మాకిష్టం-1 | 25.00 |
| 83. | కథలంటే మాకిష్టం-2 | 25.00 |
| 84. | రాబిన్‌సన్‌క్రూసో | 45.00 |
| 85. | నల్లగుర్రం | 25.00 |
| 86. | పెన్సిల్‌బాక్స్ | 15.00 |
| 87. | మంచి అమ్మ | 15.00 |
| 88. | కోతి ఫొటో | 25.00 |
| 89. | కథ కాని కథ | 15.00 |
| 90. | లోకంచుట్టిన వీరుడు | 40.00 |
| 91. | చివరి ఆకు | 10.00 |
| 92. | పెద్దల మాయం-పిల్లలరాజ్యం | 20.00 |
| 93. | నెలవంక | 25.00 |
| 94. | సాయపడే చేతులు | 20.00 |
| 95. | నీళ్ళు ఎందుకు తడిగాఉంటాయి? | 15.00 |
| 96. | బడి-బ్రతుకు | 25.00 |
| 97. | హిరోషిమా అగ్నిజ్వాలలు | 25.00 |
| 98. | సిసింద్రీలు | 20.00 |
| 99. | అద్దాలతో ఆటలు | 15.00 |

66

# ప్రజాశక్తి బుక్‌హౌస్

1-1-187/1/2, చిక్కడపల్లి, హైదరాబాద్-20. ఫోన్ : 27660013

గమనిక : పై పుస్తకాలు స్కూలు గ్రాంటు నుండి కాని, టీచర్ గ్రాంటు నుండి కానీ మీ స్కూలుకు కొనుగోలు చేసుకోవచ్చును. ప్రజాశక్తి బుక్‌హౌస్, హైదరాబాద్ పేరిట డి.డి./ఎం.ఓ. తీసి పంపవలెను.



మనసు ఫౌండేషన్

పుస్తకాల పరిశీలనాపట్టిక

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | PRSVM02A120 |
| పుస్తకం పేరు | ప్రస్థానం |
| తారీఖు | 25/5/24 |
| ముందు అట్ట | yes |
| వెనుక అట్ట | yes |
| మొత్తం పేజీలు | 69 |
| పెద్ద సైజు పేజీలు | NO |
| ఖాళీ పేజీలు | NO |
| లేని పేజీలు | NO |
| తయారు చేసినది | M. Lavanya |
| పేజీలు విడదీసినది | M. Lavanya |
| స్కాన్ చేసినది | Rakshetha |
| పరీక్ష చేసినది | NANDINI |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| స్కాన్ చెయ్యనివి | |
| తప్పులు | NO |
| పరిస్థితి | Good. |